శ్రీః అస్తు.

కృతి

# శ్రీభారతసారరత్నావళి.



కృతిపతి

చిత్తూరముకటుమంచిపుర నివాసులగు నాట్టారాహుడు

డిస్ట్రిక్టు కోర్టుప్లీడరు

## సుబ్రహ్మణ్యరెడ్డి

సర్వజనంబులకు చతుర్విధ పురుషార్థప్రదంబుగ

శ్రీమహాభారతంబునంగల సారతరపద్యంబుల నేర్చి

కూర్పఁబడి



చిత్తూరము గవర్నమెంటు హైస్కూల్ ఆంధ్రభాషాపండితులగు

శ్రీపులూరు కుప్పనయ్యంగార్లవలన

సవరింపఁబడి



చెన్నపురి:

తి. శ్రీనివాసయ్యగారి

"ఎక్సెల్సియర్" ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

శకము ౧౮౦౮.

పార్థివాబ్దము.

1885

FIRST EDITION.

శ్రీః అస్తు.

శ్రీ భా ర త సా ర ర త్నా వ ళి.

# అవతారిక.

శ్రీమచ్చెన్నపురి రాజధానికిఁ జేరిన నార్తార్కాడు డిస్ట్రిక్టు చిత్తూరను చిత్పురముచేరువనుండు కట్టమంచి గ్రామమంటలి పుడమితేఁడులైన పాకనాటివంశోద్భవులగు శ్రీమూఁడ్ రామలింగారెడ్డి పౌత్రుండును-వీరరాఘవరెడ్డిపుత్రుండునునగు సుబ్రహ్మణ్యరెడ్డి అనునేను శ్రీమదాంధ్రభారతమునందుఁగల సారతరపద్యంబులను ఈక్రిందవివరించు హేతువులంబట్టి ప్రాచుర్యముసేయఁదగినవిగా నిశ్చయించినాఁడను. ... ... ... *

శ్రీభారతము చతుర్వేదసారవంతమై యుక్తాయుక్తపరిజ్ఞానప్రదంబై ఐహికాముష్మిక ఫలప్రదంబులకు మిగులనుపయుక్తంబైన గ్రంథమగుటంజేసి యది తెనుంగున ముద్రితంబై యున్నయది. ... ... ... ... ... ... ... *

ఈగొప్పగ్రంథము భరతవంశజుల చారిత్రమయంబై అనేకోపాఖ్యానేతిహాసములతోఁ గూడియుండుటవలనఁ దదర్థిగర్భితములుగానుండు ప్రవృత్తి నివృత్తి మార్గములను గ్రహింపవలయునను శ్రద్ధగలవారు ఓపికతో విశేషకాలమును వినియోగింపవలసియుంటున్నయది. అట్లుచేయుటకు కాలదేశవర్తమానముల ననుసరించి యనేకుల కలివిగానుండ నేరదు. ... *

ఇందువలన శ్రీభారతాష్టాదశపర్వములం దచ్చటచ్చట వెదజల్లఁబడి ఇహపరసౌఖ్యములకు సాధకంబులై యుండు ము ఖ్యాంశంబులన్నియుఁ దేటపఱచెడు తద్గ్రంథస్థపద్యముల నే ర్చి ప్రచురించుట లోకులకు విశేషప్రీతికరముగానుండునని నాబుద్ధికి గోచరించినది. ... ... ... ... ... *

ఏతన్మిత్రము ఏను కూడినంత శ్రద్ధవుచ్చుకొని సాత్వి కాదిగుణములయొక్కయు- ప్రవృత్తి నివృత్తి మార్గములయొ క్కయు యుక్తాయుక్తవిధులును వాటిసాధక బాధకములును లోకులకు అనాయాసంబుగ గ్రాహ్యమగు తెఱంగున సదరు పద్యంబుల పంచప్రకరణంబులుగా విభాగించి అందొకొక్క భాగంబున నడంగఁదగిన తరగతులపద్యములను వాటిక్రిందఁ జేర్చి ఆపద్యంబులకన్నింటికి ౧౮౬౩ సంవత్సరమందలి వాణీ నికేతనమనుముద్రాక్షరశాలయందు చెన్నపురమున ముద్రింపఁ బడియుండు శ్రీమదాంధ్ర భారతమునందుండగలపుటలను సయి తము నిర్దేశించియున్నాఁడను. ... ... ... ... *

ఈ తెఱంగున నేర్పరుపఁబడియుండు శ్రీభారతసారాంశ రత్నావళియనునీగ్రంథము లోకులు ఇహపరసౌఖ్యాను వర్తు లగుటకుముఖ్యాధారంబుగ నుండుటయగాక విద్యార్థులగువా రు నీతిప్రయుక్తవిజ్ఞానభరితులై బుద్ధి వైశాల్యులగుచు సౌఖ్యా ర్థులగుటకుమిగుల సహాయకారిగానుండునని నమ్ముచున్నాఁడను.

# విషయసూచిక.

## ౧ - ఉత్పత్తిప్రకరణము.



## ౨ - సత్త్వాదిగుణ ప్రకరణము.



## ౩ - ప్రవృత్తిప్రకరణము.

## ౪ - నివృత్తి ప్రకరణము.

# ౫ - స్తుతి ప్రకరణము.





## ఈగ్రంథమున ప్రయోగింపబడియుండు సంగ్రహనామములు.

---

| | |
|---|---|
| ఆది. | ఆదిపర్వము. |
| సభా. | సభాపర్వము. |
| ఆర. | ఆరణ్యపర్వము. |
| విరా. | విరాటపర్వము. |
| ఉద్యో. | ఉద్యోగపర్వము. |
| భీష్మ. | భీష్మపర్వము. |
| ద్రోణ. | ద్రోణపర్వము. |
| కర్ణ. | కర్ణపర్వము. |
| శల్య | శల్యపర్వము. |
| సౌప్తి. | సౌప్తికపర్వము. |
| స్త్రీ. | స్త్రీపర్వము. |
| శాంతి. | శాంతిపర్వము. |
| అను. | అనుశాసనికపర్వము. |
| అశ్వ. | అశ్వమేధపర్వము. |
| ఆశ్ర. | ఆశ్రమవాసపర్వము. |
| మౌ. | మౌసలపర్వము. |
| మహా. | మహాప్రస్థానికపర్వము. |
| స్వర్గా. | స్వర్గారోహణపర్వము. |
| ఆ. | ఆశ్వాసము. |
| పు. | పుట. |

ఆది-ఆ ౧-పు ౧ అనఁగా ఆదిపర్వము ఆశ్వాసము ౧ పుట ౧ అని గ్రహించవలెను.

| | |
|---|---|
| క. | కందపద్యము. |
| గీ. | గీతపద్యము. |
| సీ. | సీసపద్యము. |
| వ. | వచనము. |
| చ. | చమ్పకమాల. |
| ఉ. | ఉత్పలమాల. |
| శా. | శార్దూలము. |
| మ. | మత్తేభము. |
| మత్త. | మత్తకోకిల. |
| శ్లో. | శ్లోకము. |
| కవి. | కవిరాజవిరాజితము. |
| ల. | లయగ్రాహి. |



శ్రీ రామ జయం.

# శ్రీ భారతసార రత్నావళి.

౧. శ్లో ॥ శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగే షుయేలోకానాంస్థితిమావహంత్య విహతాంస్త్రీపుంసయోగోద్భవామ్ । తేవేదత్రయమూర్తయస్త్రీపురుషా స్సంపూజితావస్సురైర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాశ్శ్రేయసే ॥ ఆది । ఆ ౧ । పు ౧.

౨. ఉ ॥ శ్రీయనగౌరినాఁబరగు చెల్వకుఁజిత్తముపల్లవింప భ । ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ । పాయనమశ్శివాయయనిపల్కెడు భక్తజనంబువైదిక । ధ్యాయితకిచ్చమెచ్చు పరతత్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్ ॥ విరాట । ఆ ౧ । పు ౧.

౩. ఉ ॥ అంబనవాంబుజోజ్జ్వల కరాంబుజశారదచంద్రచంద్రికా । డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా । చుంబితదిగ్విభాగశ్రుతి సూక్తివివిక్త నిజప్రభావభా । వాంబరవీధివిశ్రుతవిహారి ననుంగృపఁజూడుభారతీ ॥ అర । ఆ ౪ । పు ౫౮.

# ౧. ఉత్పత్తిప్రకరణము.

## ౧-ఉత్పత్తిస్థితిలయములక్రమాలవ

౪. గీ ॥ వ్యక్తసప్తధారమవ్యక్తనాభంబు । షోడశకవి
సుపరిమండ । లంబుధ్రువము స్థితం బాత్మచేతఁజ క్రంబునిర
చుండుఁగాలవశత ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౫. క ॥ ఈచక్రంబున సకలచరాచరమయమైనలోకస
శానిష్ఠా । గోచరమైచరియించుచు సూచికొనన్వలయుఁ ద
శోధనదృష్టిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౬. క ॥ శరనిః తరంగలభంగిం । బొరిఁబొడనవ్యక్తము
పుట్టునడంగున్ । సురనరధరణీరుహాముఖ । చరాచరానేక
తజాలములెల్లన్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౭. క ॥ భూతములవ్యక్తంబున । జాతములగునందుఁ
గుసమయాఁదడీయ । స్థితత్వమునను బురుషుం । జేతద్విధ
తీతాసమిద్ధుఁడుపవత్నా ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౮. గీ ॥ వినుమవిద్యకామమునకుఁగామముకర్మ । వ
కుఁబుట్టబట్టులనఘయింత । పట్టుగారణముగవచ్చుఁబునర్జ
మంద్రుతత్త్వవేదులైనమునులు ॥ శాంతి । ఆ ౪ । పు ౮౩

౯. గీ ॥ ఒలసిలోభమోహములు దోషసంసేవ । నం
నర్పఁగాఘునప్రగాఢ । మగునవిద్యభూమిఁగ్నైబహులకర్మ ।
ములకంకురాదిశక్తులొసఁగు ॥ శాంతి । ఆ ౪ । పు ౮౩.

౧౦. సీ॥ కర్మములకుఁ గర్తగాఁ దాఁ దలఁపఁ దనిన | సత్త్వము రజస్సు దమము వాతపిత్త | కఫము లట్లు మర్త్యకాయగతములగు | న ట్టివాఁడు గర్తలవియె చూవె ॥ అను । ఆ ౫ । పు ౬౧.

౧౧. క ॥ అనఘా విధివిహితంబులు | దనచేఁతగఁ దలఁపఁ ఫల ముదగులు నహంకా | రనిరూఢమనక నహంకా | రునకది లేమి ఫల యుక్తిఁ ద్రోవంజాలుఁగా ॥ శాంతి । ఆ ౪। పు ౬౪.

౧౨. క ॥ దైవతమానుషతిర్య | గ్భావంబులఁ బొందుచును వికారిణియై భూ | తావలి దిరిగిన నెంటన్ | నేవిధములఁ దిరుగఁ గర్మవివశత్వమునన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౧౩. సీ ॥ మాంసశోణితాస్థిమయశరీరంబులు | తాను గాఁ గనాత్మఁ దలఁచునట్టి | కృపణజనులు వీనికెడు గానఁగ లేక | చిక్కు చెడుదురింత నిక్కువంబు ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౨.

౧౪. క ॥ ఆదిని సంయోగవియో | గాదిద్వంద్వములు దే హులగు వారికి నం | పాటిల్లదె తప్పుఁ బూ | రోష్యాదితకర్మంబు లె ట్టియోగికి నయినన్ ॥ ఆది । ఆ ౬ । పు ౬౩.

౧౫. సీ॥ క్రియలహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన | దేహసంబంధ మొదవక తిరుగవలఁదు | జన్మపర్యాయములఁ బయ్యుండు జన్మమునఁగ | మిళితనవశుక్లశోణితకలితవృత్తి ॥ శాంతి । ఆ ౪ । పు ౬౧.

౧౬. సీ ॥ మాత్రమునఁ బుట్టి మనమున మనసు గర్వ | మును నభ్రవర్ధనమ్ము నొంది వెడలి | సంతతానుబంధసంసారదుఃఖని | మగ్నుఁడగుచునుండు మానవుండు ॥ శాంతి । ఆ ౪ । పు౬౧.

౧౭. క ॥ జననంబువేళవెలువడి । తనతోఁబ్రిటికర్మములనుబట్టి
గినవివిధవ । ర్తనములఁబొందునవిదెగినఁ। జనిమఱియుంబుట్టుఁగ
ర్మసంతతికిఁదగన్ ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౧౮. గీ ॥ అతఁడుగాలకలితమైకర్మముననుసం । సారవర్త
నంబుసలుపుచుండు । స్వాప్నసంప్రవృత్తిసలిపెడునరుమాడ్కి ।
నింద్రియములతోడనెఱయఁబొరసి ॥ శాంతి । ఆ ౪ । పు ౫౧.

౧౯. క ॥ బాలత్వంబుననవివే । కాలోలితబుద్ధియునశు
చిమైనదియుసమంబైలీల జుగుప్సితవిధి । శీలతనొందంగదుర్వి
చేష్టలఁదిరుగున్ ॥ (శ్రీ) । ఆ ౧ । పు ౩.

౨౦. క ॥ యౌవనమునవిషయపర । త్వావేశముదుఃఖకా
రిమైయలరఁగనా । నావిధదుర్వినయములకుఁ । దావలమైమె
లఁగునిందితప్రక్రియలన్ ॥ (శ్రీ) । ఆ ౧ । పు ౩.

౨౧. మత్త ॥ వృద్ధుఁడైనతఁడెన్నఁబలంబునువీఁకయుండనుగంగడు।
ర్బుద్ధివాటిలఁగ్రుంగియింద్రియముల్వికార్తతఁబొందవో । యోర్ధ్వతిన్
రుజలుప్పతిల్లఁగనొందురూపగుపాశసం । బద్ధుఁజేసిజముండుదు
ర్వ్యాఁగఁబాయునబ్భవముందుదిన్ ॥ (శ్రీ) । ఆ ౧ । పు ౩.

౨౨. కవి ॥ అనయములోలితమైవిషయప్రపయంబునుదుస్త
రపంకమున। స్మునుఁగుచుఁదేలుచుసుండఁగఁగాలముముట్టినజన్
జరనెవ్వగనై । కొనదొరఁకొల్పిక్రమంబుననంగనుక్రొవ్వుసుతె
ల్వానుబాపిప్రయో । జనరహితంబుగఁజేసియుపాగ్రతపుఁజావొన
రించుఁగురుప్రవరా ॥ (శ్రీ) । ఆ ౧ । పు ౪.

౨౩. గీ॥ నిత్యుఁడాత్ముండు దేహమనిత్యమతఁడు । ముదిమి చెవులును వికృతిమైనది వికలతఁ । బొందుటయుదానిఁదొరఁగితాఁ బోవునట్టి । దశకుమరణము పేరయొప్పెఁదనులతాంగి ॥ అను।ఆ౫ । పు ౮౦.

౨౪. గీ॥ మేనుజీర్ణముగాఁజేయుఁగానిమరణ । మొందజే యదువినుకాలమెందునరుని । పూర్వకర్మంబులాయువుఁబొదలఁ జేయ । సన్నముగజేయబ్రదుకునుజావుఁగలుగు ॥ అను। ఆ ౫। పు ౮౦.

౨౫. క॥జీవుఁడుజీర్ణశరీరముఁ। బోవిడిచిదివంబుఁబొందఁబుట్టను పేరం । దావెలయుందద్దశజీ । వావలివర్తించునిటుగతాగతప దవిన్ ॥ అను । ఆ ౫ । పు ౮౦.

౨౬. క ॥ ఈవిధమునవెడలిచనిన । జీవుఁడునిజకర్మవశాలసి ద్ధగతులన్ । బోవుఁదదుద్భవసుఖదుః । ఖావేశముఁబొందు చుండునద్ధ్యయెడలన్ ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౭. చ ॥ స్థిరముగుపుణ్యకర్మమునదేవభవంబగుఁబుణ్యపాప సంకరమునమానుషత్వమగుఁగల్మషమూల్యపశుకీటభావముల్। బొ రయఁగఁజేయునిప్పగిదిఁబుట్టుచుజచ్చుచుమోహవార్ధిలోఁ । ది రుగుచునుండుగానియొకతీరముసేరఁడుజీవుఁడెన్నఁడున్ ॥ ఆర । ఆ ౫ । పు ౬౩.

౨౮. చ ॥ ఇదిసకలంబుగాంచిబుధుఁడెప్పుడుబోవముపొం తఁబోకని । ర్మగనిరహంక్రియాత్ముఁడనుమానరదూరుఁడుతానెకలిం

చుంబెం । పొదవఁగధర్మమార్గమున నెయ్యెనధర్మముతీపెటింగి
తా । వదలఁడుదత్క్రియావిధమువారకయెక్కుడొనర్చు ధర్మ
ముల్ ॥ ఆర । ఆ ౫ । పు ౯ర.

౨౯. చ ॥ మనుజుఁడుపుణ్యపాపములు మానుగనిందొన
రించుచుండుదిఙ్ । దనువువొరంగిపొవ్వు నెడఁదప్పవునీడయుపో
లెగర్మముల్ । వెనుకనయేగిభూరిసుఖవిశ్రుతియుంబటుదైన్య
దుఃఖముఙ్ । దనుకఁగఁజేయుఁగ్రమ్మఱకతానయొనర్చుభవంబు
దేహికిఙ్ ॥ ఆర । ఆ ర । పు ౭౬.

౩౦. క ॥ వినుజీవుండుసనాతనుఁ । డనఘుఁడునిజకర్మవశత
నధ్రువదేహం । బునుబొందుదేహపాతం । బున నెప్పుడుఁజెడఁడ
తండుభూసురవర్యా ॥ ఆర । ఆ ౫ । పు ౯౩.

౩౧. క ॥ ఈయొడలువిడిచివేఱొక । కాయముగైకొని శ
రీరికర్మవశగతిఙ్ । బోయిసుఖదుఃఖములుగనుఁ । బాయకవెం
డియునుదేహబంధముఁబొందుఙ్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౩.

౩౨. గీ ॥ అశుభములుసుశుభములునైనకర్మ । ములఫలం
బులు గుడువకపోవగాదు । మనుష్యవశగతమైనయాత్మకునుబా
త్త । చరితయిదికారణముసుమ్మె జన్మమునకు ॥ అశ్వ । ఆ ౧ ।
పు ౧౦.

౩౩. క ॥ వినుకర్మంబొనరించును । జననమునురణంబునది
యస్వాఖ్యముదుఃఖం । బునుగావించుందనచే । సినదానంబడక
పోవప్రనసువశమే ॥ అను । ఆ ౧ । పు ౨.

౩౪. గీ ॥ కర్మవశతంజూపెకలుగుదేహముపేహ। వర్తనంబు కర్మవశగతంబు । దేహపాతమైనదేహస్థుఁడగుజీవుఁ । డరుగుఁ గర్మవిహితమైనయెడకు ॥ అర । ఆ ౫ । పు ౯౩.

౩౫. క ॥ వినుమనుజునకెవ్విధమునఁ । దనచేసినసుకృత దుష్కృతంబులు నెఱియం । దనకనుభవింపఁ బోలవి । తనువు నెడుంగానికర్మతతి సెడదనఘా ॥ అర । ఆ ౪ । పు ౭౬.

౩౬. క ॥ పురుషుఁడుకర్మాధీనత । నరుగకతనవశమయనిన నాపదలురుజల్ । మరణంబునునివియేమియుఁ । బొరయక యుండంగఁబ్రతుకఁబోలదె జెప్పుమూ ॥ అర । ఆ ౫ । పు ౯౩.

౩౭. సీ ॥ నీతిమంతులుధర్మనిరతులుభక్తులునగువారుచేయు కార్యములుగొన్ని । సిద్ధిఁబొందవుదుష్టచిత్తులుగ్రూరులుఁజేయఁ గొన్ని విశేషసిద్ధిఁబొందు । నూరకయుండంగనొందుఁగొందఱవి పులార్థములగ్గొందఱాయాసపడియు । నిష్ఫలారంభులైనిలుతురు కొందఱుపేదవారికిఁబ్రజపెల్లుఁబొడము ॥ తే ॥ గీ ॥ నర్థవంతులు కొందఱకర్థినేక । దానములుధర్మములుసువ్రతములుఁజేయఁ । బ్రజలుపుట్టరువినుమట్టిభంగినూవె । కర్మఫలమాహాత్మ్యతంత్రంబు గాకయుండదు ॥ అర । ఆ ౫ । పు ౯౩.

౩౮. చ ॥ వలనధికంబుగాఁగలుగువైద్యులు శాస్త్రములు భ్యసించియుం । దులనొడఁగూర్పనేర్చితనుదోషములారయుబు ద్ధిగల్గియూ । ర్తులకుఁజికిత్ససేయుదురురోగమువాయమిలేదెవా రురో । గులగుటగాననెట్లుప్రతిగూలనిషేధ్యరునేర్పుబ్రోచునో॥ శాంతి । ఆ ౧ । పు ౧౨.

3౯. మ ॥ శ్రుతివాక్యంబులుకర్మనిష్ఠ వినుతించున్ నిష్క్రి యత్వంబునన్ । స్తుతిఁగావించుటయాదిచెప్పునిటుచిత్తప్రక్రియన్ రెండుచో । దితములౌనినివింటిమన్న కలఁచున్ దీపించునేతత్వ సం । గతబోధంబునుకర్మతంగలుగునాకంబాప్తపీరవ్రతా ॥శాం తి । ఆ ౧ । పు ౮.

౪౦. ఉ ॥ ఆదటపూర్వశాస్త్రములయర్థములారఁగఁగ్రో లితత్వసం । వేదసుధారసంబునచవింజీరసౌఖ్యముఁబొందనేరకి। ష్మేదినినెందునుండిరిగిమేలనికర్మమయాదిచెప్పుచుం । గాదని శాంతియొప్పనిదిగాఁజెడనాడుదురల్పబోధనుల్ ॥ శాంతి । ఆ ౧ । పు ౮.

౪౧. గీ ॥ వినుప్రవృత్తికర్మమనఘనివృత్తిని । ష్కర్మమర యబంధకంబుమోక్ష । ణంబునగుటబోధనత్వసంపన్నులు। చూ రరుకర్మతంత్రకరణమునకు ॥ శాంతి । ఆ ౫ । పు ౯3.

౪౨. క ॥ కొందఱుకర్మకరణమభి । నందింతురువారలకుజన నమరణములం । బొందకమోక్షాదుమహా । నందముఁబొందుదురు నిత్యనైష్కర్మ్యపరుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯3.

౪3. క ॥ మానుషజన్మముమేలది । హీనపుజాతినిజనించె నేనియనన్యం । బైనజననంబుకంటెను । దానసుగతివడయనగు టఁదత్త్వశ్రవణా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౪౪. క ॥ నరుఁడుజరాయుజములలోఁ । దరుణీవినుముత్త ముఁడుశ్రుతములేకున్నఁ । సరిపశువునకుంగావున । వరిష్ఠమ గునట్టి వినికివలయునరునకున్ ॥ అను । ఆ ౫ । పు ౮౧.

౪౫. క ॥ దుర్మతులామిషగతమగు । కర్మముపాటించిబం
ధకలితులగుదుర । య్యార్మిగడచిసువిచారులు । నిర్మమతను
ముక్తిపడయనేర్తురువత్సా ॥ శాంతి । ఆ ౧ । పు ౭.

౪౬. క ॥ నేయిపాలుపడినదీవియ । మాఁచుకరణిఁగర్మసిద్ధి
మలిఁగినహీన । త్వాయత్తంబైతానును । మాఁచునుదైవాను
కూల్యమహిమమహీశా ॥ అను । ఆ ౧ । పు ౬.

౪౭. క ॥ తేరుశరీరముదానికి । సారథిసత్వంబుతురగచయ
మింద్రియముల్ । దారుణతరబుద్ధిప్రా । పారంబులుదనరుజను
పవర్గములధిపా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౪.

౪౮. క ॥ నగవరయేర్పడవినుమా । తురగంబులపటురయం
బుతోననుచరతం । దిరుగుపురుషుండుసంసృతి । పరుఁడైభ్రమి
యించునవశభావప్రాప్తిక్ ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౪.

౪౯. క ॥ పానీఁదమయిచ్చనెందుం । బోనీకుండంగసాఁ
గుపురుషుఁడుసంసా । రానేకదుఃఖభాజన । తానిరసనమునకు
నేర్పుధరణీనాథా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౪.

౫౦. క ॥ యమునియధీనంబదిదుః । ఖములననేకములఁజే
యఁగానోపున్నృపో । త్తమయిూరథమవియింతురు । విమలవివే
కౌషధమునవినుమార్యజనుల్ ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౪.

౫౧. క ॥ నరుఁడెంతకాలమేనిం । బరఁగంగాముక్తిపదముఁ
బడయకయుండునం । బురుషవరయంతగాలము । పొరిఁబొరినీ
భంగిఁబాపుఁబుట్టువునొందున్ ॥ ఆశ్వ । ఆ ౧ । పు ౧౧.

# ౨. సత్వాదిగుణప్రకరణము.

## ౧. సత్వరజస్తమోగుణములు.

౧. సీ॥ సంయమివరులారసత్వరజస్తమోనామ రూఢము
లుగుణంబులవియు। నన్యోన్యమిథునత్వమన్యోన్యసంశ్రయమ
న్యోన్యసంకలితానువృత్తి। భావమన్యోన్యోపజీవనాచరణం
బుగలిగిదుర్బోధత్వగాథభంగు। లైయుండుదమమునియమిత
మైనరజస్సుదన్నియమమునసత్వంబునడచు॥ తే॥ గీ॥ సత్వముడి
గినచోఁదమశ్చరణమొసఁగు। లోభశోకసమ్మోహనిద్రాభయ
ములు। వికృతిదుర్జ్ఞానమౌఢ్యపాపకృతికోప। శౌర్యమాత్స
ర్యములుదమస్సంభవములు॥ అశ్వ। ఆ ౨। పు ౧౯.

౨. క॥ తలఁపులుగ్రందుగఁబొడముట। గలగనుటేమ
ఱుటభ్రమముగదురుటజాడ్యం। బలసతయునునీభావం। బు
లుదామసకోటియంద్రు బుధులు నరేంద్రా॥ శాంతి। ఆ ౪।
పు ౮౩.

3. ఉ॥ పాములుఁదేళ్లునుం బసులుబంధులుగుక్కలు మీ
లుగోళ్లులుం। జీమలుఁగాకులుంగ్రిములుజింకలునక్కలుగొంక
నక్కలు। న్దోమలుభ్రామఁకులుంబొదలునోవులఁబీడలఁబొంద
వారుముక్। దామసభావులట్లమటితద్వ్యథజంతువు లెన్నియ
న్నిఁయుక్॥ అశ్వ। ఆ ౨। పు ౧౯.

౪. సీ ॥ సంశయంబువిషాదంబుజడతసిద్ర । వినుతమస్స
వర్ధింపఁగాఁజెనువు నొందు । నదివిహీనతఁబొందినఁనవిఁయుహీన ।
భావనొందువికస్వరపద్మనయన ॥ అను । ఆ ౫ । పు ౮౬.

౫. క ॥ ఇవితామసంబులనిగుణ । నివహములోఁగీడువా
పనేర్పనతఁడుత । ద్వివిధవికృతినిరసనహో । తువివేకముగలుఁ
గఁగా నధోగతిదలఁగుజ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౬. క ॥ అతినిందితములమోగుణ । మతిమోహామయుంబు
సత్వమనయుంబుఁబ్రకా । శతసెప్పనుభయగుణమి । శ్రితఁబర
గురజోగుణంబుసన్నుతచరితా ॥ ఆర । ఆ ౫ । పు ౯౪.

౭. క ॥ పరితాపమనభితోషము । నరేశ్వరాశోచనముజన
వ్యాపారా । దరమతమమనియేడునివి । యరయంగారాజసం
బులగుభావంబుల్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౩.

౮. చ ॥ బలమునుశౌర్యముస్మదముఁబ్రాభవమునుస్సుఖదుః
ఖభాగితా । కలనముఁజెల్మి సేఁతయునుగాంతియునొల్లమియుం
బ్రతాపముం । గలహామునీర్ష్యయున్నహువికల్పపుభావలుఁగా
మినీజనం । బులమెడగాథరాగతయుభోంతనునుబ్బురజఃప్ర
భూతముల్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౯. చ ॥ అవితోలుబాముసంగలుగునట్టిజనఁబులకీడులిట్టివి
ట్టివియునవినీతులన్నతిపటిష్ఠతగల్గిత్రివర్గవర్తనం । బువెరవునొంది
యర్థములఁబొంపిరిన్రొవుచుఁగామసాఖ్యవై । భవములఁగ్రా
లుచున్ననుజభావనిరూఢతఁబొల్తురెంతయుజ ॥ అశ్వ । ఆ ౨।

౧౦. గీ ॥ క్రోధలోభకామాన్నృతద్రోహచింత । తాపముల తురజోభివర్ధనమువృద్ధిఁ । జేయుహానికినెల్లసంక్షీణభావ । మావహిల్లరజక్షయమావహిల్లు ॥ అను । ఆ ౫ । పు ౮౬.

౧౧. క ॥ రాజసగుణములకుంగల । నైజమెఱుఁగువారుతజ్జనవైకృతముల్ । ధీజితములుగావింపఁగ । నోజగలిగిశుభదవృత్తినొందుదురెందున్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౧౨. సీ ॥ వినుమురజస్తమోవికృతులఁదగిలినమానసంబులుగలమానవులకుఁ । గలుగుధర్మద్వేషకలనంబువారలునరకవాసాహులుధరణీనాథ । సత్వపరాత్ములుసతతంబుధర్మముపాసింతురూర్ధ్వలోకాధివాస । మునకువారుక్తులుమునుమునుపుట్టినసుతుఁడుధర్మముపద్మజునకుదాని॥ తే॥గీ ॥ పాకసంపదసుమతులుపార్జితగను । పాసనముసేయుదురుతియ్యబంటిపరువ । మాదరించితదుపచారమాచరించు । వెరవుగలయట్టిజనములవిధముదోఁప॥ అను । ఆ ౫ । పు ౯౪.

౧౩. క ॥ జపమునుదానముయజ్ఞముఁ । దపమునుగర్తృజనచిత్తదశలనుసత్వా । ద్యుపహితములగుటనడచుం । ద్రిపథంబులసాత్వికపుగతియమేలెందున్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౧౪. క ॥ వినున్నృపహాపక్షంబుప్రియం । బనూనసుఖవృత్తినిర్భరానందముశాం । తినిరూఢియనఁగమనమునఁ । బనుపడునవిసాత్వికాఖ్యభావంబులగున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౩.

౧౫. సీ॥ సంతోషమునుప్రకాశత్వంబుఁబ్రియమునునానందమునుగరుణాభిరతియు । క్షమయునుసత్యంబుశౌచంబుధృతి

యును గార్పణ్యమును దితిక్షయును నహింస । యును నార్జవంబును
ననసూయయును గ్రోధరాహిత్యమును నసంరంభతయును । సమ
తదాక్షిణ్యంబు శ్రద్ధదానతయు నక్రూరభావంబు హ్రీగౌరవంబు ॥
తే॥గీ॥ సత్వజాతంబులివి పూర్వజన్మసంక । లితము లైనట్టివారహం
కృతి మమత్వ । మర్థతృష్ణకామార్తి లేకతుఁ బోధ । భరితులై యూ
ర్ధ్వలోకవైభవము గం(ద్రు ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౧౬. క ॥ ధృతి విజ్ఞానశ్రద్ధలు । నతివయసంమోహమును
దయయును హర్షమునం । చితసత్వవృద్ధిఁ బరివ । ర్తితంబులగు స
త్వమరుఁగఁ దెరలుండారుర్ ॥ అను । ఆ ౫ । పు ౨౬.

౧౭. క ॥ ఇను రూపము జలములఁ దోఁ । చిన క్రియ బుద్ధిఁ బ్రతి
బింబసిద్ధత వెలుఁగొం । దిన యాత్మను బరమార్థతఁ । గను సత్వ
స్థులకు నిజము గానంగనగుర్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౫.

౧౮. సీ ॥ సత్వగుణంబులు సంతోషమానందమారోగ్యము
క్రోధమార్జవంబు । శుద్ధి ప్రకాశతసుస్థిరత్వమహింస నిర్మలశ్రద్ధ
వినీతి లజ్జ । సత్యంబు శౌచంబు సమత యాచారంబు కార్పణ్యపైశు
న్యకామవృత్తి । వినురజోగుణములు విగ్రహదర్పాభిమానకామ
క్రోధమత్సరములు తే॥గీ॥ కరుణ లేమి భోగకాంక్షయహంకార ।
ముమ్మలికత మోగుణమ్ములు ప్ర । కాశ మోహబహుళతరాశనవా
దప్రమాదమాంద్యమరణ ఖేదములును ॥ శాంతి । ఆ ౬ । పు ౧౧౮.

౧౯. మ ॥ అసుఖాకారత నిద్ర దైన్యము విమోహాంబక్షమ
త్వంబు తా । మసభావంబులు రాగలోభజడతామానంబులూ

హింసరా। జనవృత్తంబులుధైర్యశాంతికరుణాసంతోషవిద్యాదు
లిం। పెసగఁ సాత్త్వికచేష్టితంబులునిజంబిట్లాత్మఁగన్గొన్ని యున్ ॥
ఆర। ఆ ౫। పు ౯౪.

౨౦. గీ ॥ సత్యశౌచదయాదులుసాత్త్వికములు । రమణి
లోభసంగాదులురాజసంబు । ఁమృతహింసాపరత్వభయా
లసత్వ । ధైర్యహానినిద్రాదులుతామసములు ॥ అను ।ఆ ౫ ।
పు ౨౧.

౨౧. గీ ॥ స్మృతియుసంప్రీతియుప్రసన్నతయుమతియు।
నీదృశములగుసత్త్వగుణోదితములు । రాగలోభరోషాదులు
రాజసములు । దర్పశోకప్రముఖములుతామసములు ॥ శాంతి।
ఆ ౪ । పు ౨౧.

౨౨. గీ ॥ సౌఖ్యతుష్టిప్రకారములాసత్త్వికములు । మోద
ఖేదాదికద్వంద్వములులతాంగి । రాజసములప్రకాశసంత్రాస
హేయ । ములునుదంద్రయుఁదామసములుగనెఱుఁగు ॥ అను ।
ఆ ౫ । పు ౨౬.

౨౩. క ॥ కారణములుగలిగియుని । ష్కారణకలితంబుల
య్యుజనియించుధరి । త్రీరమణమూఁడుదెఱఁగులు , నారయ
నివియస్థిరంబులైతిరుగఁబడున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౨౩.

౨౪. చ ॥ జనవరసౌఖ్యముంబొరసిసాత్త్వికభావసముద్గతం
బును । మ్మనియునుదుఃఖముల్ గదిరినప్పుడురాజసభావభంగి
సు । మ్మనిఁయుజడత్వసంగసమయంబునఁదామసభావవృత్తిసు।

మ్మనియును ద్రోఁచి పానిఁబడకాత్మ రతిన్నిలుపిచ్చు మోక్షముల్ ॥ శాంతి ॥ ఆ ౪ । పు ౮౩.

౨౫. క ॥ కలగొనరాజసతామస । ములయినభావములువికృతిఁబొందింపఁగమ । ర్త్యులకేకాంతికవృత్తిని । నెలకొనఁగా నెట్లు వచ్చు నిర్మలధిషణా ॥ శాంతి । ఆ ౬ । పు ౧౩౭.

౨౬. క ॥ వారికిఁ బ్రవృత్తిలక్షణ । తారూఢంబైనధర్మమలవడు హరికిం । గారుణ్యపాత్రములుగా । రాయపవారన్యపథసమాశ్రితులగుటన్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౩౭.

౨౭. గీ ॥ అరసిచూడ సత్వంబు సుఖాస్పదంబు । సాంద్రదుఃఖమయంబు రజస్సు బోధ । మాంద్యమూర్తి తమస్సు సమత్వమూఁది । యీయవస్థలఁ బొరయమి మాయపోక ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౨౮. క ॥ జ్ఞానమునకు నగ్గుణసం । తానంబద్దంబుగానఁ దత్పరిహతికై । పూనిమును సాత్త్వికమునను । మానసమూఁదంగవలయు మహనీయధృతిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౨౯. క ॥ విను సాత్త్వికమును మది నెల । కొని రాజసతామసములకును విగతత్వం । బొనరించు పదం బడిసి । త్వనిరూఢతబోధసంపదకు హేతువగున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౩౦. క ॥ సాత్త్వికుల కుదివ మురజా । మత్త్వకలితవర్తనులకు మధ్యభువనవా । సత్వము దామసులకు నీ । చత్వకరాధోజగంబు సంప్రాప్తమగున్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౩౧. గీ ॥ సర్వసంకల్పరహితుఁడై సత్వమునవి । నిశ్చయంబుగఁజిత్తంబునిలుపవలయు । సత్వసక్తచిత్తంబుప్రసాదమొసఁగు । ధ్యానఁగాలంబునడపుటుత్తమవిధంబు ॥ శాంతి॥ అ ౫ । పు ౯౪.

౩౨. క ॥ కామున్ఁగామక్రోధస । మావేశమువెడలవిడిచియనవరతంబుల్ । సేవింతురుసత్వమదృఢ । భావాకలనమునయోగపరినిష్ఠాత్ముల్ ॥ అశ్వ ।. ఆ ౨ । పు ౧౮.

౩౩. గీ ॥ పొందుసత్వరజస్తమంబులువిశుద్ధు । నంతరాత్ముబొంసుప్రాతమనిలుఁజెందు । నట్లుసద్వివేకముదదనంతరంబ । బుధుఁడుగాంచియగ్గుణములఁబొరయకుండు ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౩౪. గీ ॥ వినుమునృపసత్వమునురజస్సునుదమస్సు । ననఁగగుణములుముప్పిరిగొనుచునాత్మ । జుట్టుకొనునెందుమైయిఁదెగవిట్టలఘుగ । నులయువైరాగ్యమనుకోడవలిననాని ॥ శాంతి । ఆ ౪ । పు ౭౭.

౩౫. క ॥ సత్వముప్రదీపమాపర । తత్వముఁగాంచుటకుఁగానఁదత్సాధనతా । తత్వమువదలకచిత్తసుఖత్వాకలితమగునెలవుగంద్రుకృతాత్ముల్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౨.

౩౬. క ॥ శ్రుతియనదపమనఁగఁబ్రజా । పతియనసత్వంబునసునపరనామంబుల్ । వ్రతులానసత్వమనన । వ్రతతనుహిమమైనపరమవేద్యమునుండీ॥అశ్వ । ఆ ౨ । ౧౮ పు.

# ౨ - పంచేంద్రియములు.

౩౭. గీ ॥ వర్ణములకెల్లనింద్రియవ్యాప్తినిగ్ర । హంబువల యునెయ్యదిగన్న యంతఁదుష్టి। బొందియొండాసపడకున్న నొం దుసాధు । జనులువెదకుననామయసత్పథంబు ॥ అను । ఆ ౩। పు ౫౫.

౩౮. క ॥ ఒరులపనికిఁగానిజహిత। విరహితుఁడగునట్లుగా దెవివిధేంద్రియకా । ర్యరతుండైయాత్మసము । ద్ధరణంబొగిఁజే యకునికిధరణీనాథా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౩౯. క ॥ విచ్చలవిడినింద్రియముల । నెచ్చటికైననుజనం గనిచ్చిననరకం । బచ్చుపరచుఁగదియించినఁ । దెచ్చునుగతినరు నకదిసతీమౌళిమణీ ॥ అను । ఆ ౫ । పు ౯౫.

౪౦. గీ ॥ సాధులింద్రియవిభ్రాంతిసంహరింతు । రఘముఁ దెలిసిప్రాయశ్చిత్తమాచరింతు । రప్రకాశంబుగాధర్మమాచరిం తు । రఖిలభూతదయాళుత్వమారఁగలరు ॥ అను । ఆ ౫ । పు ౯౪.

౪౧. గీ ॥ ఇంద్రియంబులుదమయిచ్చనిట్టునట్టు । దిరిగెనేని దుఃఖంబులదెచ్చునవియె । కట్టువడిసుఖమొనరించుగాననాత్మఁ। గావవలయునింద్రియచోరగణమువలన॥శాంతి। ఆ ౪। పు ౭౭.

౪౨. క॥ ఏనింద్రియములుమనసును। బూనితనవశంబులైనఁబు రుషుండుసదా । ధ్యానసమాధిసమగ్రుఁడు । వానింగీర్తింతుర మరవరులున్మునులున్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౪.

౪౩. గీ॥ ఇంద్రియంబులుదిఱిచినయెడకుఁబోవు | చుండు మనసెశ్రద్ధదద్వేగముడుపకున్న | నెడలిచెడిపోవుబుద్ధియుదీర్ణ పవన | హతిఁబయోనిధిలోఁగలమవియునట్లు ॥ అర | అ ౫। పు ౯౪.

౪౪. గీ॥ మనసునింద్రియములఁబనిగొనిపురుషుండు | ప్రచురశిక్షలేనిరథ్యసమితి| నడపురథికుమాడ్కినడువడినదియాడ్చి| నట్లుదైనననశుభమావహిల్లు ॥ శాంతి | అ ౫ | పు ౯౪.

౪౫. గీ॥ మనసుచేతివయింద్రియనుహిమమెల్ల | నుపరతంబైనమనసుతోనుడిగిమడఁగు | నింద్రియములుపరముసెుండెనేని చాన | మనసుమగుడదువిషయతృష్ణనచరించు ॥ శాంతి| అ ౬॥ పు ౧౧౮.

౪౬. క॥ కావుననింద్రియచేష్టల|నేవలనికిఁబోవనీమియింతకు ముఖ్యం | బైవడిగొనుమనసుదిగువఁ | గావలయునుమగుడదీనిఁగనుఁగొనుమనఘా ॥ శాంతి | అ ౬ | పు ౧౧౮.

౪౭. గీ॥ ఇంద్రియములెల్లనట్టివయెనసిరియుండు| వలనమనసున్నఁదమతమవర్తనముల | నిగుడనేరమిదెల్లంబున్నృపవరేణ్య | యిట్టులగుటయజ్ఞానమైనసెఱుఁగవచ్చు ॥ శాంతి | అ ౬ | పు. ౧౧౮.

౪౮. క॥ వినుటకునుగనుటకునుసా|ధనములయినచెవియుఁ గన్నుదనతనయంత| న్వినసనుంగానునేర్చునె| మనఃప్రభావమునఁగాకమనుజాధీశా ॥ శాంతి | అ ౬. పు ౧౧౮.

౪౯. గీ॥ ఇంద్రియములలో నొక్కటియేనిఁబట్టు। వడక వెడలి
నానాఁగంటిప్రజ్ఞ కారు । నట్లుగాను మనసు మున్నాఁగి విసికి । యిం
ద్రియగుణైదుర్గమమునఁ నాఁగవలయు॥ శాంతి। ఆ ౫। పు ౯౨.

౫౦. క॥ మనసు నియమింప భూతా । త్మ నియత్నంబౌ
ప్పు నియమమునకుఁ లోనై । మనసింద్రియములఁ గుడియుం। చిన
శబ్దాదులు దారంగి సిద్ధి బొరఁకొనుఁ ॥ శాంతి। ఆ ౫। పు ౯౨.

౫౧. క॥ వినుమందు నొక విశేషం । బనఘా బుద్ధీంద్రియం
బులైదును బరముం । డసు వెలుఁగునక డ్డముపా । నినదంగింపంగ
మనసు నిపుణతనొప్పుఁ ॥ శాంతి। ఆ ౫। పు ౯౨.

౫౨. గీ॥ కనుట వినుట మొదిగాఁగలయింద్రియం। బులకగోచ
రంబు బుద్ధిదీపరూపు గాఁగఁ దోఁచు రూపశబ్దాదిగు । ణత్వరహిత
మైన తత్త్వమనఘా ॥ శాంతి। ఆ ౫। పు ౯౨.

౫౩. గీ॥ అనఘయింద్రియముల విషయముల మీఁద। నిగు
డనీకమనంబుతో మగుడఁదిగిచి । యాత్మ గూర్చుట సాంఖ్యులయ
నువు సాంఖ్య। యోగములు రెండు నారయ నొక్క తెరువ॥ శాం
తి। ఆ ౫। పు ౯౧.

౫౪. క॥ ఈ రెండు ప్రకారంబుల । నారలకును మమత విడువ
వలయుట సరిని। స్సారపు సంసారమునకుఁ । గారణము మమ
త్వమగుటఁగ విజనముఖ్యా॥ శాంతి। ఆ ౫। పు ౯౧.

౫౫. గీ॥ ఎల్లకడలకు వెలువడు నింద్రియముల। బాలపుత్రు
లఁ దంద్రియుఁ బోలెనాఁగు । మఱియు మనము నునిశ్చలైకాగ్రభా
వ। మొందుటు త్తమపదమున సమున్నజ్జ్వలాత్మ॥ శాంతి। ఆ ౫। పు ౯౫.

౫౬. క ॥ ఆదిధర్మంబుల కెల్లం । దుదియగుధర్మంబుమనసు తోడానిఁదగం । గుదియించి మేధతోడం । గదియింపుమునియతి బుత్రకడుగాఢముగ౯ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౫.

౫౭. గీ ॥ అనఘయింద్రియములువిషయములుమనసు । బుద్ధియునునాత్మయునుగ్రమంబునదయొక్క । డాత్మబుద్ధియనంగన ల్పాంతరంపు । వస్తువులుబుద్ధియున్నిటవి స్తరిలుట ॥ శాంతి । ఆ ౫ । పు ౯౮.

౫౮. క ॥ వినుమైదింద్రియములకును । మనంబుషష్ఠంబుసప్త మత్వముబుద్ధిం । బనిగొనుభవ్యక్షేత్ర । జ్ఞునియందష్టమతగల్గు నుగుణాభరణా ॥ శాంతి । ఆ ౫ । పు ౯౮.

౫౯. గీ ॥ స్వస్థతయుదుస్థతయుజడత్వమునుగ్రమవి । గణ నసత్వరజస్తమోగుణములవిస । మీరితములగుటఁడఁగుటయిం ద్రియంబు । లడరుటొందుగుటబుద్ధికృత్యములువత్స ॥ శాంతి । ఆ ౫ । పు ౯౮.

౬౦. గీ ॥ తలఁచుమనసుననిశ్చయదశయొనర్చు । బుద్ధిస వైన్యకసాక్షిత్వమునవెలుఁగు । నంతరాత్ముండుక్షేత్రజ్ఞుఁడనఁగ దాని । మెరుపుసత్త్వాదిగుణములైమెరయువత్స ॥ శాంతి । ఆ ౫ । పు ౯౮.

౬౧. క ॥ కనుఁగన్నై వినుచెవిమై । కొనుఁజవిజిహ్వాయ యిమూరుకొనునాసికయై । తనువైస్పర్శముగనుఁగొను । ననవ ద్యాబుద్ధియాత్మయందునిలుచుచు౯ ॥ శాంతి । ఆ ౫ పు ౯౮.

౬౨. క ॥ ప్రీతింగదుఁబొదలువిషా । చాతురతఁ జను క్రిక్కుఁ దద్ద్వయము లేకసమ । త్వాతిశయంబుననిలుచును । నేత్పత్త్వం బుననుబుద్ధి నెరపుగుణములఁ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౪.

౬౩. గీ ॥ బుద్ధిఁగోనిమనంబుపోనీకనిలిపిమ । నోనియుక్తి నింద్రియములనాఁగి । విషయసమతినెడలవిడిచినవానికి । ననిమిషఁలు ప్రసన్ను లగుదురనఘ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౨.

౬౪. గీ ॥ ఇంద్రియంబులనేనింటనిట్లువిషయ । ములకునెలయకయుండంగనిలువరించి । తలఁపులుడిగి లేనియుఁ బ్రమదమును నూను । భంగిఁదృప్తుండవైయుండిపరముగాంతు ॥ శాంతి । ఆ ౫ । పు ౯౫.

౬౫. క ॥ వృత్తివిశేషమునఁజనిన । చిత్తము వెనుకఁజనియందుఁ జేర్చి మనసుదా । నెత్తెఱఁగునకుందివియమి । యుత్తమపురహస్యమంద్రుయోగమునమునుల్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౬౬. గీ ॥ తత్స్వభావమెఱింగితానింద్రియాదిస । ప్తకము వెంటఁబోకతన్ను గనుచు । నున్న వానిఁబొందనోపు నేదుఃఖద్వ । న్యంబుసుఖమదంబునప్రమత్త ॥ శాంతి । ఆ ౫ । పు ౯౪.

౬౭. సీ ॥ ఇంద్రియార్థములకు నెలసినపురుషుండు గాఢరాగంబునఁగరఁగుచుండు । రాగంబువలనఁదిరంబగులోభంబులోభి య్యై కరుణకులోనుగాఁడు । మఱిసముద్ధతవృత్తిమఱుఁగుఁబాపక్రియఁదగువారిచెప్పెడితగవువినఁడు । కుజనులచెసఁబ్రీతిఁగోరుఁదుల్యంబులుగాకుండువాఙ్మనఃకర్మభంగు ॥ గీ ॥ లిహామునందుబుణ్య హీనుఁడై చెడిపోవు । బరమునం[illegible]దుఃఖభరమునెందుఁ । గాననిం

ద్రియార్థగతిఁబోకసాధుసం । సర్గఁజేసిసుగతిజనుటయొప్పు॥ ఆగ।
ఆ ౫ । పు ౯౮.

౬౮. గీ ॥ అనఘశబ్దాదివిషయంబులందుఁదగిలి । యిచ్ఛఁజ
రియించునెప్పుడునింద్రియములు । బుధుఁడుతత్స్వభావము దన
బుద్ధినెఱిఁగి। యేమఱికవానిఁదగఁగుదియింపవలయు ॥ ఆర ।ఆ౫।
పు ౯౮.

౬౯. చ ॥ అరదముదేహమింద్రియములశ్వము లాత్ముఁడు
సూతుఁడిమ్మహా । తురగచయంబుధైర్యమనుతోరపుపగ్గములన్
దృఢంబుగా। నురువడిఁబోకయుండవెరవొప్పఁగఁబట్టినవాఁడుస్వ
ర్గపుం । దెరువుననేగునప్పరమధీరుఁడుసూవెయుదారుఁడెయ్యె
డన్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౮.

౭౦. క ॥ స్వర్గనరకంబులింద్రియ । వర్గసమాచరణమునవవ
చ్చునువినవే । స్వర్గమగుఁదన్నివారణ ।దుర్గతియగుఁదన్నిరో
ధదుర్బలతమెయిన్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౮.

౭౧. క ॥ రాగపరిలిప్తమానస । యోగంబుననింద్రియంబు
లుల్లసితములై । భోగులగుటఁయుడిపినవ। రాగతసంసారదుర్వి
రామముసేయున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౭౨. ఉ ॥ ధీరుఁడునిర్జితేంద్రియుఁడుతెల్లముగాఁదనుగాంచు
భూతవి । స్తారనిరూఢమైనపరతత్త్వముగాఁజనయందభూతవి ।
స్తారమునెల్లఁగాంచుసతతస్ఫుటదర్శనుఁడైసమగ్రవి। స్ఫారముఁ
బొందినిర్మలతపంబులయందుఁజలింపఁడెప్పుడున్ ॥ ఆర । ఆ ౫ ।
పు ౯౮.

౭౩. గీ ॥ ఇట్టివాఁడు వెడలనీఁడునింద్రియజాల । మనుష్యపం
కలోభమయతటాది । ఘోరరూపమగునసారసంసారవిశాల
నదిఁబ్రశాంతశాలిహృదయ ॥ శాంతి । అ ౫ । పు ౯౧.

౭౪. క ॥ నియతిగలిగియింద్రియముల । జయించిశుచులైన
శాంతిసంపన్నులకుఁ । భయమొనరింపఁగలేవ । వ్యయపుణ్యా
గ్రహములేయవస్థలయందుఁ ॥ అర । అ ౫ । పు ౧౦౪.

౭౫. గీ ॥ వినుముదనుజనాథవిష్ణునియందఖి । లంబుగలుగు
నిలుచులయముఁబొందు । నతనిభక్తినింద్రియజయంబునకుఁబో
తె । దానధర్మవిధులఁగానరాదు ॥ శాంతి । అ ౫ । పు ౧౦౫.

౭౬. గీ ॥ ధూతపాపుఁడైనపూతాత్మకుండుల । ఘ్వాశియ
గుచునింద్రియములగెల్చి । మనసులోనఁగామమునుగ్రోధము
నుజొర । నీకబ్రహ్మపదమునిచ్చుఁగోరు ॥ శాంతి । అ ౫ । పు ౯౧.

౭౭. గీ ॥ అఖిలఫలఘ్వాశిరైయింద్రియప్రపంచ । జయము
గలిగిమోక్షార్థోక్తసారధర్మ । నిరతినుండెడివానికిఁబరమనుగుప
దంబుతంగేటిజున్ను చందంబునొందు ॥ శాంతి । అ ౫ । పు ౧౦౪.

౭౮. గీ ॥ ఇంద్రియములఁగెల్చి హృదయంబుశాంతిసు ॥
ఖంబుఁబొందనిర్వికారవృత్తి । నైనవానిఁబొందుమానితగతిదే
వ । తలకుఁబొందనరిదిధర్మనిరత ॥ శాంతి । అ ౫ । పు ౮౯.

# ౩ - విషయాసక్తి.



క ॥ అరయఁగవిషయములెంతయు। దురంతములువానియం దుఁదొడరినచేటుం । బొరయుదురుదొడరకున్నం । బరమపద వియమ్మహానుభావులకునగుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౧౨.

౧౦. గీ ॥ అనఘయూర్ధ్వాత్మచిత్తంబునందువిషయ। జాల మత్యంతగాఢసంసక్తినొందు । లక్కగసముదండాదులఁజిక్కఁబ ట్టు । చందమునదీనిఁగనుటబ్రశాంతికరము ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౧౧. క ॥ విషయంబులునశ్వరములు విషసన్నిభములుస మగ్రవిక్రుతిజనకముల్ । ధిషణాగుణములనెల్లఁగ । లుషములు గాఁజేయుమోహాలోభకరములై ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౦.

౧౨. క ॥ హరివిషయాభిలాషము । కారణముగనెంతయె ఱుకగలవారునుదు । ర్వారవికారముఁబొందెదు । వారునిజేం ద్రియములవియవశ్యములగుటఁ ॥ అర । ఆ ౧ । పు ౨.

౧౩. క ॥ వినువిషయజ్ఞానమునకు । ననయంబునుమనసు మూలమదికామకో్రి । ధనిరూఢముగుచుఁబురుషుని । ననిశము నెలయించునింద్రియార్థంబులకుఁ ॥ అర । ఆ ౫ । పు ౯౪.

౧౪. క ॥ ఇంతకుమూలముతృష్ణా । తం[illegible]లతయువత్సవిసు ముదానికినడరం । గాంతాజనంబుతోలుపా్ర । కెంతయుమిఁగిత్ర ష్ణదొఱఁగుటిచ్చువిముక్తిఁ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧.

౬౫. క ॥ పాపంబుఁబుణ్యమునుద్వ । ష్టాపరులకుదుఃఖసౌ
ఖ్యసంపాదులగుఁగా । భూపాలవితృష్ణులుని । ర్లేపులగుటవారిఁ
బొందలేవాఫలముల్ ॥ అను । ఆ ౧ । పు ౭.

౬౬. క ॥ వినుసుమతివిషయములయం। దునికిగలిగెనేనిఁ
బొందఁడుదకంబులఁబొం । దనిబిసరుహపత్రము । చాడ్పునన
దివిజ్ఞానఫలముభూపవరేణ్యా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౬౭. క ॥ వనమునవన్యాహారం । బునవర్తించినఁబదార్థము
లపైమమతఁగా । మనమునవిడువకయుండిన। మనుజుఁడుమృత్యు
ముఖవర్తిమనుజాధీశా ॥ అశ్వ । ఆ ౧ పు ౬.

౬౮. క ॥ శరధిపరివేష్టితక్షితిఁ । బరిపాలించినసుదానిపై
పృథుమమతం । బొరయకవర్తించినయప్పురుషునిదురితంబులెట్లు
పొందఁగనేర్చుఁగా ॥ అశ్వ । ఆ ౧ పు ౬.

౬౯. క ॥ మదిసుఖముగోరిదుఃఖం । బొదవంగలకార్య
ములకునుత్సాహముసే । యుదురొప్పనితృష్ణంబడి । చదురే
మిఁయులేనియట్టిజనులాతురులై ॥ ఉద్యో । ఆ ౧ పు ౧౭.

౭౦. గీ ॥ విడువరాదుదుర్మతులకునొడలుముదియుఁ । దా
న్నముదియదుప్రాణాంతమైనరోగ । మనఘతృష్ణవర్జితకాముఁడై
నయతఁడు । దానిఁబోఁద్రోచిసౌఖ్యసాంద్రత్వమొందు ॥ శాం
తి । ఆ ౫ । పు ౧౦౩.

౭౧. చ ॥ వినుముజరానుబంధమునవెంట్రుకలుండముఁబం
డ్లుఁధీనులుం । గనుఁగవయుఁగాజరంబొరయుఁగానిరియొకతృష్ణయుద్వ

ష్ణజీర్ణగా । దనయమునుఁ జేర్చి ప్రాణములనన్నకపోవ నిరోగముల్ని
బుద్ధినరులుద్రోవ లేరదిమదింజొరసీరుసుఖార్థులైబుధుల్ ॥ అను।
ఆ ౧। పు ౭.

౯౨. క ॥ అదిసర్వదోషములకా । స్పదమదిదురితక్రియా-
నుబంధంబులకును । మొదలునిరంతరదుఃఖ । ప్రదమని యొఱిఁగి
ననుదృష్ణఁబాతురుసుమతుల్ ॥ ఆర । ఆ ౧। పు ౨.

౯౩. క ॥ రమణీతృష్ణాసమదుః । ఖమునుబరిత్యాగసమ
సుఖముఁగలదే కా । యముముదిసినముదియదుపాపి । ణముగా
నిప్పోఁజాలు తెవ్వలనంజనుదృష్ణఁ ॥ అను । ఆ ౫ । పు ౬౫.

౯౪. క ॥ శోకప్రముదాదిద్వం । ద్వాకులుఁడవుగాక శాంతి
నంతఃకరణ । శ్రీకింబరీక్ష సేయుము । నీకునతృష్ణత్వసౌఖ్యనిత్య
తగలుగను ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౩.

౯౫. క ॥ వెలిపగఱగెలుపుగెలుపె । యలఘుమతీగెలుప
వలయునభ్యంతరశత్రులఁదద్విజయముమోక్షము । నలవరుపం
జాలుమెంటనమ్మేలగునే ॥ అశ్వ । ఆ ౧ । పు ౬.

౯౬. క ॥ దొరఁకొన్న ననుభవించుచు । దొరఁకొనమికిఁ
జింత నొందిదురటిల్లకని । ర్భరుఁడై యున్న నుదృష్ణుఁడు । జొరవచ్చు
నెయతనిమనసుసువ్రతశీలా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౩.

౯౭. గీ ॥ విడుపువలయుసకలవిషయవాంఛలయందు । వి
డుపుఁబోలుగుణమువెదకియొందుఁ । గాననైరిబుధులుకలదెపరి
త్యాగ । శీలునకునసాధ్యసిద్ధియెందు ॥ ఆర । ఆ ౫ । పు ౯౨.

# ౪ - అరిషడ్వర్గములు.

౯౮. సీ ॥ మనుజేంద్రసంకల్పమునఁబుట్టుఁగామంబురూప
రుదేహానిరూపణమునఁ । బరులదోషంబునఁబ్రభవించుఁగ్రోధమ
క్షీణతృష్ణమాఁయుక్తిఁజేసిపొలియు । భూతాస్థిరత్వంబుబుద్ధిఁగాన
మిలోభమనఘజనించుఁగాంచిననడంగు । నజ్ఞానమునమోహ
మూపహిల్లునధర్మ తేపవర్జనమునలేకతక్కుఁ । గులమునసుధనము
నవిద్యఁగలుగుమదము । మరలివానిపెంపుహింపఁప్రమందిపోవు ।
సాత్త్వికుఁడుగామింబొడముమాత్సర్యమదియుఁ । జెడుఁగుహ
స్థముసాధుసంసేవనమున ॥ శాంతి । ఆ 3 । పు ౬౪.

౯౯. క ॥ ఈయాఱింటనుసకలా । పాయంబులుమానవుల
కుఁబాటిలుదీనిం । బాయంగఁజడియనోపిన । ధీయుతునకుశుభ
ముసద్గతియుసమకూరుక్ ॥ శాంతి । ఆ 3 । పు ౬౪.

౧౦౦. క ॥ హింసావిహారియైనన్ । శంసుండీయారుగలు
గుణసుసంకుసుగి । దంసప్రదేశలలితో । త్తంసీకరణోపలాల్య
ధరణీపలయమా ॥ శాంతి । ఆ 3 । పు ౬౫.

౧౦౧. క॥ఇవితోడేదులభంగిం । గవియుఁబురుషుధైర్యహానిగ
సుఁగొనిధైర్యం । బవలంబించినసరుఁజే । రవుపీనికినిదితెఱంగు
రాజపరేణ్యా ॥ శాంతి । ఆ 3 । పు ౬౪.

౧౦౨. శా ॥ కామంబుంబెడఁబాచుఁబండితుఁడుసంకల్పంబు
వర్జించిని । గ్రోధమోహంబులడంచుసత్త్వగుణచింతన్లోభముం

బ్రాజ్ఞసే । పాముద్రంబోలఁగించుఁగ్రోధముశమవ్యాప్తిన్నగు డ్చున్నతి।శ్రీమానాభ్యయమప్రమాదముననిర్జించుఁ దృఢస్వాంతుఁడై ॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౧౦౩. ఉ॥ కామముఁగ్రోధమున్మనసుగాడఁగఁబొఱుటమాన్పియింద్రియ । స్తోమువిమార్గవర్తనముద్రుంచుచునెవ్వగలేకరక్షణం । బేమఱకెవ్వరింజెనకియేపకనొంపకలోకమేలఁగా । నామహీతాత్మసర్వమహిమాతిశయంబునుబొందువాసవా॥ శాంతి । ఆ ౧ । పు ౮.

౧౦౪. క ॥ కామంబునుగ్రోధంబును । నేమరకజయింపవలయునెల్లసిద్ధములకు । ధీమహితయిదియసతత । క్షేమంకరమైనపథముకృతబుద్ధులకున్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౫.

౧౧౫. క ॥ ఆరయఁగామముగ్రోధము । వైరులుముక్తికవిరెండువారించినసం । సారమనాకారంబగు। నేరవులొండేలముక్తికినెలవుగనుటకున్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౮.

౧౦౬. గీ ॥ ఘనతరప్రజ్ఞయనుతెప్పగలుగువాఁడు । సంసరణనదిగడవంగఁజాలుఁగాక । కామమునుగ్రోధమునుమదిఁగలిగిప్రజ్ఞ । సించునేనియాకడచుటచిక్కువడదె ॥ శాంతి । ఆ ౫। పు ౯౧.

౧౦౭. క ॥ కామక్రోధాద్యములగు । నీమానసవికృతులుడిపియేకాంతగృహా । ధామఁడవైనినువెదకుట । సూమేలొండెల్లనుడుగుసులభవివేకా ॥ శాంతి । ఆ ౪ । పు ౨౦.

౧౦౮. చ॥ అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగుఁ గామతం । త్రనిరతుఁడైనవాఁడు సుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం । డనమున నరింపఁ దట్టిపతిఁ డాయరు సాధులు నార్యులున్ సుహృ । జ్జనులును దానఁ జేటునగుఁ జావును వాటిలు నెల్లభంగులన్ ॥ శాంతి । ఆ 3 । పు ౫౨.

౧౦౯. గీ॥ కామరసమున నతితృష్ణుఁడై మనుష్యుఁ । డర్థతృష్ణాపరీతాంతరంగుఁడైన । గోరి యనడవిలోన నెత్తెడు కోలుపులి యయుఁ । బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి ॥ అను । ఆ ౫ పు ౮౫.

౧౧౦. చ॥ సులభము దుర్లభంబు యని చూడ నెఱుంగ ఫుగన్న దానిపై । నలముదు గామమాయుడుమ లందఁగఁ జేయుదు నింపు లేమిటం । గలుగదు నీకు నీ తెఱఁగు గాథరసాతలభంగి నీవు చ । న్పొలమునఁ బోవకుండి నినుఁ బుచ్చెదఁ బచ్చెన రూపుపోకలన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౧౧. క॥ నీవాసపు టుపధనములు । గావించెదఁ బోషి నాశకమును డూపంగా । నీవశమె కామ మూచెడ । వేపగవున్ లేదు పెనుప వేదైన్యంబున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౧౨. క॥ శోకశ్రమతృష్ణలకున్ । నీకలిమి యమూలమగుట నీక గుపడు వాఁ । డేకర్తవ్యము గానం । డో కామ మనిన్నుఁ దోరఁగ్రిఁ యుండెద సుఖినై ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౧౩. గీ ॥ స్వామ్ముఁగోరినయంతనసుఖముగలుగ । దడియు
పార్థింపఁగాసిద్ధియగుటనిజము । కలిగనేనిననేకచింతలనుఁనర్చుఁ।
జెడుటచావుతోఁదుల్యమయ్యెడుమతేల ॥ శాంతి।ఆ ౪। పు ౭౧.

౧౧౪. క ॥ నీమూలంబేనెఱఁగితిఁ । గామమసంకల్పమున
నకలిగెదుసంక । ల్పమున్క్యరహితమగుచే । తోముద్రందాల్తునే
నుదుఁదియదినీకృష్ణ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౧౫. గీ ॥ ధనముచేటునవిసిపినామనసునిన్ను । నెడలవి
డిచెనుగామమయేనుశాంతి । దాంతిసత్యక్షమాభూతదయలఁ
జెందినాడలోభాదులొందవుననున్నినింక ॥ శాంతి।ఆ ౪।పు ౭౧.

౧౧౬. గీ ॥ కామభోగముల్తేలనఁగాదువాని । విడిచిచూ
డుముపొందెడువిపులసుఖము । కాయలాకులునీళ్లునుగాలియ
నుభ । వించిఁయున్నమునీంద్రులువెఱ్ఱివారె॥శాంతి।ఆ ౧।పు ౬.

౧౧౭. క ॥ కామములుభోగములఁదెగు । నేమేఁలతఁకనేత
నాఁటునేచిచ్చుధృతిం । గామములఁదొరఁగుసౌఖ్యము । నేమె
యిసౌఖ్యములుఁబోలునేయరయంగన్ ॥ అను । ఆ ౫।పు ౧౫.

౧౧౮. గీ ॥ బంధనంబులలోనెల్లఁబరమబంధ । నంబుగా
మంబుతద్వర్జనమునసౌఖ్య । యభ్రపటలంబువాసినయమృతకిర
ణు । పూర్ణమండలమునుబోలెబోలుచుననఘ ॥ శాంతి । ఆ ౫।
పు ౯౫.

౧౧౯. క ॥ బలితపుటురిగామంబున । నిలుచుటయూరజ్జుద్రదె
వ్వానిలిగిస్తుమతిల్ । వెలలిచనిసుఖులగుదుర । వ్వలనెఱుఁగ
రుపదుదురందువత్సదుహాస్మల్ ॥ శాంతి । ఆ ౬ పు ౧౨౪.

౧౨౦. గీ ॥ కామసుఖదివ్యసుఖములకాంక్షవోరఁగు । మే లిపోఁడశాంశంబునఁబోలలేవు । గానఁగామమనిమశత్రుఁకరణిఁ జంపి । బ్రంహపురమునసుండెదభ్రాంతిదక్కి॥శాంతి।ఆర।పు ౭౧.

౧౨౧. సీ ॥ క్రోధంబుపాపంబుగ్రోధంబుననచేసియగుఁజు వ్వేధర్మకామార్థహాని । కడుగ్రోధికర్జంబుగానందుక్రుద్ధుండుగు రునైననిందించుఁగ్రుద్ధుఁడైన । వాడవధ్యులనైనవధియించుమరి యాత్మఘాతంబుసేయఁగఁగడఁగుగ్రుద్ధుఁ। డస్మాదృశులకథశ్మా నుబంధులకిట్టిక్రోధంబుదాల్చుటగుణమెచెపుమ ॥ గీ ॥ యెఱుక గలమహాత్ముఁడెఱుకయన్జలముల । నార్చుగ్రోధమనుమహానలం బుఁ । గ్రోధవర్జితుండుగురుకొనితేజంబు। దాల్చుదేశకాలతత్వ మెఱిఁగి॥ ఆర । ఆ ౧ । పు ౧3.

౧౨౨. గీ ॥ క్రోధమోహానామకులైనఘోరశత్రు । లిరు వురెరియించుచుండుదురెపుడునరుని । నంతరంగములోపలన డఁపకున్న । గలదెయూరకబ్రాంహణగౌరవంబు ॥ ఆర । ఆ ౫ । పు ౯౧.

౧౨3. గీ ॥ పాపములకెల్లనెక్కుడుపాతకములు । సువ్వో క్రోధలోభంబులుసువ్రతాత్మ । వానిరెంటిజయించినవాఁడుగా ని । యెందుఁబరమధార్మికుఁడనియెన్నఁబడఁడు ॥ ఆర । ఆ ౫। పు ౯౨.

౧౨౪. క ॥ రోషముశోకమురాగ । ద్వేషములభిమానద ర్పవేగాలస్యా । శ్లేషములజ్ఞానమనిమ । నీషిజనములుసెప్పువమా ననీయచరిత్రా ॥ శాంతి । ఆ 3 । పు ౭౪.

౧౨౫. క॥ క్రోధము దపముం జెఱుచును । క్రోధమ యణిమాదులయిన గుణముల బాపుఁ । గ్రోధ మధర్మక్రియలకు । బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జనునే ॥ ఆది । ఆ ౨ । పు ౨౨.

౧౨౬. సీ॥ కార్తవీర్య దశముఖ ప్రముఖులు జమదగ్ని తనయ రాఘవాదులైన । పురుషవరుల చేతఁ బొలియరే సక్రోధ । వృత్తిఁ గాన నలుక విడుపు మేలు ॥ శాంతి । ఆ ౬ । పు ౧౮౧.

౧౨౭. క॥ కుపితుఁడగువాని వ్రతమును । జపమును దేవార్చనంబు శ్రాద్ధక్రియయుం । దపమును దానము యజనము । నపగతములుగాఁగఁ జేయు నంతకుఁ డలుకన్ ॥ శాంతి। ఆ ౫। పు ౧౧౦.

౧౨౮. క॥ అనుపమ నియమాన్వితులై । యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు చే । సిన వారికంటె నక్రో । ధనుఁడు కరంబధికుఁ డండ్రు తత్త్వవిజ్ఞుల్ ॥ ఆది । ఆ 3 । పు 3౫.

౧౨౯. క॥ అనహంకారుఁడు నక్రో । ధనుఁడు నతృష్ణుండు నైనతఁడు శుభ మశుభం । బను భేదముఁ బొరయఁడు విడు । పున సమతాసుఖమయత్వమునఁ గనుచుండున్ ॥ శాంతి। ఆ ౫। పు ౧౦౧.

౧౩౦. సీ॥ వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు లోభంబ యది గాముల లోలతయును । క్రోధంబు మత్సర ద్రోహంబులును బరధన దారవాంఛలు దైన్యపాటు । వ్రీడాక్షమా సత్యవిముఖభావంబులు గలిగించి ధర్మంబు గలఁచి నరునిఁ । గ్రియమాలి యేమిటికేనిని భోంకించువానిఁ గా సమకట్టుఁ గాన లుబ్ధ । జనులఁ దొరఁగి లోభము సురింబడని సత్యవ్రతులను బరమధార్మికులను । బాపభీతములఁ బని గొనుల లోభంబుఁ జెందనీకు నీదు చిత్తవృత్తి ॥ శాంతి। ఆ 3 । పు ౬౮.

౧౩౧. ఉ ॥ క్రోధములోభము ఖ భయముం గూరినచిత్తము తోడదుష్క్రియా । సాధనవృత్తిదుర్జనుఁడుసజ్జను లాడఁగఁజే యుకార్యముల్ । బాధలఁబొందకున్నసిరిఁబాయఁగఁజేయక యున్నె వానిఁదీ । వ్రాధినితాంతదుఃఖహృదయత్వముచేరకయు న్నెవానికిన్ ॥ సౌప్తి । ఆ ౧ । పు 3.

౧౩౨. క ॥ కావునలోభము విడుచుట । కేవియుసరిగావు గుణములీగుణముమహీ । దేవునకువలయుఁబెద్దయు । నీవిధముగ నమరసంఘమెంతయుమెచ్చున్ ॥ అను । ఆ 3 । పు ౫౧.

౧౩౩. గీ ॥ నియతతపముసునింద్రియనిగ్రహంబు । భూరి విద్యయుశాంతికిఁగారణములు। వానియన్నిటికంటెమేలైనశాం తికారణములోభముడుగుటకౌరవేంద్ర॥ఉద్యో। ఆ ౨।పు ౨౨.

౧౩౪. క ॥ వినులోభమునజ్ఞానం । బునుసదృశఫలప్రద ములుపుట్టునులోభం । బునసజ్ఞానముగావున। జననాయకలోభముడుగుసౌఖ్యముఁబొందున్ ॥ శాంతి । ఆ 3 । పు ౬౪.

౧౩౫. క ॥ వినుసంసారమునకుఫిను । వనిమత్తుఁడుశోకమోహావశగతుఁడై మోతకునిరూఢింబడయనేరఁడు । మనము విరక్తముగవిసివిముక్తిముక్తిఁగనుమ్ ॥ అను । ఆ ౫ । పు ౧౫.

౧౩౬. క ॥ ఇదినాయదియనునూఁత । న్నదినెయ్యదిపట్టు కొల్పినసువానితమ్మై । గఁదిజేటునొందివానికి । నదిశోకమునా వహించునత్యంతంబున్ ॥ శాంతి । ఆ ౪ । పు । ౬౬.

౧౩౭. క || స్నేహపూర్వమగ్నుండయి । దేహీ మహాదుఃఖ ములధృతింబొందునుదుః । ఖావహుఁడుశోకతాపవి । మోహి యగుఁ స్నేహమూలములుఁ రాగాదుల్ || అర । ఆ ౧। పు ౨.

౧౩౮. క || స్నేహసహవాసములుసు । స్త్రీహానుతలకో లుపఁగాలమునమునుగుచుఁగా । ధాహంకారమమత్వము । లీహఁ బెనుచఁబ్రకృతిపురుషుఁడేననుచుండుర్ || శాంతి । ఆ ౫। పు ౧౨౧.

౧౩౯. గీ || వినుము దేహాభిమానికివీని నెల్లఁ । దొలఁగదో రఁగోనదెంత శాంతుఁనక్కునైన । గాననేమిట దేహాభిమానమెడలు । నట్టిచూపభ్యసించు వేదాంతవిదుఁడు || శాంతి । ఆ ౪। పు ౮౧.

౧౪౦. గీ || ఒకటిగోరిదానను ల్లఁబుగండంగ । జాలిఁబడమి యేమిసంభవించె । నేరిదానఁదృప్తినూనుటఁదప్పిన । పనికివగ వకునికి భవ్యవిధము || శాంతి । ఆ ౫ । పు ౮౯.

౧౪౧. క || ఆర్యులుప్రవృత్తిలక్షణ । కార్యంబుల చేతఁజేసి గ్రాహ్యమునగుంద । ధుర్యత్వమందువిడువవ । నార్యములగు మదనమదభయక్రోధాదుల్ || శాంతి । ఆ ౪ । పు ౮౧.

౧౪౨. క || మదమలినమనస్కుండై । తుదిలేకవినయముసే యుదుర్జనునకుసం । పద పెద్దయయ్యునాతని । మొదలిటిసంపద యుఁజెడునమోఘముదీనర్ || సభా । ఆ ౨ । పు ౨౭.

౧౪౩. క || కోపమునుబ్బునుగర్వము । నాపోపసయునికేఁటు నుదురభిమానమును । ర్వ్యాపారత్వముననునవి । కాపురుష గుణంబులంబ్రమకౌగవనాథా || ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౧౭౭. క ॥ భూరిగుణోన్నతులనఁదగు । వారికిధీరులకు ధరణీవల్లభులకువా । క్పారుష్యముచనునేమహా । దారుణమదివిషముకంటెదహానముకంటెన్ ॥ సభా । ఆ ౨ । పు ౧౮.

౧౭౫. గీ ॥ ఇదియకానిచేయనెద్దియుననుచుని । ర్బంధవృత్తిఁదలఁపువట్టికొనిన । నట్టివారికెందునలజడివాటిల్లు । గాలవృందుగుటయకాఁడెమనకు ॥ ఉద్యో । ఆ ౩ । పు ౫౦.

౧౭౬. క ॥ బలవంతులబలమునకె । గ్గలమగుబలమెదురఁగలుగఁగాఁగీడ్పడునే । కొలదులవారికిగర్వము । నిలుచునెనయమార్గవృత్తినిలిచినభంగిన్ ॥ ఉద్యో । ఆ ౩ । పు ౫౦.

౧౭౭. గీ ॥ బహుళమగుగర్వమునఁగార్యభంగియునున । కార్యసరణియునెఱుఁగకనార్యవృత్తి । గానితెరువుననడచుచున్ననిగురుని । నైనశాసింపఁగాఁదగునండ్రుబుధులు ॥ శాంతి । ఆ ౩ । పు ౫౮.

౧౭౮. గీ ॥ సర్వజనసమ్మతుండగుగర్వముడిగి । క్రోధమడఁచిశోకమునకుఁగుదురుగాఁడు । వినవెయర్థాధ్యుఁడగులోభమొనరవిడిచి । తృష్ణవర్జించిసౌఖ్యముతెరువుగాంచు ॥ అర । ఆ ౭ । పు ౧౬౧.

౧౭౯. గీ ॥ స్వర్గసద్ధర్మమునకునాశనిసుధర్మ । నాశమునఁజేసినరుఁడువినష్టభావ । మొందుగావునసంస్పర్థయుడుగవలయు । నిర్మలశ్రద్ధగైకొనినిపుణుఁడనఘ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౮.

౧౫౦. గీ ॥ వినుముదీర్ఘవైరవృత్తియుద్రోహచిం । తనములేకవాక్కుమనముసొక్కు । చందమగుటసకలజనములకునుబుద్ధి । సంపదాప్తిపరమసాధనంబు ॥ ఆశ్ర । ఆ ౨ । పు ౧౬.

# ౩. ప్రవృత్తి ప్రకరణము.

## ౧ - మానుషప్రయత్నము అవశ్యకము.

౧. గీ ॥ పౌరుషంబుచూవెఫలమంద్రుగొందఱు । ట్లనక దైవ
మిచ్చునంద్రుగార్య । ఫలముగొందఱెల్లఫలముభూతస్వభా ।
వంబయంద్రుగొందఱనఘవినుము ॥ శాంతి । ఆ ౫। పు ౯౦.

౨. క ॥ వినుపౌరుషమును దైవము । నను రెండునుగార్యఫ
లమునందింపఁగనె । ట్టనఁగారణములుగావున । జననాయకసదృ
శములువిచారింపంగన్ ॥ అను । ఆ ౧ । పు ౭.

౩. గీ ॥ పౌరుషమ్ముదైవంబుతోఁడ్పాటులేక । ఫలముఁబొం
దంగనేరదుపార్థివేంద్ర । విత్తి సహకారిగాకున్న రిత్తనేల । వం
ధ్యమగుఁగాక తాఫలవంతమగునె ॥ అను । ఆ ౧ । పు ౬.

౪. క ॥ క్షేత్రంబుపురుషకారము । ధాత్రీశ్వరబీజమరయ
దైవము రెండున్ । సూత్రపడఁగూడెనేనియు । బాత్రమగుంగ
ర్షకుఁడుఫలమునకెందున్ ॥ అను । ఆ । ౧ ।పు ౬.

౫. క ॥ వినుపురుషుఁడుగావింపని । పనులకు దైవమదియె
ట్లుఫలమొనరించున్ । జనములుగార్యమునడుపఁగ । ననుకూల
తనిచ్చుఁగాకయయ్యయిఫలముల్ ॥ అను । ఆ ౧ । పు ౬.

౬. గీ ॥ సారమతిఁబరికింపంగఁబౌరుషంబు । కంటె దైవంబు
ముఖ్యంబుకార్యసిద్ధి । కెచట నేనియుఁబౌరుషమెసకమెసఁగ । నే

నియది ద్వైవదత్తంబయింతనిజము ॥ శాంతి । ఆ ౭ । పు ౭౧.

౭. క ॥ కావునసుద్యోగంబును । దైవంబునుగారణములు తామరసాక్షీ । యేవిధమునకర్మములఫ । లావాప్తికిదీనసంశయములేదుసుమీ ॥ అను । ఆ ౫ । పు ౮౧.

౮. క ॥ దైవంబునేర్చు గాకిటు । పోవంగ నే నేర్తునేరంబో ష్మనిపలుకం । గావలె మనరునకెక్కుడు । దైవముపౌరుషముకం టెధరణీనాథా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౩.

౯. సీ ॥ ప్రారంభములకెల్లఁబౌరుషమ్మును దైవమునుసాధనమ్ములువినుమువాని । లోన నొక్కటిచేతఁగా నేరదనఘతత్ఫలసిద్ధులెట్లన్నఁదఱుచువాన । కారుపోలంబునఁగల్గె నేనియుఁగొల్చుగావింపనేర్చు నేకలవిధమున । వలనేర్పడఁగదున్నఁబొలములలో నైనవర్షంబులేక సస్యధాన్యంబులగునె॥ గీ ॥ కాఁపులావు వెఱవుగల్గికర్షనము సే । యంగవృష్టిదగినయట్లుగలుగ । ఫలముగలుగునట్లుపౌరుషంబునకుదైవంబునోడుపాటువలయునెందు॥ సౌప్తి । ఆ ౧ । పు ౨.

౧౦. చ ॥ నెరవునలావునంగృషికివేయువిథంబులమేలొనర్చినం । దొరఁకొను నేఫలంబుదఱితోఁదగువర్షము లేకయున్న నె । వ్వరుసునలెస్సచేసినను పౌరుషముల్ ఫలియించు నెల్లనా । ధరణమునంబ్రసన్నమగుదైవము చేతనచూవఫల్గునా ॥ ఉద్యో । ఆ ౩ । పు ౩౯.

౧౧. క ॥ ఆరంభరహితుఁబొందునె । యారయసంపదలు హీనుఁడయ్యును బురుషుం । డారంభశీలుఁడయినయక్క । తారంభులనోర్చు నెంతయధికులనయినన్ ॥ సభా । ఆ ౧ । పు ౭.

౧౨. మ ॥ వినుముద్యోగము రెంటియందుఁ బరముఖ్యనాథ యుద్యోగ । వంతునకున్ దైవము దోడ్పడంగ ఫలసిద్ధుల్ చేరు ఉన్మానసం । బున నొక్కొక్కెడ సిద్ధిదప్పినవగల్పొందంగ రానీకయ । ప్పని దైన్యోపహతంబుగాఁగనుట భూపాలార్హవృత్తం బగున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౨.

---

## ౨ - ఆచారము.

౧౩. క ॥ వినుమాచారమవశ్యం । బును నడుపఁగవలయు ధర్మమునకది మూలం । బనఘా ధర్మంబాయువుఁ । బెనుచును లక్ష్మి నియశంబుఁ బెంపొందించున్ ॥ అను । ఆ ౪। పు ౬౧.

౧౪. క ॥ కావున నాచారపరత । భూవరమేల్సాధుజనులు నెఱపు తెరువు సం । భావించుటయాచారము తా వర్ణాశ్రమసమర్థితంబరఁగున్నృపా ॥ అను । ఆ ౪ । పు ౬౦.

౧౫. గీ ॥ అనఘయాచారమాయువుఁ బెనుచునదియ । కాదు శ్రీయును గీర్తియుఁ గలుగఁజేయు । వినుదురాచారుఁ డాయువు పెనుపుఁ బొందఁ । డతని నఖిలభూతంబులు నభిభవించు ॥ అను। ఆ ౪ । పు । ౬౦.

౧౬. గీ ॥ సుకృతులమరలోకసురుచిరవాసులీ । యిలకు డిగి చిరాయువులును నగుదు । రతిచిరముగ నరకగతులయి తుదినాయు । వల్పమగు మనుష్యులగుట గలుగు ॥ అను।ఆ ౫। పు ౮౧.

౧౭. గీ ॥ క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల । వలని భక్తియు నాయువు పొలుపు నిచ్చు । నలుక బొంకు గ్రూరతయు

ఛిత్తాపగమము । గురువిరోధమాఁచువుగడుఁగ్రుంగఁజేయు ॥ అను । ఆ ౫ । పు ౭౦.

౧౮. క ॥ తొలుమేననహింసారుచి। గలిగినదీర్ఘాయువొం దుఁగారణభూతం । బులుభూవరయవియోగుణ । ములులేమి యకీడులనుముూలంబరయన్ ॥ అను । ఆ ౫ । పు ౯౫.

౧౯. గీ ॥ ధర్మసాధనంబుతనువుధర్మముపరి । జ్ఞానదాయి యిట్లుగానఁదనువు । నోమవలయుమర్త్యుఁడేమిటనేమఱి । కా త్మహితముగోరియనఘచరిత ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౦. గీ ॥ అర్థకర్మలోపమపచయమొనరించు । ననఘదే హమునకనర్థభోగ । భారణములురోగతతిజనింపఁగఁజేయుఁ । గానురోషములనుగాయమెడలు ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౧. క ॥ తనలావునకధికమయిన । పనిచేయుటయుక్తము నునపథ్యమునగుభో । జనమునుహరించునాయువు । వసతయ వియుఁబూర్వకర్మవశతనకలుగున్ ॥ అను । ఆ ౫ । పు ౭౦.

౨౨. సీ ॥ తనసత్వమునుబలంబునుదనకయ్యెడుకాలంబునా రయఁగాఁద్గలంపఁ । డాహారములుగొనునవియునునగునవిగాని వియునువివేకంబుబుద్ధిఁ । జొనుపఁడుబహుళభోజనమొకపఱి సేయుసొకపఱిదుర్భిక్షనుపవసించు । గతకాలమునునపక్వంబు నుగురుదుష్టవిషమవిరోధులవిపులరసము ॥ గీ ॥ నైనయన్నము దానవయకభుజింపుఁ । గుడువుఫైఁగడుఁదినునిద్రగూరుసురత ।

పరతనొందుఁ బెల్లాయూసపడువిమూఢుఁ । డతనిబాధించుదోష త్రయంబుగెరలి ॥ అశ్వ । ఆ । ౧ । పు ౧౦.

౨౩. క ॥ అత్యంతప్రబలంబులు । పైత్యవికారములు రేఁగి ప్రాణములకుశీ । ఘ్రాత్యయముం జేయుమహాత్మా । ద్ధత్యంబున నెలవు వెడలఁదరిమి సుచరితా ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౪. గీ ॥ అవ్వికారంబు లెక్కుడై యదరియెచ్చో । యే చోటుభిన్నంబు సేయునయ్యెడలుమర్మ । నామతంబులుమర్మభిన్న త్వమెట్లు । సేయకుండుఁబరిచ్యుతిజీవమునకు ॥ అశ్వ । ఆ ౧। పు ౧౦.

౨౫. క ॥ వినుము తెలియంగ శ్లేష్మం । బనుదోషమ్మూరఁబుకఁ గియవయవములుజా । డ్యనిరూఢంబులుఁగాఁజే । యునులోప లిబయలు నెయ్యనెయ్యనకప్పుఁ ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౬. క ॥ కుత్తుకకునడ్డపడును । రొప్పిత్తిలిపోనీకయూఁగు నూర్ధ్వశ్వాసం । బైతగఁజేయునుజీవం । డత్తనువుననుండనే రకంతటవెడలుఁ ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౭. గీ ॥ వాయువంగంబులందుదుర్వ్యాప్తిఁగదిరి । నువ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వుచెఱుచు । సందులెడలించుఁగ్రమమున నెందుఁబరఁగి । తనువు ప్రమానుగఁ జేసిజీవునివెలార్చు ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౮. క ॥ నాలుకయాపటకేలుం । గాలుముడుపఁజూపన గుటగాయముతుదియం । దీలీలలువాయుగతు । శ్లేష్మలైనంగలు గుదక్కులేమిమహాత్మా ॥ అశ్వ । ఆ ౧ । పు ౧౦.

౨౯. సీ ॥ సజ్జనులందునాచారవంతులదురాచారంబుగష్ట
త్వకారియట్లు । గావుననాచారగతివింటగదుటెస్సరాజమార్గం
బునరచ్చమంద । మూత్రపురీషనిహారంబుసేయమిశౌచిప్తైవ
వార్చినిష్ఠనుజలంబు । చొచ్చుటసంధ్యలసూర్యసేవించుటయు
ర్కోదయాస్తమయములనిద్ర ॥ గీ ॥ స్నానకుండుటపంచార్ద్రి
భావమొంది । కుడుచుటన్నంబుదెగడిమిదడిపదములు । గలుగ
నిదురకుంజొరమిసత్కర్మవేది । నారదుండువివరించెనాచారము
లుగ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౩౦. గీ ॥ ప్రాఙ్ముఖుండునార్ద్రపాదుండునైభోజ । నంబుసేఁ
తమేలనంగవిందు । నిలిచియుండికుడుపునింద్యమమ్మైయిమూత్ర
సర్జనంబుఁబాపసరణియంద్రు ॥ అను । ఆ ౪ । పు ౬౦.

౩౧. క ॥ తలఁజీరఁజుట్టియునుజె । ప్పులుదొడగియుఁజేయు
నట్టిభోజనముఫలం । బలఘుచరితపక్ష్మజుండను । రలభాగంబని
విశెంచెఁబ్రకటఫణితులన్ ॥ అను । ఆ ౩ । పు ౪౮.

౩౨. క॥ ఒకళులుచూచినయదిషా। రికిఁబెట్టకనములుటయు
నుబ్రీఁదనష। ఙ్క్తికిఁదెచ్చినచుట్టలువే। శోకభంగింగుడువఁగు
డుపునురువిషభుక్తిన్॥ అను। ఆ ౪ । పు ౬౧.

౩౩. క ॥ వినుమొరుచూచినమూచూ । చినభోజ్యమునిం
ద్యమన్యచిత్తముతోడం । గొనఁదగదాహారముపా । త్తునఁగుడు
చుటయఘముగూడదుదూషించుటయున్ ॥ అను। ఆ ౪।పు ౬౦.

౩౪. సీ ॥ మానుషీక్షీరంబునీనినపదినాళ్ళలోని ధేనువులపా
లునునపేయ । ములుప్రేతవిషయాన్న మునుసూతకాన్నంబుత
లవరియన్నంబుఁగులటయన్న । మునువనితోపజీవనశీలునన్నం
బునాఁజెడుపాడెడునట్టివాని । యన్నంబుజూదరియన్నంబుసూన
రియన్నంబుబహివెట్టినలనియన్న । మునునిజాగ్రజునకుమును
పెండ్లియాడిన। పురుషునన్న మునునభోజ్యమంద్రు। వందియన్న
మధికనిందాస్పదంబుప । ర్యుషితశుష్కములనునుడుగవలయు॥
శాంతి । ఆ ౧ । పు ౧౮.

౩౫. క ॥ వినుసురతోఁగూడఁగఁదె । చ్చినయట్టిదియెద్ది
యునుభుజింపరుభోజ్య । త్వనిరూపణనిపుణతగల । మనుజో
త్తములఖిలలోకమాన్యచరిత్రా ॥ శాంతి । ఆ ౧ । పు ౧౮.

౩౬. క ॥ జీవితసంశయవేళను। భూవరయెందన్న పానము
లు లేమినిగల్ । ద్రావినఁగల్గునెఱుఁగక । త్రావిననద్దురి మ
ధికధర్మమునఁజెడుఁ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౭.

౩౭. క ॥ పగవారియింటఁగుడిచిన । నగుఁదమకనుమానము
మృతమైననుదారుం । పగతురకుఁగుడువఁబెట్టఁగఁ । దగదోడ
ళుల కెప్పుడెవ్విధమువాటిలునో ॥ ఉద్యో । ఆ ౩ । పు ౪౬.

౩౮. గీ ॥ పలుదెఱంగులవంటకంబులఁబ్రమాదజాతమైయ
శుచిత్వంబుసంభవించి। నప్పుడసురలుగొంద్రుక్రియాఫలంబు। తి
లలుపైనల్కనశుచితదొలఁగునంద్రు ॥ అను । ఆ ౩ । పు ౪౮.

౩౯. గీ ॥ నీళ్లనాడకమునుపూఁతనిందితంబు । నీరలడితోవి
దుర్చుటసెట్టుమొరులు । గట్టివిడిచినవస్త్రంబుగట్టరాదు । మడ

తమూఱ్చుటొప్పదుకడుఁబూఁవునైన ॥ అను । ఆ ౪ । పు ౬౦.

౪౦. గీ ॥ ఉదయమగుసూర్యుఁగనుఁగొనుటొప్పదన్య । వని తనగ్నయైయుండంగవలదుచూడఁ । దనపురీషంబుచూచుటధ రణీనాథ । కీడునిజపాపగుప్తియకృత్యమరయ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౪౧. క ॥ మూత్రపురీషోత్సృష్టము । రాత్రిపగలుదక్షి ణోత్తరదిశాముఖతా । సూత్రణమువలయునదిసం । ధ్యాత్ర యమునునుత్తరంబయగునప్పనికిఁ ॥ అను । ఆ ౩ । పు ౫౩.

౪౨. గీ ॥ ఇన్నియాచారములలోననెక్కుడంద్రు । సకల భూతములందునుసదయుఁడగుట । యాదిమునులట్లుగావుననఖి లవర్ణ । ములకుదయకల్మిపెద్దయువలయుగుణము ॥ అను । ఆ ౪ । పు ౬౧.

## ౩ - నీతిమార్గము.

౪౩. క ॥ పురుషుఁడు రెండుదెఱంగుల । ధరనుత్తముఁడనఁ గఁబరగుఁదానెయ్యెడలం । బరుసములుపలుకకునికిఁ । దురితం బులువోరఁయుపనులుచొఱఁగుటవలనన్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౪౪. చ ॥ పలుకకయుండుకంటెఁదగఁబల్కుటమేలువినుం డుసత్యముం । బలుకుటధర్మమార్గమునఁబల్కుటసర్వజనప్రి యంబుగాఁ । బలుకుటయొప్పినెక్కుడగుభంగులవీనినెఱింగియొం డుమైఁ । బలుకకనాల్గుచందములఁబల్కఁగమెత్తురుమానిదేవతల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౪౫. క ॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ । గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం । దులువతనంబును వచ్చును । బలుకు బడిన శానబోసఁగఁ బలుకఁగ వలయున్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౪౬. క ॥ మనమునకుఁ బ్రియంబును హితము నుబథ్యముఁ దథ్యమును నమోఘము మధురం । బును బరిమితమును నగు పలు । కొనరఁగఁ బలుకున దిధర్మయుతముగ సభలన్ ॥ ఆది । ఆ ౩ । పు ౩౯.

౪౭. క ॥ తనువున నవిఱిగిన యమ్ములు । ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్ । మనమున నాటిన మాటలు । విను మెన్నియుపాయములను వెడలునె యశిపా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౪౮. క ॥ చెడిదముగఁ గత్తిఁ గొడ్డలి । పొడువఁ దెగిన మ్రానఁ జిగురుపొడము పలుకులం । జెడఁ దునిసిన కార్యంబుని । గుడ నేరదు పిదప నెట్టుఁ గురువంశనిధీ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౪౯. క ॥ అలిగిన నలుగక యొగ్గులు । పలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్ । వలుకక బన్నము వడి యెదఁ । దలఁపక యున్న తఁడ చూవె ధర్మజ్ఞుఁడెలన్ ॥ ఆది । ఆ ౩ । పు ౩౫.

౫౦. క ॥ వినుతించిన నిందించిన । ననఘా మనమునఁ బ్రియంబు నప్రియమును లే । కునికియుఁ బ్రవేసినన్నైనను । గనలు వొడమమియుఁ బ్రబుద్ధగణ్యగుణంబుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౭౭.

౫౧. క ॥ జనములు తనున వమానిం । చిన నిందించినను మారు సేయక నైరిం । చిన శాంతాత్ముఁడు పాపల । మును చేసినయట్టి సుకృతముల నాఁచికొనున్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౫౨. క ॥ పలుకువడినతనిఁ బాపం । బులువిడుచుం బలికినత
నిఁ బొందును బాపం । బులునెరుపాపముదనపై । నెలయింపగ
నేలనిందయుడిగినఁగాదే ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౫౩. గీ ॥ తగినవేషంబుతనుఁదానపొగడుకొనమి । మెచ్చి
యునుగీడువలుకమియిచ్చి వగవ । కునికితనకెంతనడుపకయు
న్నఁబధము । దప్పకుండుటనడవడికొప్పఁజేయు ॥ ఉద్యో ।
ఆ ౨ । పు ౨౦.

౫౪. క ॥ అనహంకారమునన్ప్రా । ర్థనమునువిషయములఁ
బెద్దగులమియునుమే । లనఘూపరునిందించుట । దనువర్ణించికొ
నుటనుచితములెయ్యెడలన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౭.

౫౫. క ॥ తల్లికిఁదండ్రికిసుతులకు । నెల్లవిధంబులనువలయు
హితములుసెప్పన్ । మల్లకుఁడుగాకకర్జము । సల్లాపముగాఁగఁ
జూపిసౌజన్యనిధీ ॥ అను । ఆ ౪ । పు ౬౧.

౫౬. క ॥ చెలిమియుసంభాషణమును । బలిమివివాదంబు
ద్రోపుఁబాడియుఁదమయం । తలవారితోనతగునకి । కులహీను
లతోడనైనఁగొఱగాదకిపా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౫౭. క ॥ కడునధికుతోడఁదొడరినఁ । బొడచిననెడిచినను
బురుషుపురుషగుణంబే । ర్పడుఁగాకహీనునెడుచుట । కడిఁది
మెపౌరుషముదానఁగలుగునెచెపుమా ॥ సభా । ఆ ౧ । పు ౭.

౫౮. క ॥ సమశీలవ్రతయుతులకు । సమధనవంతులకుసమ
సుచారిత్రులకున్ । దమలోసఖ్యమునువివా । హమునగుఁగా
కగునెరెండునసమానులకున్ ॥ ఆది । ఆ ౫ । పు ౬౭.

౫౯. చ ॥ ధనపతితోఁ దరిద్రునకుఁ దత్త్వవిదుండగు వానితో
డమూ । ఢునకుం బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్ రణశూ
రుతోడభీ । రునకు వరాంగితోడ నవరాంగికి సజ్జనుతోడఁ గష్టదు ।
ర్జనునకు నెవ్విధంబున సఖ్యము దానొడఁగూడ నేర్చునే ॥ ఆది ।
ఆ ౫ । పు ౬౭.

౬౦. క ॥ మిత్రుం డైహికములు నా । ముత్రికములు నైన భద్ర
ములు దలకొలుపు । న్మిత్రధనంబుల లోనను । మిత్రుఁడ యెక్కు
డనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్ ॥ శాంతి । ఆ 3 । పు ౬౯.

౬౧. ఉ ॥ మిత్రుల చేతలన్ సుఖము మేకొనునంటయుఁ జెం
దుదుఃఖముల్ । శత్రుల చేయినంటయును సమ్మతిదా ధనమూల
మంటయున్ । గోత్రవరేణ్యభోగములకున్ ధనముల్ గరణంబు
లంటయుం । జిత్రచరిత్రుఁడైన విభిచేష్ట యొఱింగిన సీటి త్రోవలగున్ ॥
శాంతి । ఆ ౧ । పు ౧౧.

౬౨. గీ ॥ మొదల నప్రియమయ్యును దుదిఁ గరంబు । పథ్య
మగు పల్కు ప్రియులందు బలిమి నైనఁ । బలుకవలయు మోమోడ
కయొులసియట్టి । వాఁడు తగు మిత్రుఁడగును భూవల్లభునకు ॥
సభా । ఆ ౨ । పు ౨౭.

౬3. క ॥ కడునలుకయుఁ గూర్మియు నే । ర్పడ నెఱిఁగించున
దివానిఫలకాలమునం । బిడుగును గావ్పను జనులకుఁ । బడుట
యు పీచుటయు నెఱుక పడియెడు భంగిన్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౬౪. క ॥ ఉత్తమగుణములఁ జూచుచుఁ దత్తజ్ఞఁడు సుగుణాత్యయ సఖు హాస్య మి త్రియునగుమిత్రునకుం । జిత్తమెలర్పఁ దెలుఁగనుఁ । బొత్తెవమనఁగవలయు శుభముఁ బొందవలసినన్ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౯.

౬౫. చ ॥ అలుకమనంబునం గదిరినాతఁడు దానునెఱుంగదొడ్లచేఁ । దెలియఁడు కార్యతంత్రములు నీ మహితుండగు వానికైవనుం । జెలులును జుట్టలుం దగిలి చెప్పఁగఁ జొప్పడుఁగాక తక్కని । ర్మలమగు నీతితంత్రము దిరంబయి చిత్తమునందు నిల్పునే ॥ సౌప్తి । ఆ ౧ । పు ౪.

౬౬. క ॥ మతిమంతులైన వారికి । హితులగు పెరవు గలవారలెఱిఁగింతురు చు । స్థితిగాఁ దుండను గార్యము । గతియెంతయు నెత్తినెడివిరడవఁ బలికిన్ ॥ సౌప్తి । ఆ ౧ । పు ౫.

౬౭. గీ ॥ దుష్పథంబులఁ జొరనీక త్రోలఁగఁదివుతు । రాష్ట్రజనములు గడవశ్యులయిన వార । లందుఁ బుణ్యుఁబు వోలఁగినవతఁడు వోలఁగుఁ । వోలఁగనేరఁడు భాగ్యంబుతోలఁగు వాఁడు ॥ సౌప్తి । ఆ ౧ । పు ౪.

౬౮. క ॥ ధీరమతియు తులతోడ షి । చారము సేయాన దిము నవిచారితపూర్వ । ప్రారంభమయిన కార్యము । పారము వొందును విఘాతపద దూరంబై ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౬౯. క ॥ తనమేలు కీడు దామది । గనుచు హితులు సెప్ప బుద్ధిగైకొని శుభనుం । గొనకొనినడుపు పతికివ । చ్చునె పశ్చాత్తాపమెట్టి చోట నరేంద్రా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౮.

౭౦. క ॥ మతినెప్పుడుదాధర్మ। స్థితినూహించుచుసుహితు
లుచెప్పెడివెరవు । స్థతిదక్కియాచరించుచు । జితేంద్రియతగలి
గినతఁడువఁజెందునుశుభముల్ ॥ సౌప్తి । ఆ ౧ । పు ౪.

౭౧. క ॥ హీనప్రజ్ఞుఁడకార్యము । లైనవిచేసికుదివగచున
తులప్రజ్ఞా । నూనరథారూఢుఁడువగ । నూనఁడుదురితముల
విరతిశోపికయునికిఁ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౧.

౭౨. గీ॥ కార్యగతులతెఱఁగుకలరూపుసెప్పిన। నధికమతులు
దానినాదరింతు । రల్పభాగ్యబుద్ధులగువారలకునది । విగసకార
ణంబువిషమువ్రాలె ॥ ఆర । ఆ ౧ । పు ౪.

౭౩. గీ ॥ కార్యసిద్ధిఁబొందికాలంబుదేశంబు । నెఱిఁగిబుద్ధి
మంతులెల్లప్రొద్దు । సాహసంబువిడిచిసామాద్యుపాయప్ర ।
యుక్తిచేయుదురుయథోచితముగ ॥ ఆర । ఆ ౩ । పు ౬౫.

౭౪. గీ ॥ కమియఁబండకుండఁగాయఁగోసినచవి। చేటుగా
దువిత్తుచేటుగలుగుఁ। బక్వమగుడుఁగోయఫలమిచ్చుఁజెడదుబీ।
జంబుకార్యసిద్ధిచందమిట్లు ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౭౫. గీ ॥ మాలకరిపువ్వములుగోయుమాడ్కిఁదేఁటి । పు
వ్వుదేనియఁగ్రోలెడుపోల్కినెదురు । గందకుండఁగఁగొనునది
కార్యఫలము । బోగులకుబోలెమొదలంటఁబొడువఁజనదు॥ ఉ
ద్యో। ఆ ౨ । పు ౨౧.

౭౬. క ॥ ఆర్యులుదఱితోఁదగియెడు । కార్యమనుష్ఠింతుర
ట్లుగాకప్పనిమూ । త్వర్యమునఁదిగిచిపట్టియ। నార్యులుదుర్విదూ
ఱినగతురాపదమైనన్ ॥ స్త్రీ । ఆ ౧ । పు ౨.

౨౭. క ॥ ధర్మముదప్పకనయ్యగతిఁ । గర్మాచరణంబునడుపుఁ గాఫలసిద్ధుల్ । నిర్మలయశోయగుఁదప్పినఁ । బేర్మిచెడదునిందరా చఖేదోద్యోత్సాహా ॥ సౌప్తి ॥ ఆ ౧ । పు ౨.

౨౮. క ॥ తగుపనియుద్యోగించుచుఁ । దగవెఱిఁగెడుహితులకనుమతంబుగఁజేయున్ । జగతీసురవరకార్యము । లగువారికిఁగలుగువిధిసహాయత్వంబున్ ॥ సౌప్తి । ఆ ౧ । పు ౨.

౨౯. క ॥ ఏనరుఁడుమానసముద్ధృతి । నూనసుచితవృత్తినుండునుదిలఁగొనకయొం । డైననెయ్యదియేనియు । వానికిదుర్లభములేదువసుధాధీశా ॥ శాంతి । ఆ ౩ । పు ౫౪.

౩౦. క ॥ అరిదివిలుకానియుజ్జ్వల । శరమొక్కనినొంచు తప్పిచనినంజనునే । ర్పరిదైనవానినీతి । స్ఫురణముపగరాజు నతనిభూమియుఁజెఱచున్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౩౧. క ॥ పరహితఫలవంతులును । స్థిరమూలాన్వితుల పారధీయుతులుపర । స్పరసంశ్రయమునజీవిం । తురుమనుజులు వనములోనిద్రుమములపోలెన్ ॥ ఆది । ఆ ౬ । పు ౩౦.

౩౨. క ॥ మైత్రింబోలెడుధర్మము । ధాత్రీదివిజులకులేదు దానినడపినం । బుత్రాయేకర్మంబుప । విత్రతయునువలవదదివి వేకముఁజేర్చున్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౩౩. క ॥ జనులకునొడఁబాటగువిధ । మునసడుచుచులో కనింద్యములనుడుగుచుమీ । ఱినయొకనికలిమికులుకక । మసజులతోఁబొందిపొసఁగిమనుటొప్పున్నృపా ॥ విరాట । ఆ ౨ । పు ౨౦.

౨౪. క ॥ శ్రుతమువలనశ్రోత్రియుఁడగు । నతులతపోయుక్తిఁగడుమహత్త్వము వడయున్ । ధృతిచేసహాయయుతుఁడగు । నతిశయముగబుద్ధిమంతుఁడగుబుధసేవన్ ॥ ఆర। ఆ ౭। పు ౧౬౦.

## ౪ - అక్రమప్రవర్తన.

౨౫. ఉ ॥ నీతిదొలంగికార్యములనెట్టిననాగ్రహవృత్తిఁజేసినం । బ్రీతిగసిద్ధిఁబొందినను భీతిజుగుప్సయుఁబుట్టుభూజనుల్ । త్వేతురుచేయుచేఁతలుఫలింపకతక్కినమున్న వచ్చున । త్ర్యాతురతాస్పదంబులగునాపదలిద్ధవివేకవైభవా ॥ సౌప్తి । ఆ ౧। పు ౨.

౨౬. గీ ॥ బుద్ధిమంతులతెరువునఁబోకయుత్ప । థప్రవర్తులనడుచుపథంబునందు । జనుటవినుమప్పటికిఁజూడఁదనకుఁజాల । నించియుండునాపదనెనరించుఁబిదప ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౨౭. గీ ॥ కానితెరువునఁబోయినఁగలుగునయ్య । బ్రదుకుచవియెంతయైననపథ్యములకు । వేడ్కచేయుదురయ్యవివేకులెవ్వి । ధముననాబుద్ధివినవయ్యతమకముడిగి ॥ విరాట । ఆ ౨ । పు ౧౯.

౨౮. గీ ॥ వంకయైనతలంపెల్లవసుమతీశ । యరయమృత్యుపథంబగునార్జవాన్వి । తంబుబ్రహ్మపథంబింతతథ్యమేల । యాఁడఁదాఁడతలంపులబీఁటువాఁడ ॥ అశ్వ । ఆ ౧ । పు ౨.

౭౯. గీ ॥ వేదవిహితవిధులనాదరించుటయూర్ధ్వ । గతి
కిఁదెరువువిధులఁగడచియెందు।నాఁగఁబడినవానిలోఁగఁగఁజేయు
ట । యధమగతికిమార్గమనిరిబుధులు ॥ ఆది । ఆ ౪ । పు ౪౦.

౮౦. గీ ॥ ఆగమోక్తకర్మమాచరింపమియుని । షిద్ధమైన
దానిఁజేయుటయును । బాత్రజనులుధరణిపాలవరేణ్యచే। ష్టి
దురపాపములుగబోధ్యతతికి ॥ శాంతి । అ ౧ । పు ౧౭.

౮౧. చ ॥ పరుసఁదనంబుబొంకులగుపల్కులునన్యధనాభి
లాషమునుం । బరవనితావిలోలతయుబాంధవసజ్జనవిప్రియంబు
దుశ్చరితులతోడిమైత్రియునుసంతతధర్మరతాభ్యసూయయుం।
గరినిభయూనఘోరనరకంబునకేఁగెడివారిచిహ్నముల్ ॥ అను ।
ఆ ౫ । పు ౭౪.

౮౨. క ॥ పరమర్మభేదములునయ । విరహితములుధర్మకా
ర్యవిముఖంబులుని । ష్ఠురములునగుమాటలున । త్పురుషుండా
డఁడవిసత్యములుగాఁనికిఁ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౮౩. క ॥ అనఘాదుఃఖాత్మకమగు । నన్నృతంబడఁగించుట
కుఁబ్రయత్నమునసుధీ । జనులాచరింతురనిశం । బునుమోహా
విఘాతనియమములునిష్ఠమెయిఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౨౩.

౮౪. గీ ॥ ధర్మమెఱిఁగిదానిఁదానెందుఁగాలోభ । లోభవ
శపాతలోలబుద్ధి । సభలనెవ్వఁడేనిసభ్యుఁడై పలుకువాఁడన్నృత
దోషఫలమునసుభవించు ॥ సభా । ఆ ౨ । పు ౨౯.

౯౫. గీ॥ సభకువచ్చి ధర్మసందేహమడిగిన । నెఱిఁగిచెప్ప కుండిరేనిసభ్యు । లనృతదోషఫలమునందర్ధమొందుదురు । రనిరి ధర్మవేదులయినమునులు ॥ ఆది । ఆ ౨ । పు ౨౯.

౯౬. క॥ తనయెఱిఁగినయర్థంబొరుఁ । డనఘాయిదియెట్లు సెప్పుమనియడిగినఁజెప్పనివాఁడునుసత్యముచె । ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁబడుఁగా ॥ ఆది । ఆ ౧ । పు ౧౧.

౯౭. క॥ వినుమిచ్చెదననియీమియుఁ । గొనియెదననిప లికిపిదపఁగొనకునికియున । త్యనృతంబులుసత్యవ్రత । మునకుం దొలఁగంగమనకుభూవరతగునే ॥ శాంతి । ఆ ౪ । పు ౭౫.

౯౮. గీ॥ సాక్షియునుధర్మదర్శియుసభలయందు । దప్పఁ జెప్పిరియేనిషధర్మవృత్తి । వరుణపాశసహస్రంబువానిఁగట్టి । పా యునొక్కొక్కఁటేటేటనాయతముగ ॥ సభా । ఆ ౨ । పు ౩౦.

౯౯. క॥ పలునుతులశపథంబులునం । జలులునునభివాదన ములుసామప్రియభా । షలుమిథ్యావచనంబులు । గలయవిదు ష్టస్వభావకాపురుషులకున్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౧౦౦. క॥ మృదుభాషణములదుర్జన । హృదయములుప్రస న్నతామహిమఁబొందునెయె । ల్లిదముగఁగొనియంతంతకు । మ దమెక్కుంగాకదురభిమానముపేర్మిన్ ॥ ఉద్యో । ఆ ౧ । పు ౧౪౨.

౧౦౧. గీ॥ చేటుకాలమైనఁజెట్టమాటలునెఱి । గానికీడు పువట్టికర్జములును । దగవులట్టితోఁచుఁదగియెడునవియువి । సికను లనివానమునవిశ్చయించు ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౧౦౨. క ॥ నెమ్మిగలవారినెల్లరు । తమ్మెల్లనివారివెనుకఁద గులుదురధిక । త్వమ్మెఱిఁగియెఱిఁగితొడరుదు। రిమ్మెఱుఁగనియట్టివారలిభపురనాథా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౧౦౩. క ॥ బలవంతుఁడుపైనెత్తిన । బలహీనుఁడుధనము గోలుపడినయతఁడుముచ్చిలి వేఁగునతఁడుగాముఁ । కులచిత్తుఁ డునిద్రలేక కుందుదురధిపా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౧౯.

౧౦౪. సీ ॥ మోహగ్రస్తత్వతృష్ణఁదగిలియాచితంబుకొలఁదిమై। న డుచుచుండువారు జెడిదములకు । నంతస్తాప్తౌరెట్లుసంతాపకోష్ఠు ల। కాక వెనుకవలుసుఖంబులగునె ॥ ఉద్యో । ఆ ౧। పు ౧౪.

౧౦౫. చ ॥ పగయడఁగించుటెంతయుశుభంబదిలెస్సయడం గునేపగం। బగపగగొన్నమార్కొనకపల్కకయుండఁగవచ్చు నేకడుం। దెగమొదలెత్తిపోవఁబగతీర్పకయుండినఁగార్యమొం దునేఁ। మిగలెఁదలంచినంబగకుమేలిమిలేదుధ్రువంబుకేశవా ॥ ఉద్యో । ఆ ౩ । పు ౩౬.

౧౦౬. క ॥ తెగఁదీర్పకతెగనార్పక। తెగటార్పకకడమకొం త ద్రిక్కఁగనున్నన్। జగతీశయప్పునగ్నియుఁ। బగయునుమఱి పెఱుఁగుఁగీడుపాటిల్లుఁదుదిన్ ॥ శాంతి । ఆ ౩ । పు ౫౯.

౧౦౭. క ॥ వినుచల్లనిమాటలలో । మునిఁగియలుకఁగుబ్బ తిలుసముద్రజలములో । ననయుండెడుమాఱుకెప్పుడు । గనగనయు సుబాడబాగ్నికరణినరేంద్రా ॥ శాంతి । ఆ ౩ । పు ౫౯.

౧౦౮. గీ॥ పగయు గల్గెనేనిఁ బాయునెగాఢమైత్రి । మానసగ్నిఁయున్న మూఁడ్కినుండుఁ । గానసమ్మిచేరఁగాలాంతరంబున । నైనఁజెడునుసంధియంబువలదుఁ ॥ శాంతి । అ ౩ । పు ౫౮.

౧౦౯. క ॥ నెయ్యము చెడిననుమాటల । తియ్యఁదనము వట్టిపగమదిన్మఱచినఁజా । వయ్యెఁగలఁకయ్యమఱిచే । టయ్యెనుకటిమూఁడుగాకయదిమేలగునె ॥ శాంతి । ఆ ౩ । పు ౫౮.

౧౧౦. క ॥ బాలుఁడనితలఁచిరిపుతో । నేలిదమునఁగలసియునికియిదికార్యమెఁయు । త్కీలానలకణమించుక । చాలదెకాల్పంగనుగ్రశైలాటవులన్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౧౧౧. క ॥ మొనసియపకారిఁగడనిడి । కొనియుండెడుకుమతిదీర్ఘకుజశాఖాగ్రం । బుననుండినిద్రవోయెడు । మనుజునకుసమానమగుఁబ్రమత్తత్వమునన్ ॥ ఆది । ఆ ౬ । పు ౮౫.

౧౧౨. క ॥ తనకపకారముచేసిన । జనుఁడల్పుండనుచునమ్మిజడమతియయిచే । కొనఁజనదించుకముల్లయి । ననుబద్ధతులందునున్నడవఁగనగునే ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౧౧౩. క ॥ తనకిష్టుగునంతకుదు । ర్జనుఁడిష్టుఁడపోలెనుండిసర్పముపోలెన్ । తనకిష్టుఁడునుగఱచును । ఘనదారుణతర్కగరళఘనదంష్ట్రలచేన్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౧౧౪. గీ ॥ వినుమునేలద్రోచికొనిననుదాయాదు । లైనమాటిమాటికైననాడు । వారియెడనుగీడువారకచేసినఁ । బగజనించునిటిభంగులైదు ॥ శాంతి । ఆ ౩ । పు ౫౮.

౧౧౫. గీ ॥ మహితశాస్త్రకలితమార్గంబువిడిచిని। జేచ్ఛఁ
బగఱగెలువనెవ్వఁడడరు । వానినయ్యధర్మవర్ధనక్రౌర్యమ। యె
వ్విధమునఁజెఱచునింతనిజము ॥ సౌప్తి ॥ ఆ ౧ । పు ౬.

౧౧౬. క ॥ ఎదిరిందమయట్లులకా। మదిఁదలఁచినబోసఁగుగా
కమూకుంగుడుమిం । డిచెమీరుట్రక్కగొనుఁడని । చదురదఁ
చినమనసుపొందుచక్కంబదునే ॥ విరాట । ఆ ౧ । పు ౧౫.

౧౧౭. క ॥ కానవశ్యముపెనుకువఁ । గానియుపాయము
నఁబగఱఁగడతేర్చిధృతిం । బూనినదుచునెవ్వండెడ । దానంజె
యిపెట్టికొనియతఁడునిద్రించుచుఁ ॥ ఉద్యో । ఆ ౩ । పు ౩౬.

౧౧౮. గీ॥ కలహమగుడులకొగ్గావించుఁ బ్రాణహా। నియు
నుచేయునింతనిక్కవంబు । పలుపురొకనికోడిపాఱుటబల్లిదు ।
లనదచేతఁజెడుటయునుఘటించు ॥ ఉద్యో । ఆ ౩ । పు ౩౬.

౧౧౯. క ॥ జయమగునోడుడుమనుని । శ్చయమొక్కఁ
డు లేదువినుముసమరమునఁబరా। జయముమరణంబుకం బెహ్యా।
దయపుటభేదనముసేయుఁదథ్యంబనఘా॥ ఉద్యో।ఆ ౩।పు ౩౬.

౧౨౦. గీ ॥ పగయకలిగెనేనిపాముస్నయింటిలో । నున్న
యట్లకాకయూఱడిల్లి । యుండునెట్లుచిత్తమొకమాటుగావుత।
పలవదధికదీర్ఘవైరవృత్తి ॥ ఉద్యో । ఆ ౩ । పు ౩౬.

౧౨౧. క ॥ వైరులదూతలునేరము । వారునిరాకృతులుఁ
బాపవర్తులుదమకుఁ । జేరువఁగావర్తించుట । నేరమితుఁదిఁబో
రయుఁజేటునిందయుపచ్చుఁ ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౧౨౨. సీ ॥ మానినిత్రివిధముల్మానసవాచకకాయకంబులు పాతకంబులందు । బరధనాపేక్షణపాపానుమోదధర్మద్వేషము ఖములుమానసంబు । లన్నృతదారుణభాషణాదులువాచకములు వధంబునుబంధములునభక్ష్య । భక్షణంబునునన్యభామానురత మద్యపానంబుమొదలైనపాతకములు ॥ గీ ॥ కాయకంబులువిను మధికంబపేయ । పానమదిదుష్కృతంబులలోననెల్ల । బానము ననిందతోవచ్చుఁబ్రాణగోష్ఠ । ములును జేటులునరకాబ్ధిమునుఁ గుటలును ॥ అను । ఆ ౫ । పు ౧౨.

౧౨౩. క ॥ లోకమునిర్మర్యాదా । వ్యాకులమైచెడదెసజ్ఞ నావళిమధుపా । నాకాంక్షదొరఁగకున్న గు । ణాకల్పాయేమి సేయదక్కిడునరుఁ ॥ అను । ఆ ౫ । పు ౧౨.

౧౨౪. క ॥ కావుననేవిధమునసుర। సేవింపకయుండుగుటలాం ప్పుఁజెలువసకలవ । ర్ణావలికిఁదానఁగీర్తి । శ్రీవైభవపుణ్యగతు లుసేర్చికొననగుఁ ॥ అను । ఆ ౫ । పు ౧౨.

౧౨౫. గీ ॥ మొదలిపెక్కుజన్మములఁబుణ్యకర్మముల్। పరఁ గఁజెక్కుచేసిపడయఁబడిన । యట్టియెఱుకజనులకక్షణమాత్రన। చెఱుచుమద్యసేవసేయనగునే ॥ ఆది । ఆ ౩ । పు ౩౪.

౧౨౬. గీ ॥ బ్రహ్మచర్యంబుకంటెనుబరముమద్య । మాం సములురెండునుడుగుటమనుజనాథ । లోకయాత్రపాటించుచ లోలుపత్వ । శమముగల్గివర్తించుటశౌచవిధము ॥ అను । ఆ ౨ । పు ౨౧.

౧౨౭. క ॥ దానముధర్మనుదపమి । జ్ఞానిష్ఠయనంగఁగల్గు
సత్క్రియలెల్లన్ । మానవనాథయహింసా । నూనాకృతులం
బ్రుశ్రుతులనూనినపెద్దల్ ॥ అను । ఆ ౪ । పు ౬౫.

౧౨౮. ఉ ॥ మానమమ్మరాతనుంగలదెమాంసముప్రాణులకెమ్మె
నఁగాకయ । మ్మేనులనెంచునశ్రోత్రమమేనులుసోఁకినమాత్రనెట్లు
గుఱ్ఱ । దానిఁదలంపఁగావలదెతానదిమానినహింసలన్నియున్ ।
న్నానవెయంచునుత్తముఁడుమాంసముమానుదయార్ద్రచిత్తుఁడై ॥
అను । ఆ ౪ । పు ౬౭.

౧౨౯. గీ ॥ అన్యమాంసమునస్వాంగమాంసఁబుఁబోలి పెం
తునుటకంటెఁజెట్టలేదు । మాంసభక్షణంబుమానుటకంటెను ।
మేలులేదుకర్మజాలకమున ॥ అను । ఆ ౪ । పు ౬౫.

౧౩౦. గీ ॥ ఆత్మసదృశతప్రాణభయంబునందుఁ । బ్రాణుల
పనెల్లఁగనిమాంసభక్షణంబు । మానుదయనార్ద్రమానసుండై
నపురుషుఁ । డాతనికిబ్రంహలోకాదులాటపట్టు ॥ అను । ఆ ౪ ।
పు ౬౫.

౧౩౧. క ॥ భూతములకలుగునతనికి । భూతములఖిలము
లునలుగుభూతహితార్థి । భూతతతికభయమిచ్చిన । పూ
తాత్మునకభయమిచ్చుభూతావలియున్ ॥ అను । ఆ ౪ ।
పు ౬౫.

౧౩౨. క॥ తపములదానంబులబ్ర । హ్మపురినివాసంబుదప్పద
నశాదుజనా। ధిపమాంసముననమలని పు । ణ్యపురుషునకుసులభ
మందురానెలవార్యల్ ॥ అను । ఆ ౪ । పు ౬౮.

౧౩౩. క ॥ తనునమలినవానినమలు । ననిమాంసముతెలిఁ
గుసెప్పునాగమములుగా । వునఁదద్భక్షణముడిగిన। ననఘుతపం
బునకుఁజాలునదియొక్కండుఁ ॥ అను । ఆ ౪ । పు ౬౯.

౧౩౪. గీ ॥ మాంసభక్షణదోషంబుమానుదాన । మహిమ
ననుటయుమాంసంబుమతిభుజింప । కున్నఁజూవెధర్మములెవ్వి
యునుదలంప । దయకుసదృశంబులేకురుధరణినాథ ॥ అను ।
ఆ ౪ । పు ౬౮.

౧౩౫. క ॥ జనవరమాంసముచవిగడ । చినచవులరయం
గలేమిఁజేసిచవియెఱిం । గినవాఁడదిఁయుడిగిననాతనిదేవసమా
నుఁడంద్రుధర్మవిధిజ్ఞుల్ ॥ అను । ఆ ౪ । పు ౬౯.

౧౩౬. క ॥ పితృకార్యయజ్ఞముఖముల । శ్రుతిచోదితహిం
సకీడుసారనేరదువి । శ్రుతగుణమాంసముచవిగో । రితినంబ్రా
ణిఁదెగటార్పక్రియఁబాపమగుఁ ॥ అను । ఆ ౪ । పు ౬౯.

౧౩౭. వ ॥ ఇట్లుగాన నంజుదునమలుటయునధికదోషంబులు
గాని యెడలునుంగలిగియుండు నగస్త్యుండు రాజులకువేఁట వి
ధించెంగావునఁగుతూహలంబుకోపంబనియెడు భావంబులంబో
రయకలోకరక్షణార్థంబుగాఁ గ్రూరమృగవధంబును స్వహస్తవి
క్రమార్జితమాంసంబున దేవపితృ ప్రీణనంబొనర్పుటకుఁగాఁ బక్షి

మృగమారణంబు సేఁతు భూనాయకుండు దురితంబులం బొర
యకుండు విశేషంబు వినుము ॥ అను । ఆ ౪ । పు ౬౮.

౧౩౮. క ॥ పానము జూదము వేఁటయు । మానినియును
భూపతులకు మధురవినోద । స్థానములగు నైనను దగ । వైనవి
షము దక్క । దగుల మాపదఁ దెచ్చుఁగా ॥ శాంతి ॥ ఆ ౩ । పు ౫౮.

౧౩౯. గీ ॥ జూదమున మును ధర్మసూనుఁడు రాజ్యంబు । ననుజు
లను బ్రియాంగనను బణంబు । గాఁగ నొడ్డి యోడి కాఱడి యవడఁడె
య । డ్లగుట వినితోడి యర్థకీడు ॥ విరాట । ఆ ౫ । పు ౬౯.

౧౪౦. గీ ॥ కుటిలమార్గులయిన కుత్సితకితవుల । తోడఁ గడఁ
గి జూదమాడఁ జనదు । దానఁ జేసి యఖిలధర్మవివర్జితు । లగుదు
రెట్టివారు జగములోన ॥ సభా । ఆ ౨ । పు ౨౫.

౧౪౧. గీ ॥ క్షత్రనీతిక్రమములు గావు మావె । నిక్కృతియు
ను జూదమును ధర్మనిత్యులయిన । వారికి రెండు వర్జింపవలయు నెం
దుఁ । బాపవృత్తంబు జూదంబు పార్థివులకు ॥ సభా । ఆ ౨ । పు ౨౫.

౧౪౨. క ॥ పరధనహరణము దురితము । పరికింపుము వరుణు
చేతిపాశంబులని । ఘోరముగఁ గట్టువడుదురని । ర్భరనరకకృశాను
శిఖలఁబడుదురు మీఁదన్ ॥ అర । ఆ ౪ । పు ౭౫.

౧౪౩. క ॥ ధనము పహరించుట యతన । కనికముఁ బనిగాఁగ
బ్రతుకు పసనిలుబ్ధునకున్ । వినుతోత్రకులచే నొటుకు । మునుకునప్రజ
చేతఁ జేటు మూఁడు నరేంద్రా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౧౪౪. క॥పురులధనమునకువిద్యా। పరిణతికిందేజమునకుబల
మునకుమనం । బెరియఁగనసహ్యపడున । న్నరుఁడుదెవ్వులులే
నివేదనంబడునశిపా ॥ ఉద్యో । ఆ ౨ । పుట ౨౧.

౧౪౫. గీ ॥ వెలఁదిజూదంబుపానంబువేటపలుకు । ప్రల్లదం
బునుదండంబుఁబరుసదనము । సొమ్మునిష్ప్రయోజనముగవమ్ము
సేఁత । యనెడుసప్తవ్యసనములఁజనదుతగుల ॥ ఉద్యో। ఆ ౨।
పుట ౨౦.

౧౪౬. క ॥ పరదారగమనమొప్పదు । పురుషునకదియెల్ల
పాపములకంటెనరే । శ్వరవరయాయుస్సంతుయ। కరఁబుతద్వ
ర్జనంబుకడుమేలరయన్ ॥ అను । ఆ ౪ । పు ౭౦.

౧౪౭. గీ ॥ ఆయురైశ్వర్యకీర్తులనపహరించు । పరసతీసం
గమముధర్మపథమునందు।బరఁగువారలుపరిహరింపంగఁగనీయు।
వినియుఁదెలియనెయిదిదుర్వివేకమగుట॥విరాట।ఆ ౨। పు ౧౯.

౧౪౮. క ॥ నరనాయకశిశ్నోదర । పరాయణుండగుచు
నొందుపరికింపఁడుదు । ర్నరుఁడెలుకఁబిల్లివాదవిన । పరుసునజ
శవాదువముక్తిఁబడయకపోలియున్ ॥ శాంతి। ఆ ౫।పు ౧౧౦.

౧౪౯. చ ॥ ఒకరునిచేతిప్రోపునుదదున్నతిప్రాపునుగాంచి
యెల్లవెం। టకునుగోఅంతతేకపొగడందగుసంపదనొందునట్టిదా।
తకుమదిఁగీడుచేసినకృతఘ్నునిపీనుఁగుసైనరోఁతవు । ట్టకకబళిం
పఁగుక్కలునుడంబదునేకురువంశవర్ధనా॥ ఉద్యో।ఆ ౨।పు ౨౧.

౧౫౦. క ॥ ఆరయమిత్రద్రోహము। దారుణమగుపాతకము కృతఘ్నతకంటె । న్వైరముగొనివిడువవలయు । నారెండుదె ఱంగులవారినాప్తులనైనన్ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౯.

౧౫౧. క॥ కడునసురక్తియునేర్పును । గడఁకయుఁగలవారి నుఱికకడవఁగ నెగ్గుల్ । నొ[illegible]వెడువివేకశూన్యుల । కడనుండెడునంతకంటెఁగష్టముగలదే ॥ ఆది । ఆ ౩ । పు ౩౬.

౧౫౨. క ॥ కులపాంసనులయియహితం । బులుసేఁయుచు నుండుచుట్టములఁబొందక యి। మ్ములనుండువాఁడుపుణ్యుఁడు । వెలయఁగ గ్రామస్థితైకవృత్తముపోలెన్ ॥ ఆది। ఆ ౬। పు ౮౦.

౧౫౩. గీ ॥ చుట్టములలోననొప్పమిపుట్టునప్పు। డడ్డపడివారితోఁబోరాడినైనఁ। బూనియుడుపంగఁజోరకున్న వానిఁగ్రూర । కర్ముఁడనిచెప్పుదురుకర్మకాండవిధులు ॥ ఉద్యో । ఆ ౩ । పు ౪౭.

౧౫౪. గీ ॥ పలుచదువులుజదివిపండితమాన్యుడై । తనదువిద్యనెరుల ఘనయశంబుఁ । దూలపుచ్చునట్టిదుష్టాత్మకునిబ్రహ్మ। హత్యచెందుసందియంబులేదు ॥ అను । ఆ ౨। పు ౨౧.

౧౫౫. క ॥ ధృతిసెడివేఁడెడువానిని । నతిథినినభ్యాగతునిభ యస్థునిశరణా । గతుఁజంపుటకోడఁబడుదు । ర్మతికిహముంబర ముగలదెమదిఁబరికింపన్ ॥ ఆది । ఆ ౬ । పు ౮౫.

౧౫౬. గీ ॥ శరణుసొచ్చినరక్షింపఁజాలియుండి । కడపిపుచ్చిననూర్ధ్వలోకములుదప్పుఁ । బుణ్యకర్మంబులఫలతఁబొందు నతఁడె । కమలగర్భుండుతొల్లిజగద్ధితముగ॥ఉద్యో॥ఆ ౧। పు౭.

౧౫౭. గీ॥ అంగహీనుదరిద్రుఁడువిద్యావిహీను। రూపహీనుని౯దెగడుటపాపమంద్రు । వేదదేవతానిందలువేతనార్థ । కముగజోస్యంబునఁబుట్టకల్మషములు ॥ అను । ఆ ౪ । పు ౬౦.

౧౫౮. క ॥ వినుమధురాహారంబులు । గొనుటయుఁబెక్కండ్రునిద్రఁగూరినయెడమే । ల్కనియునికియుఁగార్యాలో । చనముఁబెరువునఁడుఘటయునుజనదొక్కనికి౯ ॥ ఉద్యో। ఆ ౨। పు ౨౦.

౧౫౯. క ॥ ఏపాపమేనిలేనిది । కాపురుషతసుతనిమీఁదఁ గలిగించిన । నప్పాపముచేసినవాఁడగు । నాపలువయనంగవిందుమార్యులచేత౯ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౫.

౧౬౦. గీ ॥ ఎఱుకగలఁడేనిమఱిశక్తుఁడేనినన్య । లన్యులకు హింసగావించునపుడుదానిఁ । బూనివారింపకున్నయప్పురుషుఁడేగు । హింసచేసినవారలుయేఁగుగతికి ॥ ఆది। ఆ ౭। పు ౯౫.

౧౬౧. చ ॥ వసుధనధర్మవర్తులగువారలవర్తనమెన్నఁడున్నమం। జనమయినిల్వనేరదుభృశంబుగనాశముఁబొందుదుర్మదా। వ్యసనులధర్మవర్తనఁబ్రవర్తితులయ్యునునేముచూడఁగా। ఘనులునుదైత్యదానవులుగ్రాఁగరెతొల్లిసహస్రసంఖ్యల౯ ॥ ఆర। ఆ ౨। పు ౪౩.

౧౬౨. క ॥ తగునిదితగదనియెదలో । వగవకసాధులకుఁ బేదవారలకెగ్గుల్ । మొగిఁజేయుదుర్వినీతుల । కగుననిమిత్తాగమంబులైనభయంబుల్ ॥ ఆది । ఆ ౧ । పు ౮.

౧౬౩. గీ॥ దినముఁరాత్రియుఋతువులుమనుజుఁజేయు । సుకృతమునుదుష్కృతంబున్నజూచుచుండు। గాననెంతరహస్యంపుకార్యమైనసెరుతెఱుంగరునన్నయునికితగదు॥ అను। ఆ ౨। పు ౨౮.

౧౬౪. చ॥ విమలయశోనిధీపురుషవృత్తిమెఱుంగుచునుండుఁ జూవె వే। దములునుబంచభూతములుధర్మువుసంధ్యలునంతరాత్మ యుఁ। యముఁడునుజంద్రసూర్యులునహంబునురాత్రియునవ్వ హాపదా। ర్థములివియుండఁగానరుఁడుదక్కొనసేర్చునెతన్ను బ్రముచ్చిలన్॥ ఆది। ఆ ౪। పు ౪౪.

౧౬౫. క॥ చనినఁజనుసున్నసుండును। మనుజుండొకటిసే యఁజేయుమనుజాధిపతో। డనెతగిలినీడన్రాతెను। వినుచేసిన కీడుమేలువిడువవుపాసిన్॥ శాంతి।ఆ ౪। పు ౭౨.

౧౬౬. క॥ గురువునకుమారువలికినఁ। బొరసినకల్మషము వాసిపోవునతనికిం। బరితోషముగావినయపు। వెరవునసుపహా రమిచ్చివినతుండయినన్॥ శాంతి। ఆ ౧। పు ౧౮.

౧౬౭. క॥ అన్యతోపచారకలనఁ। బునఁబుట్టినపాతకంబుపో వుందానె। వ్వనినపచరించెఁదగనా। తనిఁబ్రీతునిఁజేయధర్మత త్వప్రవణా॥ శాంతి। ఆ ౧। పు ౧౮.

౧౬౮. క॥ కలఁగినపెద్దమడువువిను। తెలివిఁబొరయునట్లు జ్ఞానధీరుండయియ। గ్గలములయినదురితంబులఁ। గలఁగియుఁ దనయంతఁజేఱుగౌరవమొప్పన్॥ శాంతి। ఆ 3। పు ౪౮.

౧౬౯. క॥ మదిమఱువునఁబాపముదన। కొదవుటయును విధపవగఁదొరొకసగమునుసే। నిదిసేయనింకననిమొదం। మఁది బెఱిసగమునునరుండుమలపునఁశుంబుఁన్॥ ఆర। ఆ ౫। పు ౯౭.

౧౭౦. చ॥ దురితముచేసితాపమునఁదూలిననింకిటుసేయనన న్మతిం। బొరసినధర్మసంచరణబుద్ధియమేలనియమాఁదినంగ్రియా

పరుఁడయిమేలుచేసిననుబాదముపాపముగాఁగ్రమంబున । స్వారి
యుసమస్తముందదభివిష్టకలంకమునిర్భయంబుగఁ ॥ శాంతి ।
ఆ ౪ । పు ౬౨.

౧౭౧. గీ ॥ అతివకామకృతములైనకర్మంబుల । ఫలముల
నుభవింపవలయువినుమ । కామకృత్యముచెడుటగలుగుఁ బ్రాయ
శ్చిత్త । మాచరింపసంశయంబువలదు ॥ అను । ఆ ౫ । పు ౮౦.

## ౫ - రాజధర్మము.

౧౭౨. మ ॥ ధరణీశాన్నృపధర్మముత్తమముసద్ధర్మంబులందె
ల్ల । నేతెరువుఁ రాజరయంగఁగాదెతగసిద్ధింబొందఁగాఁమంబు
గ్రో । ధరయంబుఁ మగుడించిదండమునమత్వవ్యాప్తిఁ జెల్లించు
చుఁ । ధరఁబాలించినరాజుపొందుగతిఁబొందఁ శక్యమేయేరికిఁ ॥
శాంతి । ఆ ౨ । పు ౩౭.

౧౭౩. క ॥ నరరూపంబునఁబరఁగెడు । పరదేవతగానన్నృపుఁ
డుబాలుఁడయినసప్పురుషునెడనేమిపొమ్మని । తిరిగినదుర్గతులఁ
బొందదేకీడధిపా ॥ శాంతి । ఆ ౧ । పు ౬.

౧౭౪. గీ ॥ చారచక్షుఁడై తగనెల్లజగమునమపు । సూర్య
చంద్రునరేంద్రునినార్యవరులు । దనుమునయ్యేడజమ్ముఁడునాఁ
జనునతండు । దేవతాత్మకుఁడగుటసందియమెయధిప ॥ శాంతి ।
ఆ ౨ । పు ౩౮.

౧౭౫. క ॥ వినునృపసమ్రాట్టువిరా । ట్టనియెడుశబ్దములఁ బొగడునాగమములునె । ట్టనభూపాలునినసినవ। తనిఁదగనర్చింపకుండఁదగునెయొరులకున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౧౭౬. గీ ॥ లోకములులోకధర్మంబులునునృపాల । రాజమూలముల్ రాజవిరహితమైన । పుడమిజనులకునింకినమడువులోని । జలచరంబులువడుపాటుసంభవిల్లు ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౧౭౭. గీ ॥ విభుఁడు లేకున్న జనములుసభయహృదయు। లగుచుపాపసినాటంబులడరఁదల్ల । డిల్లుదురురాజులేమియయెల్ల వారు । లేమికల్మియకల్మిని ర్లేపరహిత ॥ శాంతి। ఆ ౨। పు ౩౮.

౧౭౮. క ॥ తనధనమిదియనియూఁబడి । మనఁబరిణయమాదిమైనమహితోత్సవముల్ఁ । గొనియాడనెవ్వరికి । వచ్చునె జనపాలుండులేనిచోనిర్భయతన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౧౭౯. సీ ॥ ఏనుంగునంజలోనెల్లసత్వంబులయంజలునడఁగి నయట్లునృపాల। రాజితక్షత్రధర్మమునకులోనయిసర్వధర్మంబులుఁ జనుసుఖములు । వేదంబులునుశుభవృత్తంబులునుదండనీతిమానినఁజెడుభూతలంబు । సంస్కారరహితమైచాలహీనతఁబొందునట్లైనఁబ్రజకుఁజేటొంపహిల్లు । రాజులరసిననెమ్మదిబ్రతుకఁగాన । రాజుసర్వోత్తముఁడుధర్మరాజయందు। రాజధర్మంబయొక్కఁడురాజనంగ । ధర్మదేవతయనవేఱెధర్మతనయ ॥ శాంతి। ఆ ౨। పు ౩౯.

౧౭౦. సీ॥ రాజునుత్తమగుణభ్రాజిష్ణునభిషిక్తుఁగావించుకొ
నియెల్లకార్యములును । ధనసౌఖ్యంబునఁ జెల్లఁదద్దయుసుఖముండఁ
బడయుదురొకఁడుభూపాలనంబు । సేఁతలేకున్న దుశ్చేష్టితులై
జనులన్యోన్యదారధనాపహరణ । మాచరింతురుమీఁదయట్టులబ
లవంతులల్పులఁదమకునాహారములుగ ॥ గీ ॥ గొందురుభూపతి
లేకున్న మంత్రజనము । లధిపకృషి సేయుటయును బేహారమా
డు । టయునుగోరక్షగావించుటయును మొదలు । గాఁగ బ్రతికె
డు తెరవులుగాసిగాను ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౧౭౧. క ॥ తరణివొడిచితమముచెఱుచు । కరణినిలోక
మునఁగల్గుకల్మషమెల్లన్ । ధరణీపతియాత్మధర్మ । స్ఫురణంబునఁ
జెఱుచువిమలబోధనచరితా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౨.

౧౭౨. క ॥ జనపాలుఁడుమృదుకర్మం । బుననయిననుగ్రూ
రకర్మముననయిననునే । ర్పుననసుధరించునదిత । న్ననపాయతఁ
బొందఁజేయునదికర్మంబుల్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౪.

౧౭౩. క ॥ కానిచెయిదములుసేయక । మానవుధర్మమున
నడుచునుగీర్వశుఁడుసం । తానముబంధులుఁబ్రజయును । దాను
ను సేనయునుశుభముదలఁకొననేర్చున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౮౮.

౧౭౪. గీ ॥ తానుమున్న వినీతుఁడై తనదుమంత్రి వరులఁ
బుత్రులభృత్యులవరుసతోడ । వినయవంతులఁ జేసిభూవిభుఁడు
ప్రజకు । రక్షణము సేయనిహాముఁబరమునుగల్గు ॥ శాంతి । ఆ ౧ ।
పు ౧౦౦.

౧౮౫. క ॥ తనుఁదానతొలుతగెలువ । న్మనుజపతికివలయుఁబిదపమార్తురగెలువఁగ । మనమునఁదలంచునదియును ॥ తనుగెలువనిపతికిగెలువఁదరమేపగఱ ॥ శాంతి। ఆ ౨। పు ౩౮.

౧౮౬. గీ ॥ వినుముతన్నుగెలుచుటనఁగవేఱొకఁడేపంచేంద్రియములఁబారనీకకొలఁది । నాఁగుటయుజితేంద్రియత్వంబుగలరాజు । రిపులఁజెఱుపఁజాలునృపవరేణ్య ॥ శాం। ఆ ౨। పు ౩౮.

౧౮౭. గీ ॥ వీరునమ్ముంగఁదగుదురువీరునమ్మఁ । దగరునాఁగనుపలవదుతత్త్వబుద్ధి । నెవ్వరినివిశ్వసింపకయెల్లప్రొద్దు । నాత్మరక్షాపరుండగునదివిభుండు ॥ ఆది । ఆ ౬ । పు ౭౪.

౧౮౮. క ॥ కడునమ్మియునికియునునె। క్కుడునమ్మమియునుసుశీలకుశలతగాదె । య్యెడనైననుబుద్ధిసాలిపి । తడవికనుఁగొనంగవలయుఁదగవుతగమియుఁ ॥ శాంతి । ఆ ౨। పు ౩౩.

౧౮౯. ఉ ॥ తాలిమిఁజేర్చువారలునుధర్మవిధిజ్ఞులుసత్యవంతులుఁ । లోలతలేనివారుమదలోభనిరర్థకకోపహీనులుఁ । శీలసమేతులుంబలుకునేర్చుటకార్యముగానుప్పెంపుమైఁ। జాలుటగల్గుభృత్యులునుసంపదఁజేయుదురాత్మభర్తకుఁ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౬.

౧౯౦. క ॥ శౌర్యమునుసత్యంబునుస । త్కార్యజ్ఞానమునుభక్తితాత్పర్యముగాం । భీర్యముఁగలిగినఁగురుకుల । వర్యకులంబేలసిరికిపాఁడుమ్ముఁడగుఁ ॥ శాంపె। ఆ ౩ । పు ౫౧.

౧౯౧. చ ॥ కులమునిపట్టిచిత్తమునఁగూరినకీడరయంగలేక
య । గ్గలపువిభూతిదుష్టునకుఁగల్గఁగఁజేయుటకర్జమెట్లుభృత్యు
లమదిఁయున్నరూపరసియుత్తమమధ్యమహీనరూపమా । త్రల
కుఁదగంగనయ్యయిపదంబులనిల్పుటనీతిభర్తయున్ ॥ శాంతి ।
ఆ ౩ । పు ౫౧.

౧౯౨. గీ ॥ తనకుమేలొనరించునాతండుమిత్రుఁ । డతఁడు
నడుపంగనెల్లకార్యములుశుభము । నొందునేమిటనేమఱకునికి
తోడ । నృపుఁడుమిత్రుపైఁగార్యఁబునిలుపవలయు ॥ శాంతి ।
ఆ ౨ । పు ౪౧.

౧౯౩. ఉ ॥ మన్ననకున్నదింపకవమానమువచ్చినస్రుక్క
కొక్కఖం । గిన్నెఱిఁగార్యముల్విగతకిల్బిషుఁడైతగఁజేయున
ట్టి మిత్రున్నరనాయకుండుతనకూపుగనగ్గలమైనశ్రీయున । త్యు
న్నతియున్ఘటించిమహిమోజ్జ్వలుఁజేఁతసుఖావహంబగున్ ॥
శాంతి । ఆ ౨ । పు ౪౧.

౧౯౪. గీ ॥ ధర్మరతులునర్థనిర్మాణచతురులు । తాల్యరహి
తులునునలంఘితాత్ము । లునుసునీతినిపుణులునుగులజులునగు ।
పరిజనములఁబెనుపుపతికిహితము ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౧౯౫. ఉ॥ క్రూరులులోభులున్శఠులుగొండియలున్జడు
లుంగృతఘ్నులున్ । నేరనివారుబొంకునకునిందకునోర్చినదు
ష్టబుద్ధులున్ । ధీరతలేనిమర్త్యులతివ్యసనత్వముగల్గువారలుం ।
జేరవనుస్కిభూపతికిఁజెట్టయొనర్చునరేశ్వరోత్తమా ॥ శాంతి ।
ఆ ౩ । పు ౬౬.

౧౯౬. క ॥ అవలేపంబునఁగర్త । వ్యవివేకము లేకవలసినట్లు లయెవ్వం । డవినీతిసేయుధరణీ । ధవుఁడువిడువవలయుఁదన కతఁడుగురుఁడైనన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౧౯౭. క ॥ గుఱుకోనికార్యాకార్యము । లెఱుఁగకదుశ్చరితుఁడయియహితుఁడగు నేనిన్ । మఱువకగురునైననుజను । లెఱుఁగఁగ శాసించునదిమహీశుఁడుబుద్ధిన్ ॥ ఆది । ఆ ౬ । పు ౭౫.

౧౯౮. సీ ॥ దక్షుఁడై భూపతిదండనీతినయించకున్న సన్న్యాసులునుత్పథప్ర । వర్తకులగుదురువారిరనన్యోన్యధనధాన్యపశుభూమిదారహరణ । మాచరింతురుజనులప్పాపమవ్విభునొందుదండముహింసయుగఁదలంప । వలదుదుర్వృత్తులవధియించు రుద్రునిగోవిందువాసవుగుహునిజూడు । మమ్మహాత్ములుతక్కుదుర్మార్గచరుల । దండితులఁజేతవిన మెయధర్మమడఁగు । ధర్మ మెసఁగుదండమునసర్థమునుగామ । మునునదూష్యంబులైసిద్ధిఁ బొందునధిప ॥ శాంతి । ఆ ౧ । పు ౭.

౧౯౯. గీ ॥ క్షమయతాల్మియుండఁజనదెల్లప్రొద్దుతే । జంబతాల్మియుండఁజనదుపతికి । సంతతక్షముండుసంతతతేజుండు । నగుటదోషమందురనఘమతులు ॥ ఆర । ఆ ౧ । పు ౧౩.

౨౦౦. క ॥ పేదమనసగుటధర్మువు । గాదునరేంద్రునకుజగముగావంబ్రోవం । గాదెన్నృపులోకపాలాం । శోదితుఁడుగఁజేసెబ్రహ్మయోనిచతురతన్ ॥ శాంతి । ఆ ౧ । పు ౬.

౨౦౧. సీ ॥ మేదినీపతియతిమృదువైనమావంతుఁడేనుంగు నెట్లట్లయెక్కియాడు । జూచుఁదేఁకువసెడినీచపుఁబ్రజప్రూరుఁ

దగునే నిశోకంబు బెగడుగుడుచుఁ । గాన వసంతంబు భానునిచా
డ్పునఁదగి యొదువాఁడితో ధరణి ప్రజలనుచితవర్తనముల। నొందిం
చునది యిది రాజధర్మములకు రాజు సుమ్ము ॥ గీ ॥ కౌరవేంద్ర యది
యుఁగాక దండము పరీ । క్షావిశుద్ధిపూర్వకముగ వలయుఁ । దన
తలంపు వెంటఁ దమకించి ప్రజకు నొ । ప్పిగఁ జరించుటయును దగదు
పతికి ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౨౦౨. క ॥ దండార్హులైన వారల । దండింపక యున్నఁ జూవ్వె
ధాత్రీవిభునా। ఖండలసన్నిభునైనన్బ్ర । చండపు కిల్బిషము పొం
దు జగతీనాథా ॥ శాంతి । ఆ ౧ । పు ౬.

౨౦౩. క ॥ వేదలకును సాధులకును । వేదములకుఁ బాపసు
లకు వేయేల సమ । స్తాదిత్యులకును దండము। కాదె బ్రదుకు జేయు
రాజు గావింపంగన్ ॥ శాంతి । ఆ ౧ । పు ౬.

౨౦౪. క ॥ గరదుని గృహదాహకుమం । త్రరహస్యవిభేది
వధవిధాయిఁ బరసతీ । హరు బంధుఘాతిఁ బరధన । హరణపరునిఁ
జంపి పుణ్యుఁడగు నృపుఁడనఘా ॥ శాంతి । ఆ ౧ । పు ౬.

౨౦౫. క ॥ చోరులచేఁ జెడకుండం। గ్రూరులచేఁ జావకుం
డఁగు వలయ జనులన్ । జారులచేఁ బడకుండ ధ । రారమణుఁడు
నేర్పుగలిగి రక్షింపఁదగున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౦౬. క॥ ధర్మమధర్మము భంగిన। ధర్మము ధర్మంబు మాడ్కిఁ
దనయాతోఁచున్ । నిర్మలమతి నరయవలయు । ధార్మికతం గోరు
వాఁడు దన కేర్పడఁగన్ ॥ శాంతి । ఆ ౩ । పు ౫.

౨౦౭. క ॥ ధర్మమధర్మముఁ బోలున । ధర్మము దా ధర్మమగు విధంబునఁ దోచుం । గర్మసమితి నొక్కొకయెడ। ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౧.

౨౦౮. క ॥ అనఘుయధర్మము ధర్మం । బను మతిఁబుట్టించుఁ దృణసమూవృతమైన ప్ర । న్ననితలము చందమునఁ దోఁ । చిన సూయుం బోలె నసూత్మచిత్తత లేమిన్ ॥ అను । ఆ ౫ । పు ౯౪.

౨౦౯. క ॥ కామార్థంబులు మోహా । హామతఁ గృత్యంబులని యెదం గని ధర్మ । స్తోమమునఁ దగులు జనముల । చేమేలుగ నెఱిఁగికొనుము సిద్ధవివేకా ॥ అను । ఆ ౫ । పు ౯౪.

౨౧౦. క ॥ శ్రుతము బరిత్యాగముఁ గల । మతిమంతుల నడుగు లోభమదమోహాసమూ । నృతబుద్ధులు గాని సమం । చితచరితుల వలనఁ దెలియు శీలనిరూఢా ॥ అను । ఆ ౫ । పు ౯౪.

౨౧౧. క ॥ పావిరి మాటలఁ దేలక । భావంబునఁ గీడుమేలుఁ బరికించి యసద్భావుని సద్భావు నిధర । ణీవర యేర్పఱుప నెఱుఁగ నేరఁగవలయున్ ॥ శాంతి । ఆ ౩ । పు ౫౦.

౨౧౨. క ॥ మిత్రత్వము శత్రుత్వము । పాత్రతయు నపాత్రతయును బరికించుసుచా । రిత్రుఁడు చిరతరగణనా । సూత్రితముగ దాన నెల్లశుభములు పొందున్ ॥ శాంతి । ఆ ౫ ।పు ౯౯.

౨౧౩. క ॥ కార్యవిచారము చిరముగ । ధైర్యముతో నడుపవలెఁ జూడ త్తత్క్రియలం । దార్యుఁడనార్యుఁడు పిడని । యా కార్యులు సేయుదురు నిశ్చయంబు చిరముగన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౯.

౨౧౪. క ॥ వినుమచిరవృత్తిఁ జేసిన । పనికర్తకునావహిం
చుఁబశ్చాత్తాపం । బనఘాచిరభావితశు । ద్ధినిరూపణకృతము
శుభమునుఁ దేజము దెచ్చుఁ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౯.

౨౧౫. గీ ॥ ఇవ్విధంబుగాక క్రొవ్వి కామక్రోధ । కలితచిత్త
వృత్తిగలుగ నడచు । పతికినగుఁ జతుర్థభాగంబు ప్రజసేయు । పా
పములు కులప్రదీపచరిత ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౨౧౬. క ॥ రక్షప్రజ గోరు నిజరో । గక్షేమార్థముగ జన
సుఖస్థితి నడుపక । దక్షుఁడగు రాజు నడుపకు । పేక్షించినఁ బాప
మొందదే కురుముఖ్యా ॥ శాంతి । ఆ ౧ । పు ౫.

౨౧౭. క ॥ దోషమరసి కామంబును । రోషంబును లేక తగిన
రూపునఁ జేయం । బోషకమగు ధర్మమునకు । వైషమ్యవిహీనమై
వధము కుమారా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౦.

౨౧౮. క ॥ వెలయవిధిదృష్టినయమున । వలయుఁ బరాక్రమ
ము సేయవసుధేశ్వరయ । గ్గలమగు బుద్ధియుఁ గడఁకయుఁ । గల
పురుషునకిదియచూవె కర్తవ్యమిలన్ ॥ సభా । ఆ ౧ । పు ౭.

౨౧౯. క ॥ నఱుకుటయర్థముఁ గొనుటయుఁ । జెఱనునుచు
టకట్టియడఁచి చేట్పాటొందం । బఱచుట మొదలుగఁ గలపలు ।
దెఱఁగులఁ దగవు మెయి నడపు ధీరవిచారా ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౨౦. సీ ॥ వ్యవహారశుద్ధి సర్వప్రజాప్రియకారి యదియభూ
పతికి ధర్మాతిశయము । కీర్తియుఁ జేయు నక్షీణసత్త్వులు ధర్మపరు
లును నైన భూసురులు నీవు । త్రాసులు న్రానిచిత్తంబులతోడ నుఁ

ప్రజవివాదంబులుపక్షముడిగి । వినిథనవాంఛమైథనికుల దెసప్రా
లితీర్పకధర్మంబు తెరువుదప్ప ॥ గీ ॥ కుండఁబాడిదీర్చి దండింపఁద
గు నెడ । ననుగుణంపుదండమాచరింపు । పొలుఁగఁబలికి తేని
నుండదుప్రజ జేగ । గనినపులుఁగుపిండికరణిఁ జెదరు ॥ శాంతి ॥
ఆ ౨ । పు ౪౨.

౨౨౧. క ॥ రాజునకుఁ బ్రజశరీరము । రాజు ప్రజకునాత్మగా
నరాజును బ్రజయుఁ । రాజోత్తమయన్యోన్యవి । రాజితులై యుం
డవలయురక్ష్యార్చనలఁ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౨౨౨. చ ॥ కపటములేకవైభవముగప్పకయొండొరుమీఁ
దరాజుపై । నపరిమితప్రియంబెసఁగనల్గకయుండుముదంబుఁబొం
దియే । నృపువిషయంబునం బ్రజవినిర్మలవృత్తతఁబుత్రుభంగినా ।
నృపునృపుఁడంద్రుగాకితరునిందగువాఁ రెదనియ్యకొందు రే॥ శాం
తి । ఆ ౨ । పు ౩౩.

౨౨౩. గీ॥ భూతవృద్ధులుధనలాభములునుగలుఁగు । ధర్మమున
నురాజనువాఁడుధర్మరతుఁ । నైజనించెనుగావుననతఁడరోషు । కా
ముఁడై ధర్మనిరతుండుగాఁగవలయు ॥ శాంతి । ఆ ౨ । పు ౪౪.

౨౨౪. క ॥ ధనమున్నకై ధర్మముదెస । ననాదరముచేసె నేని
నానృపతికిన । ధనమును జెడుదుర్యశోమః(?)ం । బనుగొనుఁడుదిడు
ర్గతియును బాటిలుననఘా ॥ శాంతి । ఆ ౨ । పు ౪౪.

౨౨౫. క ॥ లాభంబుధర్మముఖ్యము । గాభరపడినార్గను
ద్ధిగనుఁగొని కైకో । లాభమవరునకునిహాపర । శోభనములుసేఁ
తచెప్పుశ్రుతివాక్యంబుల్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౪.

౨౨౬. క ॥ ఆయతికి మ్మోయిఁగలుగును । హాయంబులుధర్మ మార్గఫలితంబులుగాఁ । జేయుటయుమేలునృపతికి । మాయా కృతినిపుణుఁడగుటమతిగాదుసుమీ ॥ శాంతి । ఆ ౨।పు ౪౩.

౨౨౭. క ॥ వినుకర్షకులునువణిజులు । ననఘాగోరక్షకులు ధరాధీశునకుఁ । ధనమొడఁగూడెడుచోటులననేకవిధములకునెల్లనాద్యస్థలముల్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౨౮. గీ ॥ ధనములకుధాన్యములకునుత్పత్తితలము। లయినవానికించుకయునుహానిగాక । యుండఁదనకునుభండార మొదవఁదగును । పార్జనముసేయవలయుభూపాలకుండు ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౨౯. క ॥ అవుబేహారముగృషియుఁ । సవరణలునుబసులసొంపుసరియట్లగుటఁ । భువిఁబసులుగలుగుకాఁపుల । నవనీశుఁడుకన్నప్రజలయట్లరయఁదగుఁ ॥ శాంతి । ఆ ౨।పు ౪౩.

౨౩౦. క ॥ అరయుటఁబ్రజవర్ధిల్లఁగ । నరియేటేటఁగ్రమవృద్ధియానట్టులుగా । నరపతికిఁగొనఁగవచ్చుఁ। వెరవునఁ బెంపంగఁజాలవెలయుధనంబుల్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౩౧. గీ ॥ కోరితోటవాఁడుకుసుమఫలంబులు । గోయునట్లురాజుగొనఁగవలయు। నవ్వనంబునటికియంగారములుసేయు। భంగినైనభూమిపాడుగాదె ॥ శాంతి । ఆ ౨ । పు ౩౯.

౨౩౨. చ॥జనకుఁడువ్రాలెనర్మిలిఁబ్రజంబరికింపుచుషష్ఠభాగముం । గొనునదివారిచేతనరికోటివిధంబులనాస్తదక్షులఁ । ఘనవనగోకులాకరనగప్రముఖార్థకరంబులారయం। బనుచుచునన్నిటఁ ధరణిపాలుఁడుకన్నిడియుండగాఁదగుఁ ॥ శాంతి । ఆ ౨। పుట ౩౮.

౨౩౩. క ॥ అరియాఱవపాల్గొనుచుం । గరుణగలిగి ప్రజలం దండ్రిగతిమధ్యస్థా । చరణంబునఁ బాలించుట । పరమపదముఁ జేర్చు విడువు భయసంశయముల్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౨౩౪. క ॥ అరిమిగులఁ గొనుట గ్రేపుల । బొరిమాలఁగఁ బిదికినట్లు భూవరకదుపుర్ । వెరవునఁ బెనిచినయట్లగు । నరపతి ప్రజచేతనప్పనము దగఁగొనినన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౩౫. క ॥ పరుసఁదనము మెయిని నరిగొనఁ । జొరఁదగదది పొదుగుగోయుచొప్పగు విను । పొల్గురియించుకొనఁగదలంచిన । నరయవలదెగొవుఁ బ్రజయునట్టిదయధిపా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౯.

౨౩౬. క॥ పులికూనలఁదినుచందము । గలిగిననంతట నెనిలుచు గాకధనంబుల్ । గలుగునె మీఁదం గావున । జలగదిగిచినట్లు గొనఁగఁ జనునిలస్వామ్ముల్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౩౭. క ॥ ధనముసవరించినఁ బ్రభుమో । జనమేమియపాత్రములకుఁ జల్లిచెఱుచునే । నినరేంద్రముఖ్యవ్యయములు । విను రక్షయసిరికిఁ బాత్రవిషయములైనన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౩.

౨౩౮. క ॥ వినుగర్భిణి ప్రజ బ్రదుకున । కనురూపములైన యట్టియాహారంబుల్ । గొనుగతిఁ బతిధరణి ప్రజ । మనికికిఁదగ నడుచునదితమకిగా కెపుడున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౨౩౯. క ॥ మృదుమధురవాక్యములనిం । పొదవెడుచిఱునవ్వుతోడనుర్వీశుఁడు స । మ్మదము సచివులకుఁ బ్రజలకు । నొద

విలసఁగవలయునదిమహోన్నతిఁజేయుఱ్ ॥ శాంతి । ఆ ౨ ।
పు ౩౮.

౨౪౦. క ॥ యాగములునుభోగములును । త్యాగంబులుబ
హువిధములధర్మములుమహా । భాగానరపతిరక్షా । యోగం
బునఁజెల్లుఁబ్రజకునుల్లాసముగన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౨౪౧. గీ ॥ సకలవర్ణధర్మసంకరరక్షయు । సంధివిగ్రహాది
షడ్గుణములు । నలయకరయుటయునునర్థసమ్యగుపార్జ । నము
నున్నృపతియొప్పునడుపవలయు ॥ శాంతి । ఆ ౨ । పు ౩౩.

౨౪౨. గీ ॥ వర్ణములునాశ్రమంబులువసుమతీశుఁ । డుక్త
పథముననడపింపనుభయలోక । సిద్ధిగనుఁదప్పఁద్రొక్కనిశిష్టజ
నులు । గలనరేంద్రునకింద్రుండుదలఁపసరియె ॥ శాంతి ।
ఆ ౨ । పు ౩౬.

౨౪౩. మ ॥ అరయందప్పుకృతంబెఱుంగుమదలోభావేశ
వర్జుఁ లేదుము । ష్కరుఁడాత్మస్తుతిలేదుసేయునియతింకార్యంబు
లీగుణ్ఘన । స్థిరముల్ శూరుఁడుగర్వి గాఁడశఠుఁడస్త్రీలోలుఁ
డక్రోధనుం । డరినొవ్వంగొనఁడన్భిగడ్డఁగనురాజత్యంతదీప్తుం
డగుఁ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౯.

౨౪౪. చ ॥ అతఁడునుమందహాససహితాలపనంబునుసత్య
భాషణ । వ్రతమునుసంవిభాగనిరవద్యతయుఁ సమభావమున్
కృత । జ్ఞతయుజితేంద్రియత్వముఁబ్రసాదఫలంబునుగల్గిభూమి
కిం । బిత్రుసముండైవిరోధిజనభీషణసారతనొప్పఁబెంపగుఁ ॥
శాంతి । ఆ ౨ । పు ౩౭.

౨౪౫. గీ ॥ అధిపనానాప్రకారచరాచరంబు । లిందవేత్వే ఊజనియించునింద పెఱుగు: । బిదపనిందయడంగునీపృథ్వీదాన॥ సకలమునకుఁబరాయణస్థానమరయ ॥ భీష్మ ॥ ఆ ౧ । పు ౨.

౨౪౬. క ॥ వినికిగలిగిరక్షించుచు । ననువునదయతోఁడిపాడినాయతులెల్లన్ । గొనుచుండగనేలిపొగడొందిననృపులకును ర్వీగామధేనువుగాదే ॥ భీష్మ । ఆ ౧ । పు ౩.

౨౪౭. క ॥ కోపంబులేమిసత్యా । లాపమునిజదారపరవిలాసముశుచితా । గోపనమద్రోహంబవ । నీపాలకసర్వవర్ణనియతగుణంబుల్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౬.

౨౪౮. గీ ॥ శస్త్రజీవికయునునరిషడ్భాగ । మూహరించుటయునుభృత్యునరయుటయును । బ్రజవివాదంబువినుచోటఁబక్షపాతి । గామియునురాజులకుఁగృత్యకర్మకోటి॥ అను । ఆ ౫ । పు ౭౫.

౨౪౯. గీ ॥ న్యాయశాస్త్రవేదియైయింగితాకార । చేష్టలెఱిఁగిజనులశిష్టదుష్ట । తావిశేషమరసిదండనీతియొనర్చు । పతికినెల్లమేలుపడయవచ్చు ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౨౫౦. గీ ॥ పరులవలనబాధవోరయకుండగసాధు । జనులధనముగాచుజనవిభుండు । కరుణదప్పితానహరియించువాఁడగు । నేనిసాధులోకమేమిచేయు ॥ ఆది । ఆ ౭ । పు ౯౨.

౨౫౧. క ॥ వ్యాకులతఁబొందిరూపఱు । లోకస్థితితొంటిరాజలోకముచేనం । గీకృతమగుధర్మమనంగీకృతమగునేనిపీతకిల్బిషచరితా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౨.

౨౫౨. క ॥ తరణిశశాంకుల తేజ । స్ఫురణము లేకున్న యట్టుభూజనములుని । ర్భరదురితతఁ జేడ్పడుదురు । నరపాలకవిహితపాలనము లేకున్నన్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౮.

౨౫౩. సీ ॥ ధర్మమార్గంబున ధరణిఁ బాలించిన నైహికసుఖములు నగ్గలంపుఁ । బొగడును బరలోకభూరిసౌఖ్యములును సిద్ధించు విపులదక్షిణలు బెట్టి । యశ్వమేధప్రముఖాధ్వరంబులు పెక్కు లాచరించుటకంటె నధికమంద్రు । మేదినీప్రజలనత్యాదరంబున గరుణాతిశయంబు మధ్యస్థతయును ॥ గీ ॥ గలిగి బిడ్డలనరసిన కరణి గాథ । రక్షణంబొనరించుట రాజవర్య । వినుము తమ్ములనీగిమన్నన నలననుది । తంబుగొనియాడు మానందనంబుగాఁగ ॥ ఆశ్ర । ఆ ౧ । పు ౫.

౨౫౪. క ॥ దాంతియుఁ బ్రియవాదిత్వము । శాంతియు శీలంబుఁ గలుగు జగతీశుఁడ శ్రీ । మంతుండు యశస్వియునై యెంతయు సౌఖ్యంబు నెందు నిభపురనాథా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౨.

౨౫౫. గీ ॥ అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ । సిద్ధిదాన సకలసిద్ధులును బ్ర । శస్తభంగి జేరు శాశ్వతకీర్తియు । సంభవించుఁ గలుగు సద్గతియును ॥ శాంతి । ఆ ౨ । పు ౪౪.

౨౫౬. క ॥ దయఁ బ్రజరక్షించుటకును । నయతపములు నధ్వరములు వరవరదానన్ । జయమును లక్ష్మియునుం గీ । ర్తియు సుగతియుఁ గలుగు వసుమతీనాథునకున్ ॥ శాంతి । ఆ ౨ । పు ౩౬.

౨౫౭. ఉ ॥ కీర్తియ యిచ్చుఁ బుణ్యగతి కీర్తియ తల్లియుఁ బోలెఁ బ్రోచు నస । త్కీర్తియ యాయువున్ సిరియుఁ గీర్తివిహీనుఁడు చూ

శవంబుదు । పిక్కర్తికినెల్లచేటులునుగిట్టిహరించునకండాతోల్లిభ । క్తార్తిహరుండునాఁబరఁగునంబుజనూతిజగద్ధితంబుగన్ ॥ ఆర । ఆ ౭।పు ౧౫౩.

౨౫౮. గీ ॥ కీర్తిలేనివానికినిజీవనంబుని । రర్థకంబునూవె యవనిమీఁద । నిత్యమయినధనమునిర్మలకీర్తియ । యట్టికీర్తివడ యుటశ్రమంబె ॥ అది । ఆ ౮ । పు ౧౦౬.

౨౫౯. క ॥ ఇలఁగీర్తియెంతకాలము । గలిగిప్రవర్తిల్లునంత కాలంబును । నిత్యులుగారెకీర్తిగలపు । ణ్యులుకీర్తివిహీనుఁడెం దునుంబూజ్యుండే ॥ ఆది । ఆ ౮ । పు ౧౦౬.

౨౬౦. క ॥ తనకీర్తియెంతకాలము । వినఁబడునిజ్జగమునం దువెలయఁగనందా । కనుబుణ్యలోకసౌఖ్యం । బునసెంతయు నుల్లసిల్లుఁబురుషుండనఘా ॥ ఆర । ఆ ౪ । పు ౮౭.

---

# ౬ - సేవాధర్మము.

---

౨౬౧. ఉ ॥ ఎండకువానకోర్చితనయిల్లుప్రవాసముచోట నాకమూ । కొండనలుంగుదున్నిదురకుందటిదప్పెనుదప్పిపుట్టె ను । కృండనయెట్లొకోయనకకార్యముపుట్టినచోటనేలినా । తంతొకచాయచూపినను దత్పరతంబనిసేఁయుటొప్పగున్ ॥ వి రాట । ఆ ౧ । పు ౭.

౨౬౨. చ ॥ ధరణిపుచక్కగట్టెదురుదక్కిపిఱుందునుగాని యట్లుగా । నిరుగెలనంతగంగొలిచిధేమనునోయెటుచూచునె

క్కొయె । వ్వరిఁ జేసనెప్పుడేతలఁపువచ్చు నెయ్యాతనికింపుఁ జా
డ్కను । స్థిరముగ దన్ముఖంబునన చేరిచిఁయుండుటనీతికొల్వునన్ ॥
విరాట । ఆ ౧ । పు ౭.

౨౬౩. క ॥ తగఁజొచ్చి తనకునర్హం । బగు నెడఁ గూర్చుండి
చూపమవికృతవేషం । బుగసమయమెఱిఁగి కొలిచిన । జగతీవల్ల
భునకతఁడు సమ్మాన్యుఁడగున్ ॥ విరాట । ఆ ౧ । పు ౬.

౨౬౪. క ॥ ఊరక యుండక పలువుర । తోరవమెసఁగంగఁ
బలుకఁ దొడరక యుమతిం । జేరువగల నాగరికులుఁ । దారుగల
సి పలుకవలయు ధరణీశుకడన్ ॥ విరాట । ఆ ౧ । పు ౬.

౨౬౫. గీ॥ రాజు నొద్దఁ బలువురకు సంకటంబుగాఁ దిరుగు పను
లనెంత తేజమైన । వానిబుద్ధిగలుగువారొల్లరటు మీఁదఁ । జేటు
దెచ్చు టెట్లు సిద్ధను గుట॥ విరాట । ఆ ౧ । పు ౬.

౨౬౬. క ॥ చనువానిచేయు కార్యం । బునకడ్డము చొచ్చి
నేఁ బునమెలఁగుచుఁదా । నునుబయిఁ బూసికొనినఁ దన। మును
మెఱఁగెడు మెలఁకువకునుముప్పగుఁ బిదపన్ ॥విరాట।ఆ౧।పు౬.

౨౬౭. గీ ॥ వసుమతీశుపాలవర్తించు నేనుంగు । తోడనై
నఁ దోమతోడనైన । వైరమగు తెఱంగు వలవదు తానెంత । పూ
జ్యుఁడైన జనులపొందు లెస్స ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౬౮. క ॥ నేతోక తెఱఁగున నొరులకు । మాత్రాదకయు
నికి లెస్సమను జేంద్రునకున్ । తీఱమిగల చోటులఁ దా । మీఱి
కడఁగివచ్చి పంపు మెయికోపతలయున్ ॥ విరాట । ఆ ౧।పు ౭.

౨౧౯. గీ ॥ ఆవులింతతుమ్ముహాసంబునిష్ఠీవ । నంబుగుప్తవ
ర్తనములుగాఁగ । సలుపవలయునృపతికొలువున్నయెడలబా ।
హిరములైనగాలనిగ్గులగుట ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౨౦. క ॥ పుత్రులుఁబౌత్రులుభ్రాతలు । మిత్రులనరరా
జులాజ్ఞమీఱినవోటుల్ । శత్రులకాఁదమయులుతమఁ । బాత్ర
ముచేయుదురునిజశుభస్థితిపొంటెన్ ॥ విరాట । ఆ ౧।పు ౬.

౨౨౧. క ॥ నరనాథుఁగొలిచియలవడఁ। దిరిగితినాకేమియ
నుచుఁజేఁకువలేక । మ్మరియూఁదవప్పుమెలఁగినఁ । బురుషార్థంబు
నకుహానిపుట్టకయున్నే ॥ విరాట । ఆ ౧ । పు ౬.

౨౨౨. క ॥ తానెంతయాప్తుఁడైనను । హీనాయకుసొమ్ము
పాము నెమ్ములుగాలోఁ । నూనినభయమునఁబొరయక । మాని
నఁగాకేలగలుగుమానముబ్రదుకున్ ॥ విరాట । ఆ ౧। పు ౭.

౨౨౩. క ॥ జనపతియెవ్వరినైనను । మనుపఁజెఱుపఁబూ
నినయునికిమదిఁదెలియనెఱిం । గిననైనఁదాసువెలిపు। చ్చునెము
సుమున్నెట్టిపాలసుండసుదానిన్ ॥ విరాట। ఆ ౧ । పు ౭.

౨౨౪. క ॥ అంతిపురముచుట్టఱికం । బెంతయుఁగీడంతకం
బెనగ్గుతధీయూ । సొంతపరకుబ్జవామన । కాంతాదులతోడి
పొందుకలిమిభటునకున్ ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౨౫. క ॥ నగళులలోపలిమాటలు । తగునేవెలిసుగ్గడిం
పఁదనకేర్పడనుం । దుగడంబుట్టినఁబతిపిన । నగుపనిచెప్పెడిది
గాకయూఁతనితోడన్ ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౭౬. ఉ॥ రాజగృహంబుకంటెనభిరామముగానిలుఁగట్టఁ గూడదే । యోజనృపాలుఁడాకృతికినొప్పగువేషములాచరించునే । రాజవిహారముల్సలుపనుల్లమునం । గడునేడ్కఁ జేయునే । యోజవిదగ్ధుఁడై పలుకునొడ్డకునుండగదట్లుచేయఁగన్ ॥ విరాట । ఆ ౧ । పు ౬.

౨౭౭. గీ॥ ఉత్తమాసనములునుత్కృష్టవాహనం । బులునగరుణఁదమకుభూమిపాలుఁ । డీకతారయెక్కుటెంతటిమన్నన । గలుగువారికైనఁగార్యమగునె ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౭౮. క॥ కలిమికిభోగములుకదా । ఫలమనితామెఱసిబయలుపఱఁబెల్లుగవి । చ్చలవిడిభోగింపకవే । డ్కలుసలుపఁగవలయుభటుఁడడంకువతోడన్ ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౭౯. క॥ మన్ననకుబ్బకయవమతి । దన్నొందినక్రుస్సుక్కఁబడకధరణీశుకడన్ । మున్నున్నయట్లమెలఁగిన । యన్నరునకుశుభములొందవునాపదలడఁగున్ ॥ విరాట । ఆ ౧ । పు ౭.

౨౮౦. క॥ నియతిమెయినెవ్వఁడింద్రియ । జయమునుభక్తియునుజిత్తసారముధృఢసం । శ్రేయతయుఁగలిగికొలుచునృపు । నయసంపన్నునిఁగఁజేయునధిపతియతనిన్ ॥ శాంతి । ఆ ౧ । పుట ౩౮.

# గృహస్థధర్మము.

౨౮౧. ఉ ॥ అంబుజసూతియేర్పడగృహస్థసమర్థముగా బ్రవృత్తిధ। ర్మంబొనర్చె నార్యజనమాన్యముదాని తెలుంగుచా లసూ । త్మ్యంబతికాంక్షలేకతగుకాలమునన్సమచిత్తవృత్తినిత్యం బునుధర్మముఖ్యముగనర్థముఁగామముసల్పుటొప్పగుఁ ॥ అను। ఆ ౫ । పు ౭౬.

౨౮౨. క ॥ దీనికినఖిలాశ్రమసువి । ధానంబులకునుగృహస్థతయెనెలవగుటఁ । దానిపదాఱవపాలిస। మానముగాదరయ నాశ్రమంబెయ్యదియుఁ ॥ అను । ఆ ౫ । పు ౭౭.

౨౮౩. క ॥ తక్కినమూఁడాశ్రమములు । నొక్కెడెసగృహస్థధర్మమొకదెసఁదులయం । దెక్కింపవానితోనన । యొక్కటిసరిదూఁగనందురుర్వీశబుధుల్ ॥ శాంతి । ఆ ౧ । పు ౫.

౨౮౪. గీ ॥ భోగములుసంపరిత్యక్తములుగఁజేసి। కేవలాంగుఁడైనిర్మలభావయుక్తిఁ । దపముగృహముననైనఁదత్పరతనా చ । రించిసంసారజలధిఁదరించునతఁడు ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౨౮౫. గీ ॥ పుత్రదారబంధుమిత్రసక్తుఁడురోంపిఁ । బడినగజమునట్లయడఁకునొందు । భోగజాలపరుఁడువాగురాజాలసం। పతితమృగఘోషములభంగిఁజెలరు ॥ శాంతి। ఆ ౬ । పు ౧౨౫.

౨౮౬. క ॥ ఆలునుబిడ్డలుబంధులు । నైలీలఁజరించుచును గృహస్థుఁడుదత్త । ల్లోలత్వరహితచిత్తత । మేలుగఁవలనఱప వలయుమీఁదెజేఁగిన్నృపా ॥ శాంతి । ఆ ౧ । పు ౧౮.

౨౮౭. గీ ॥ కీడుగనియొకండుగృహధర్మముడిగిస । మాశ్ర— యించునాశ్రమాంతరంబు । దానసంగముడుగఁగానేరబడియె ల్ల । మియునువలపుగానమీననయన॥ శాంతి।ఆ ౬। పు ౧౨౨.

౨౮౮. క ॥ వినుమోక్షముగార్హస్థ్యం । బునఁగాదనియె న్నఁడేచటఁబురుషుండెవ్వం । డునిరూపించిపలికెస । ర్వసిద్ధా నముగృహమువేదవాక్యఫలజ్ఞా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౦.

౨౮౯. మ ॥ నిజదారైకపరత్వముంగరుణయున్నిక్కంబు నుండాల్మియుక్తా । సుజనాసంగముదేవపిత్రతిథిసంశుద్ధార్చనల్ హవ్యభు । గ్భజనంబుల్ సకలాశ్రమస్థులనుశక్యప్రక్రియంబ్రో పుఁబం।కజగర్భుండుగృహస్థధర్మములుగాఁగల్పించెనుర్వీశ్వరా ॥ శాంతి । ఆ ౨ । పు ౩౬.

౨౯౦. గీ ॥ ప్రజలుతల్లిఁజెందాపగిదిఁగృహస్థధ । ర్మంబునెల్ల యాశ్రమములుఁజేరి । కాదెజీవనంబుగావించుకొనుగృహ।యు క్షుఁడోషధులకునొడయఁడగుట ॥ శాంతి । ఆ ౫।పు ౧౦౦.

౨౯౧. గీ ॥ క్షుత్పిపాసలచేఁగడుఁగుందినట్టి । యతిథివచ్చి నఁబ్రియమునసతనిడప్పి । ప్రాపునట్లుగసముచితభోజనంబు। వె ట్టనెల్లపుణ్యములకుఁబెద్దతలఁప ॥ అను । ఆ ౫।పు ౭౬.

౫౨. గీ॥ పంచపర్వసురతపరిహృతితో నిజ। దారతృప్తుండ
గుచుధాన్యకోటి । పత్నియెుకదినినబ్రహ్మకుకాంగనుగృహపతికి
నశ్వమేధఫలముగలుగు ॥ అను । ఆ ౫ । పు ౭౭.

౫౩. క॥ వినుపర్జన్యుండుభూతము । లనుబండినబ్రహ్మా
సుపతులనుబ్రోచువిధం । బునునీవుబంధువులస । జ్జనయుతము
గంబ్రోవుమదిప్రశస్తంబనఘా ॥ శాంతి । ఆ ౨ । పు ౪౦.

౫౪. గీ॥ భగినిగురునిమిత్రుఁబండితువంశజు । వేదవడినఁ
దెచ్చిప్రియముతోడఁ । దనగృహమునకల్పితనురూపముగఁబ్రో
వు । పెనుపుసేయునాఁటువునకుసిరికి ॥ అను। ఆ ౪।పు ౬౧.

౫౫. క॥ అతిథిజనులుతమతమహాం । శితములనుభవిం
చునట్లుసేయంగనినం । గృతకృత్యతఁబొరయుఁగృహ। పతియు
నుగృహిణియునుగర్మభారమువలనన్ ॥ అను । ఆ ౧ । పు ౩.

౫౬. గీ॥ అతిథిదేవతాపితృపూజలాచరించి । కానిగృహ
మేధులకుభోజ్యమైనగుడువఁ । దగదుయజ్ఞశిష్టంబమృతంబుగాఁ
గ । నార్యజనములుచెప్పుదురధిపముఖ్య ॥ శాంతి । ఆ ౧ ।
పు ౧౮.

౫౭. క॥ తనయింటఁగలుగునన్నము । మునుదేవతలకు
నివేద్యముగఁజేసిప్రణా । మనియమసహితసమర్పణ। మునఁగృ
తకృత్యుఁడుగవలయుఁబురుషుఁడనఘా ॥ అను।ఆ ౫।పు ౫౭.

౫౮. క॥ దేవతలకునర్ఘ్యముసం। భావననుపహారమిచ్చి
పదపడికుడువం । గావలయునట్లుసేయని । ధీవిరహితుఁడసుర
యగుటదెల్లంబధిపా ॥ అను । ఆ ౪ । పు ౫౭.

౨౯౯. క ॥ ఉపహారసమర్పకుఁడగు । సుపురుషుగృహాద్రై
వతములుశోభములఁగూర్చున్ । నృపవరతత్కర్మరహితుఁ।గృ
హలేకనితాంతవిఫలకృత్యుం జేయున్ ॥ అను। ఆ ౪। పు ౫౭.

౩౦౦. క ॥ ఏలినవానిని దైవము । నాలినిబంధులనుసముచి
తారాధనసం । శీలతఁ బ్రీతులఁ జేయని । పాలసుఁడాఫలములొంస
పడుమను జేంద్రా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౩౦౧. క ॥ దేవాతిథిపితృపూజలు । గావించుటభావశుద్ధిక
లిమినరునకున్ । దేవీవలయునునాటికి । నేవిధమునబ్రంహచర్య
మేమరమి తగున్ ॥ అను । ఆ ౫ । పు ౭౭.

౩౦౨. క ॥ నృపవరపూర్వాహ్ణంబును। నపరాహ్ణముదేవపి
తృసమారాధనకి।ద్ధ్యుపదిష్టకాలములుమ। ధ్యపుసమయమునూ
నుపార్చనార్హంబరయ ॥ అను । ఆ ౨ । పు ౨౧.

౩౦౩. గీ ॥ రేపకడయునుబగలునుమాపువరుస । నర్థధర్మ
కామంబులనాచరింప । వలయువానియందాసక్తివలదుసక్తుఁ। డ
య్యెనేనియుమేలుధర్మాభినిరతి ॥ అను । ఆ ౨ । పు ౨౧.

౩౦౪. క ॥ జతనంబుననర్థమునుసం । చితముగఁ గావించిక్రతు
విశేషంబులదే । వతులనుదృప్తులజేయుమి । యతికిల్బిషకారి
యందురాగమవేదుల్ ॥ శాంతి । ఆ ౧ । పు ౫.

౩౦౫. గీ ॥ వడ్డికిచ్చికుడుచువాఁడునననగ్నియును । బ్రాణి
విక్రయమునబ్రదుకునతఁడు । దైవపిత్ర్యములకుఁదగరుసంధ్యో
పాస । నములులేనివారునగవరేణ్య ॥ అను । ఆ ౨ । పు ౨౧

3౦౬. క ॥ దైవికకృత్యంబులకును। భూవరభూసురులపూర్ణముగశోధింపం । గావలదుగానిపిత్రుపూజావిధికిఁబరీక్షవలయుసమ్యగ్భంగిన్ ॥ అను । ఆ 3 । పు ౪౭.

3౦౭. గీ ॥ కులవయోరూపశీలవిద్యలనుదాత్తులనఁగఁదగువారుపఙ్క్తిపావనులుతద్గుణమ్ములారయలేనిజనములుపఙ్క్తి । దూషకులుపైత్రృకమునకుదోషదూర ॥ అను ।ఆ 3 । పు ౪౭.

3౦౮। క ॥ వ్యాకరణధర్మశాస్త్రవి । వేకములుపురాణజాతవేదిత్వముఁబ్ర । స్తోకత్వబోధనమునధి । పాకలిగినవారుపఙ్క్తిపావనులుగదూర్ ॥ అను।ఆ 3 । పు ౪౭.

3౦౯. క ॥ శాంతుఁడుసువ్రతశీలుఁడు । దాంతుండధ్యాపకుండుదయగలవాఁడ । త్యంతప్రబోధసంప । ద్వంతుఁడుపావనులుభూపవరపఙ్క్తులకున్ ॥ అను । ఆ 3 । పు ౪౭.

3౧౦. గీ ॥ మేలిగుణములుగనియునమిత్రజనము। శ్రాద్ధపాత్రంబుఁజేయంగఁజనదమిత్ర । దత్తమైనదిభస్మహుతంబుఁజొటనిడినవిత్తనుబోలెనైచెడున్నృపాల ॥ అను । ఆ 3 । పు ౪. ౭

3౧౧. క ॥ మునుముట్టనెఱిగిశ్రాద్ధం । బునకుంగైకొనుటమేలుభూసురునిన్గై। కొనియరసికాఁడనిననా । తనిఁనుమ్మలికంబుచెరుచుధార్మికునైనన్ ॥ అను ।ఆ 3 । పు ౪౭.

3౧౨. క ॥ అపరంబగుపక్షంబును। నపరాహ్ణముమేలుపిత్ృసమర్చనమునకా । ద్యపుతిథిదశమిచతుర్దశి । నృపవరయప్పటుముననునింద్యతఁబొరయున్॥ అను । ఆ 3 । పు ౪౭.

౩౧౩. క ॥ అమవసనమవసఁబిత్రృయ। జ్ఞముదగఁబిండప్ర
దానసహితముగాభ । క్తిమెయిం జేయునతఁడుని । త్యముఁజే
సినవాఁడయగుసమంచితచరితా ॥ అను । ఆ ౩ । పు ౪౬.

౩౧౪. గీ ॥ మునుగయుల్లియడవిమునుగదుర్గాంసము। లా
నుగుప్తమలినమైనఁచుప్పు । కలియజీలకట్టకరివేముగురిజయిం ।
గుప్పఁబ్రపర్ణసీయకోటియగుట ॥ అను । ఆ ౩ । పు ౪౯.

౩౧౫. క ॥ వినుసర్వభూతములయం । దునుపూర్ణదయయు
క్తుఁడైమధురవాగ్వృత్తిం । బనుపడఁగవలయునార్జవ। మనూన
ముగజీవపిత్రృసమర్చకుఁడగుచుఁ ॥ శాంతి । ఆ ౫ ।పు ౧౦౬.

౩౧౬. గీ॥చెల్లియుండియసయిరణచేయునతఁడుఁ । జేదవడి
యునున్నద్ధిక్రియముతోడఁ । దనకుఁగలభంగినిచ్చునతండుఁబు
ణ్యపురుషులనిచెప్పిరార్యులుకురువరేణ్య॥ ఉద్యో।ఆ౨।పు ౨౦.

౩౧౭. క ॥ వినుమలసుండునుగర్వియు । ననర్థభాషియును
మత్సరాలీఢుఁడుక్రోధనుఁడునుగావలవదుశో । కృనురూపతఁ
జేయవలయునాతిథ్యంబుఁ ॥ శాంతి। ఆ ౫ । పు ౧౦౬.

౩౧౮. గీ ॥ జననిజనకుఁడుసద్గురుఁడననలుఁడాత్ముఁ । డనఁ
గనియేవ్వపురుసునేగృహస్థుచేత । సుగతివాంఛప్రసాదితులగు
దుకట్టి । వాఁడునూవెధరాత్ముంమవసుధమీఁద ॥ ఆగ । ఆ ౫ ।
పు ౯౬.

౩౧౯. ఉ ॥ నీతిపదంబునఁబ్రదుకనేర్చుటయుత్తమభంగి
శౌర్యసం।జాతములైకరంబమరుసంపదలొందుటమధ్యవృత్తియ ।

స్ఫీతములైనభూరవహాజీవనముల్దలపంగనిష్టముల్। నీతికిబాహ్యులైనధరణీవరమెత్తురె‌వారినుత్తముల్ ॥ ఉద్యో। ఆ ౨।పు ౨౧.

3౨౦. క ॥ పరధనపరదారంబుల । హరింపమియుదేవపితృసమారాధనముం । గరుణయునతిథిసపర్యయు । గిరితనయాయెల్లవారికింగృత్యంబుల్ ॥ అను । ఆ ౫ । పు ౭౮.

3౨౧. చ ॥ తమతమకర్మముల్దెరువుదప్పకచేసినవారుదేవ। లోకమునసుఖంబుఁబొందుదురుక్రమ్మరివచ్చియుఁబూర్వజాతి । జన్మమునమహర్ధిఁబొందుదురుమానినియిమ్మెయిఁదప్పి యెట్టికృత్యములఁజరించిరజ్జనులకట్టికులంబులఁబుట్టువాటిలున్ ॥ అను । ఆ ౫ । పు ౭౮.

3౨౨. ఉ ॥ ఆపదఁదూలపోకసిరియందిమదింపకశౌర్యవృత్తిమైఁ । బాపులగెల్చియార్జవముబంధుజనాళికినార్యకోటికిం । జూపుచుదీనులంగరుణఁజూచితగంగలమాత్రఁబోచుచుం। గోపములేనివన్కిగలుగున్ దివిజాంశమునన్ జనించినన్ ॥ అను । ఆ ౫౨ పు ౭౮.

3౨3. క ॥ వినుముసుఖమునకుదుఃఖం । బునకుంగారణము దనదుపూర్వకృతంబై । చనుకర్మముకారణమిది । యనియన్యముగలుగనేరదండొక్కటియున్ ॥ ఆర । ఆ ౭ । పు ౧౫౮.

3౨౪. క ॥ తిలగోసువర్ణదానం । బులునుపవాసములుఁదీర్థములనేకములి । ష్టులఁజేయనివారుదరి । ద్రులునిరతంబగుదురాత్మదోషముపేర్మిన్ ॥ ఆర । ఆ 3 । పు 3౭.

౩౨౫. క ॥ సరిగానెన్ను దురాత్మ్యులు । దరిద్రుని౦బతిత్యునిం
గృతఘ్ను నిజడునిరా । దొరఁకొనుధర్మముఁగామముఁ । బరమ
గతియునర్థముననపౌకవముఖ్యా ॥ శాంతి । ఆ ౧ । పు ౪.

౩౨౬. క ॥ కలిమయచుట్టలఁజేర్చును । గలిమియవెలయ
నుఘటించుఁగలిమియశౌర్యో । జ్జ్వలుఁడనిపించునుగలిమియ
పలువురుసద్బుద్ధియనఁగఁబరఁగఁగఁజేయుఁరా ॥ శాంతి॥ ఆ ౧॥ పు ౪.

౩౨౭. క ॥ ఏవానిబంధుమిత్రులు । జీవధనంబులనుమనుప్ర
జెందునుగృశునిం । గావానినెన్నఁగాఁడగుఁ। గేవలతనుజీవ్య వ
యుతుఁడుకృశుఁడెనరేంద్రా ॥ శాంతి । ఆ ౧ । పు ౪.

౩౨౮. క ॥ మొలువంబెట్టనియట్టిది । నొలచునదియలుపు
నిదానములనానార్థం । బులుసిద్ధించుఁబ్రయత్నం॥ బులువేగను
నింతేనిజముభూపవరేణ్యా । అను ॥ ఆ ౫ । పు ౯౪.

౩౨౯. సీ ॥ ఆయాసపడకుండనర్థంబుచేరెడునాఁడునాత్రెజ
నంబుదారపిలచి । తోలుమేనఁబెట్టినయలఘుదయాన్యులుసిద
ద్ధిబహుబలయత్నమునఁగలుగు । మనుజులుపూర్వజన్మమునసద్ధుల
దమ్మునడుగడాఁపకయిచ్చునట్టివార । లాయాసమునసుసిద్ధిగ
మంబెడలినజనులుముందటిపుట్టువునగృపావి॥ గీ ॥ పీనుస్లేనిం
చకులనలయించిపిదప । నిడనిలోభులుముదిసిధనేశుఁడగుదు।రుం
దుప్రాయంబునాడీకగండడంగి । తొంటిభవమునసరిగిఁవొజగిన
తఁడు ॥ అను । ఆ ౫ । పు ౭౯.

330. క ॥ అపితజ్ఞానము విజ్ఞా । నముఁగలిగియుఁ బేదయైన నరుఁడు చనినజ । న్మమున వినికి గలిగియుండా । నము తెరువునఁ బోనివాఁడు నలినదళాక్షీ ॥ అను । ఆ ౫ । పు ౭౯.

331. క ॥ తగుబుద్ధి లేక సంపద । మిగులఁ గలుగు నరుఁడు తోఁటిమేనఁ గరుణాత్మై । విగతప్రజ్ఞుండయ్యును । జగదీసులఁ బ్రోచిన తఁడు వళిబ్జముఖీ ॥ అను । ఆ ౫ । పు ౭౯.

332. గీ ॥ ధనముగలిగియుండి ధవళాక్షి కుడువక । కట్టుకుండు పరమతస్థజనము । లోరుపులొత్తి చెప్ప నుపకారులై తొలు । పుట్టువందును నిసయట్టివారు ॥ అను । ఆ ౫ । పు ౭౯.

333. గీ ॥ తమసుధనము లేక తగుభోగముల కెవ్వ । రైన నడుపమును సుఖాఢ్యజనులు । తొల్లి పేదవారలుల్ల మర్థుల కెడ్డఁ । బెట్టఁగోరుచుండునట్టివారు ॥ అను । ఆ ౫ । పు ౭౯.

334. గీ ॥ కలిగియుండియుఁ దెవ్వళోలకతనభోగ । ములు భుజింపఁగ లేని మర్త్యులు గిరీంద్ర । తనయ తొలుమేన రోగముల్దనికి వచ్చునపుడు దానము చేసినయట్టివారు ॥ అను । ఆ ౫ । పు ౭౯.

335. గీ ॥ ఆలుబిడ్డలొఱటులై లేమిఁ గుందుచు । దెవులు చేతఁబడుచునయు జనులు । మున్ను క్రోధలోభముల నాస్తిక [illegible] । పీడనంబు సేసి పేర్చినారు ॥ అను । ఆ ౫ । పు ౭౯.

336. చ ॥ నిజగుణదోషకర్మముల నెట్టన మేలును కీడు వచ్చుఁ గ । త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు లప్పునను లైమనో । రుజలును దేహజంబులగు రోగములుం గర్హితధర్మకర్మభే ।

షజములఁ జేసి బాపుదురు సర్వము సాత్వికదృష్టిఁ జూచుచున్ ॥ ఆర। ఆ ౫। పు ౯౭.

౩౩౭. క ॥ వినుపూర్వకర్మఫలములు। దనకువశము గాక పొం
దుఁదఱితో వానిన్। గనుఁగొన నేరక మూఢుఁడు। దనకాపదయై
నచోట దైవము దూఱున్ ॥ ఆర। ఆ ౫। పు ౯౩.

౩౩౮. క ॥ ద్రుమములు దళకుసుమఫలో। ద్గమములఁ గ్రియఁ
గర్మములు నొదవుఁ దత్ఫలముల్। తమతమతఱిఁ గర్తకు భో। గ్యము
లైనియతిని శుభాశుభాకారములన్ ॥ అను। ఆ ౧। పు ౭.

౩౩౯. క ॥ సమయంబైన నుగుసుమఫ। లము లెట్టులు ద్రో
చుఁదరువులందఱితోఁగ। ర్మమునంబొందము నుసుఖదుః। ఖము
లట్టుల నిష్క్రియత్న కలితోద్భూతిన్ ॥ శాంతి। ఆ ౪। పు ౭౨.

౩౪౦. గీ ॥ ఎఱిఁగి యెఱిఁగి నన్నడుగంగ నేలదీని। సుఖము
దుఃఖంబుఁ బ్రాప్తించుచోట నెఱుఁడు। దగిలి తనకర్మవశమునఁ దన
కుఁదాన। కర్తగాక న్యులకు నేమి కారణంబు ॥ ఆది। ఆ ౪। పు ౫౪.

౩౪౧. క ॥ ఎట్టి విశిష్టకులంబునఁ। బుట్టియు సదసద్వివేకము
లుగల్గియును। నట్టినకర్మఫలంబులు। నెట్టన భోగింపకుండ నేర్తు
రె మనుజుల్ ॥ ఆది। ఆ ౫। పు ౫౮.

౩౪౨. సీ ॥ దుఃఖంబుఁ బొమ్మని త్రోచి సుఖంబు రమ్మని తెచ్చి
కొనవశమయ్యె వానిఁ। దొలుబామునందలి దుష్కృతంబును సు
కృతంబు హేతువులుగఁ దగిలి చేయుఁ। బురుషుని కాలంబు తరము
లుగాపవిషారిఁ బొరి వచ్చుచుఁ బోవుచుండు। నర్థముల్ దుర్బుద్ధి

హైనను సిద్ధించునగు కాలములనార్యులయ్యుఁగాని ॥ గీ ॥ కాలము నఘటింపఁగా నేరరనిలవ । ఖ్యాత పేందురుచులునధిపకాల । కల్పితములు మంత్రశిల్పౌషధమ్ములు । మేలుసేఁతకాలలీలఁదలఁప ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౩౭౩. సీ ॥ తారుగొందఱకు బాధకులయిఁనడచుటపరుల చే బాధలఁబడుటగలుగు । నివికాలభావంబు లెఱుఁగ గల్గిననొరుఁ బఱిచితి మొరులచేఁ బడితిమనుచుఁ । బురుషుండు ప్రియశోకములఁ బొందఁడర్థదారాపత్యబాంధవహానికాత్మఁ । గుందంగనడలుట మందబుద్ధిత్వంబు వగఁగీడుమాను నే వలవదడల ॥ గీ ॥ శోకభయ కారణంబులు లోకమునన । నేకములు వానిఁదలఁపు శోకమునకు । భయమునకు బుద్ధియెడయీఁడుపండితుండు । మూఢుఁడ వి త్రోవ నేరఁడు మునుఁగువగల ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౩౭౭. క ॥ వినుమలుకయుఁగార్శ్యము లే । దనవద్యాయజ్ఞనంబులందునువిధికి । స్మనుసేసినకర్మఫలం । బనుభవగోచరము సేయునంతియతఁడితో౯ ॥ అను । ఆ ౫ । పు ౭౯.

౩౭౫. గీ ॥ నాతివిను గ్రహచారంబు హేతువులుగ । నశుభములు శుభములు నరుఁడాచరించు । గ్రహము చేయించు నేతాన కాకచేఁత । కొడయఁడటుగాన ఫలములుగుడువవలయు ॥ అను । ఆ ౫ । పు ౮౦.

౩౭౬. క ॥ వినుముపురాతనజన్మం । బునఁ జేసినయట్టికర్మములఫలములు ప్రా । జ్ఞుని నైనబొందువానికి । మనుజేశ్వరమంజ్జ్యైర్యమహిమయచుమ్మీ ॥ శాంతి । ఆ ౪ । పు ౬౯.

౩౪౭. క॥ తనకొలఁదినుపాయంబులు । వొనరిచి ధనవంతుఁడగుట భూపగుణము ని । ర్ధనుని నిజప్రజయును గై । కొనదు విరోధులును సరకుగొనరు కుమారా॥ శాంతి । ఆ ౩ । పు ౫౫.

౩౪౮. క॥ వినుధర్మంబున ధనమగు । ధనమున సిద్ధించుఁగా నుతంత్రంబటుగా । పునమధ్యమంబున ధమము । ధనకామములుత్తమంబు ధర్మంబధిపా॥ శాంతి । ఆ ౩ । పు ౬౬.

౩౪౯. ఉ॥ కావున ధర్మసిద్ధికి ముఖంబగు నర్థమునందు నిష్ఠమై। నేవిధినైన ధర్మరతి యెక్కుడుగా మదిఁ జొన్పుటొప్పఁగా। మావిలబుద్ధిగాక యుచితాగత సౌఖ్యములాచరించుచున్। భూవిభుఁడొప్పు భూమిసతిఁ బొందిరమింప మహోన్నతుండగున్॥ శాంతి। ఆ ౩ । పు ౫౩.

౩౫౦. గీ॥ ఓపి ధర్మార్థకామంబులొకటి నొకటి। నాశమొందింపకుండంగ నడుపవలయు । గాక ధర్మంబు సెడ నర్థకామములను। గోరు పురుషుండు నిందకుఁ గుదురుగాఁడె॥ శల్య। ఆ ౨ పు ౮౧.

౩౫౧. గీ॥ వినుమ సత్యలోభమున సిరియగునెయ్యాఁ। కొనినముసిఁడిది నినఁ గ్రొవ్వులావు । గలుగునయ్య శకునికర్ణదుశ్శాసన । మంత్రితంబు కార్యతంత్రమగునే॥ ఉద్యో। ఆ ౩। పు ౫౨.

౩౫౨. చ॥ అలఘుగుణంబులందధికుఁడైన మహాత్ముఁడు రాగకోపమా । యలఁబడి యక్షమావివశుఁడై యచిరాంశులతావిలాసచం । చలమగు లక్ష్మికాసపడి సత్యము ధర్మము తప్పి సత్సభా। వలి। దగువారియొద్దఁ దగువాఁడయి సజ్జనుఁడుండ నేర్చునే ॥ ఆర । ఆ ౧ । పు ౧౫.

౩౫౩. సీ ॥ ధర్మకామంబులుదలఁగంగనర్థార్థియగువాఁడుప
తితుఁడై యర్థసేవ । నర్థార్థముగఁజేయునతఁడుగ్రవనములోఁ గో
రతపసేయునక్కుమతిఁబోలు । నర్థధర్మములకుహానిగాఁగామా
ర్థియగునాతఁడల్పజలాశయమున । జలచరంబెట్టులజ్జలములతోఁ
జెడునట్లుకామంబుచేహానిబొందు ॥ గీ ॥ నర్థధర్మములుమహాబ్ధి
మేఘములట్లు । లుభయమునుబరస్పరోదయమ్ము । లట్లుగాఁద్రి
వర్గమెఱిఁగిసౌమ్యమునసే । వించువాఁడుసర్వవిత్తముండు ॥ ఆర ।
ఆ ౧ । పు ౧౪.

౩౫౪. క ॥ వరధర్మమునర్థంబును । సరసంబగువిషయసుఖ
ముసద్గతియుఁబాపు । పరిపాకమునసకలుగు । న్నరునకుఁదత్త్రివి
ధార్థనైపుణ్యుఁడైనన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౩౫౫. గీ ॥ అలఘుతపములతోలుమేనఁగలిగెనేని । వెదకి
కొనివచ్చునన్నరువిపులభోగ । ములుపురాకృతవృద్ధసేవలఫ
లించు । బుద్ధికలిమియువిద్యలఁబొలుచుటయును ॥ అను ।
ఆ ౮ । పు ౯౫.

---

# ౭ - తల్లిదండ్రులు పుత్రులు.

---

౩౫౬. ఉ ॥ కొండఱుబ్రహ్మచర్యమునుగొండఱుభవ్యగృ
హస్థధర్మముం । బొండుటకొండఱిద్ధతపమున్వనవాసమునందగంజ
రించుటం । గొండఱుసత్క్రియత్వమునఁగొండఱుయజ్ఞవిధానశీ

లతం।గొందఱనూనదానములఁగోరియొనర్తురునిత్యసౌఖ్యముల్ ॥
శాంతి । ఆ ౬ । పు ౧౩౯.

౩౫౭. క ॥ జనకుఁడుతపమునుధర్మం । బునువిద్యయుఁబర
మదైవమునుగావుననా । తనికిఁబ్రియంబగుపనిచే । సినదేవత
లెల్లఁబ్రీతిఁజెందుటగల్గుల్ ॥ శాంతి । ఆ ౪ । పు ౯౭.

౩౫౮. చ ॥ కరచరణాదిసంఘటితకాయముసంజననంబున
హ్నిపు । ట్టరణినిఁబోలెఁదల్లిదెస్సనైనదిగాదొకోయట్లుగాకదు ।
ర్భరమగుగర్భఖేదమునుబట్టికినైనిజదేహచింతపై । భరమొక
యింతలేకపడుపాటులునక్కటయెక్కుడెంతయున్ ॥ శాంతి ।
ఆ ౪ । పు ౯౯.

౩౫౯. గీ॥ వచ్చిపోయిచూచువాఁడుఁగాకిపుమలఁ।బడునె
తల్లిన్రొలెఁబట్టితోడఁ । దండ్రిసెప్పునిట్లుధర్మశాస్త్రంబులు। నంబ
గౌరవమునధికయగుట ॥ శాంతి । ఆ ౫ । పు ౯౯.

౩౬౦. క ॥ కలవాఁడులేనివాఁడున । బలుఁడబలుఁడుమూ
ఢబుద్ధిప్రౌఢుండనఁగా । వలదెవ్వరికైనజననికలిమియయత్యం।
తసౌఖ్యకరమైయుండుర్ ॥ శాంతి । ఆ ౪ । పు ౯౯.

౩౬౧. క ॥ అప్పుడయసమర్థుండగునప్పుడదుఃఖియగుసూ
న్యమైతోఁచుజగం । బప్పుడమాతృవియోగం । బెప్పుడుపాటి
ల్లునపుడయెంతయుఁదూలుర్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౯.

౩౬౨. గీ ॥ బాలుఁడైనఁగొంచుకుప్రౌఢుఁడైననువృద్ధుఁ। డై
ననొక్కవిధమయర్శిలియున్ను । నరయుభారముతల్లికాపదార్థంబు
జ । గంబుకలిమికెల్లఁగారణంబు ॥ శాంతి । ఆ ౫ । పు ౯౯.

౩౬౩. క ॥ జననీజనకగురులయెడ। నొనరించినమేలుగీడు
సొదవించుసుఖం । బునకునుదుఃఖమునకునిం । తనికొలఁదియిడ
న్వారెంజెయజునకునైనన్ ॥ అను । ఆ ౪ । పు ౬౬.

౩౬౪. సీ ॥ వినుతల్లియునుదండ్రియునుగురుండును సేవనీ
యులుసద్భక్తినిత్యనిరతి । వారలఁగొలుచుచువారెద్దిచెప్పిననది
యాచరించుటయధికధర్మ । మాగమత్రయమునునగ్నిత్రయం
బులోకత్రయంబునుదేవతాత్రయంబు । ననువస్తువులువానియం
దునుజననిగౌరవమునవెక్కుడురాజముఖ్య ॥ గీ ॥ యీజగంబు
నదివమునఁబూజవడయు। మాతృభక్తుఁడుపితృభక్తిమానసుండు
నట్లయవ్యయానందసంప్రాపణంబు । గురుపదాబ్జసమారాధకుం
డుగాంచు ॥ శాంతి । ఆ ౩ । పు ౪౮.

౩౬౫. సీ ॥ జతనంబుమిగులమాసములుదొమ్మిదియుదరం
బునఁగరముభరంబుతోడ । భరియించిపడపడిప్రాణసంశయద
శనొందిపుత్రునిఁగాంచునొనరఁదల్లి। తపములుయజ్ఞములుదానము
లవ్రతములుదేవతాసజ్జనసేవనములు । గావించుఁబుత్రునిఁగా
మించిజనకుఁడిట్లిరువురపాటునుసరియెతలఁప ॥ గీ ॥ దనయుఁగ
నితల్లిదండ్రులుదమకునతఁడు। భక్తుఁడగుటకుధర్మార్థసక్తుఁడగుట।
కాసపడుదురువినుమట్టిమానసిద్ధి। బొందఁజేయునాతఁడనూనం
నందనుండు ॥ ఆ ౪ । ఆశ్వ ౫। పు ౯౦.

౩౬౬. క ॥ జననియుజనకుఁడు నెవ్వని । యనువర్తనమునఁ
బ్రియంబునందుదు రెవఁడ । త్తనయుఁడు ధర్మముగీర్తియు । నసూ
నముగఁబడయఁజాలునక్షయగతులన్ ॥ అర । ఆ ౫ । పు ౯౦.

౩౬౭. క ॥ పితృసంకల్పము సేయఁగ । సుతులకవశ్యంబు వ
లయు సుతజన్మఫలం । బతిముదమునఁ బితృవరులకు । హితమొ
నరింపంగఁగాదె యెంతయుభక్తిన్ ॥ సభా । ఆ ౧ । పు ౬.

౩౬౮. క ॥ వినుగార్హపత్యమునన । య్యనలము విహరింప
బడిత దాహవనీయం । బన వెలుఁగునట్ల వెలుఁగును । జనకుఁడు దాఁ
బుత్రుఁడై నిజద్యుతితోడన్ ॥ ఆది । ఆ ౪ । పు ౪౫.

౩౬౯. క ॥ తానతననీడ నీళ్లలో । నేర్పడఁ జూచునట్లులో
కస్తుతత । త్పూనుజనకుండు చూచిమ । హానందముఁబొందునతి
శయప్రీతిమెయిన్ ॥ ఆది । ఆ ౪ । పు ౪౫.

౩౭౦. క ॥ తనయుండు తల్లిదండ్రులు । పనిచినపని సేయఁడే
నిపలుకెదలోఁజే । కొనఁడేని వాఁడు తనయుం । డనఁబడునే పిత్రు
ధనమునకర్హుండగునే ॥ ఆది । ఆ ౩ । పు ౩౮.

౩౭౧. క ॥ విను బేలయొట్టికష్టుఁడుఁ । దనపురుషగుణంబు సె
డఁగఁ దల్లినిదోఁబు । ట్టినవారి విడిచి రాగం । బునఁ జపలస్త్రీసు
ఖంబువొందునె చెపుమా ॥ ఆది । ఆ ౬ । పు ౮౧.

# ౯ - సహోదరులు

3౭౨. క ॥ వినుభక్తియు వెరపుగలిగి। యనుజన్ములు పెద్దవానినారాధింపన్ । జనవరయతండు దమ్ములఁ । గొనియాడన్ సిరికిఁబట్టగుదురుజ్జ్వలులై ॥ అను । ఆ ౪ । పు ౬౧.

3౭3. చ ॥ కరితురగాదిఘట్టనయుగాలియునొంపదెయొంటినున్న య। త్తరువున నేకభూరుహవితానముగుంపయియున్న బాధలం । బొరఁయు నెయన్న దమ్ములును బొందిన నేరిక సాధ్యులట్లుగా । కెరవయినిల్చి నం గెలని కెల్లిద మైపరిన్రాదు రెంతయున్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౨.

3౭౪. గీ ॥ బలముగలవానిఁబలువురుబలవిహీను । లొక్కటైకూడినిర్జింతురుత్సహించి । మధువుఁగొననుత్సహించినమనుజుఁబట్టి । కుట్టినిర్జించుమధుకరకులమునట్లు ॥ అర।ఆ ౧।పు ౧౫.

3౭౫. క ॥ మానవనాయకయగ్రజుఁ। డైననునుజన్ముఁడైన నన్యాయంబుం । బూనిసహోదరులకుఁగీ।డైననతఁడుదండ్యుఁ డంద్రుమనవనీపతికిన్ ॥ అను । ఆ ౪ । పు ౬౨.

3౭౬. గీ ॥ అన్న పతితుఁడైననటుగాకసన్యాసి । యయ్యెనేనిఁదమ్ముఁడాతఁడుండ । దారసంగ్రహంబుదాఁజేసిపాపంబుఁ । బొరయఁడంద్రుబుధులుకురువరేణ్య ॥ శాంతి । ఆ ౧ పు ౧౭.



# ౧౦ - జ్ఞాతులు.

౩౭౭. క ॥ జ్ఞాతులపోరితమునుగో । త్రాతమునాక్రమము విప్రవర్గముచనువుఙ్ । నాతులగారింపమియును । బ్రీతింజనని చ్చునతనిపెంపొప్పున్నృపా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౨.

౩౭౮. క ॥ జ్ఞాతులుతమలోఁబొందినఁ । జేతోమోదము నఁజెలఁగిచెలువొందుదుర । న్నీతింబాసినవిగతవి। భూతింగడుఁ గొఱవులట్లపొగయుదురధిపా ॥ ఉద్యో । ఆ ౨। పు ౩౨.

౩౭౯. వ ॥ కావునఁదమలోవిరోధంబొప్పదు । సంభాషణ భోజనాదిసత్కారంబులను । సవినయవర్తనంబులను । బ్రీతులై నజ్ఞాతులిహ పరార్థసాధకులగుదురని । చెప్పివెండియు ॥ ఉద్యో । ఆ ౨ । పు ౩౨.

౩౮౦. క ॥ అలమికొనియొండొరులప్రో । పులఁబ్రాపుల నెలమికలిమిఁబొందిబహుజ్ఞా । తులునెమ్మిఁగూడఁదామర। కొలనిక్రియఙ్ సిరికిఁబట్టగుదురుజ్జ్వలులై ॥ ఉద్యో।ఆ ౨।పు ౨౨.

౩౮౧. గీ ॥ కొంచెమైననుదగఁబంచికుడువమేలు । పనుల యెడదుఃఖమోర్చియల్పంబుసుఖము । ననుభవించుటహితము శత్రునకునైన । నిచ్చుటయులెస్సయడగినయెడన్నృపాల॥ఉద్యో। ఆ ౨ । పు ౨౦.

౩౮౨. ఉ ॥ సారపుధర్మమున్విమలసత్యముఁబాపముచేత బొందఁగాఁ । ఘోరముఁబొందలేక చెడుపాటిదియైనయవస్థఁదత్తు త । ద్వారలుపేక్షచేసిరది వారలచేటగుఁగానిధర్మని । స్తారకమయ్యుసత్యశుభదాయకమయ్యును దైవముండెడున్ ॥ ఉద్యో ॥ ఆ ౩ । పు ౪౯.

# ౧౧ - భార్యాభర్తలు.

౩౮౩. క ॥ సంతతగృహమేధిఫలం । బంతయుఁబడయంగ నోపుననుగుణభార్యా । వంతుండగువాఁడుక్రియా । వంతుఁడు దాంతుండుపుత్రవంతుండునగున్ ॥ ఆది । ఆ ౪ । పు ౪౫.

౩౮౪. క ॥ సతియును గుణవతియుఁబ్రజా । వతియునను వ్రతయునైనవనితనవజ్ఞా । న్వితదృష్టిఁజూచునతఁడు । ర్గతికిహ ముంబరముఁగలదెమదిఁబరికింపన్ ॥ ఆది । ఆ ౪ । పు ౪౬.

౩౮౫. క ॥ వినుసౌభాగ్యసమేతుఁడు । మనునిజదారైకపరుఁడు ముందటిజన్మం । బునభార్యకుఁబ్రీతియొన । ర్చనిమనుజుఁడుసుఖగతావిరహితంబొందున్ ॥ అను । ఆ ౫ । పు ౭౯.

౩౮౬. సీ ॥ ఋతుమతిగాకముస్థితయుఁగల్గినయింటికన్యతత్ప రిణయకరణమునకు । నొడయలువినుతల్లియును దండ్రియును దం డ్రితోఁబుట్టినతఁడు మాతులుఁడు సోద । రుండును యోగ్యవరునిఁ జూచివారిలో నెవ్వరైనను బ్రీతినిచ్చువారు । పతియంతనుండి

యుఁబ్రభువుదానికినట్లుగాఁపుననాతండ్ర దైవమనుచు ॥ గీ॥ నతని మతమూఁదిదేవతాపిత్రుసమర్చ । నములునతిథిపూజనముస్మృతి సమాచ । రించుచునుబతిహితముపాటించినడపు । సతిపతివ్రత యుహపరసౌఖ్యమహిత ॥ అను । ఆ ౫ । పు ౮౭.

౩౮౭. క ॥ పాతివ్రత్యముగలిగిన । నాతియనఁగ దైవమనజ నస్తుతవేరే । యాతతధర్మార్థసుఖ । ఖ్యాతులుసద్భార్యవలనఁ గాదేకలుగుఁ ॥ అను । ఆ ౨। పు ౨౯.

౩౮౮. చ ॥ పతిగడవంగ దైవతముభామలకెందునులేదుప్రీ తుఁడై । పతికరుణించెనేనికలభాషణిభాసురభూషణాంబరా । న్వితధనధాన్యగౌరవమువిశ్రుతసంతతియుఁయశంబున । ద్గతి యునుగల్గునెందుమెయిఁగల్గునెయిన్ని తెఱంగులారయుఁ ॥ ఆర। ఆ ౫ । పు ౧౦౭.

౩౮౯. గీ ॥ కరముదుఃఖపడినఁగానియొక్కింతసౌ । ఖ్యం బుధర్మగతియుఁగలుగదెందుఁ । జూడనబలభర్తృశుశ్రూషఫల ముసం । తతసుఖంబుగలదుధర్మువాదవు ॥ ఆర।ఆ ౫।పు ౧౦౭.

౩౯౦. క ॥ ధనియధనుఁడురూపసిరోయి । వ్వనివాఁడవిపేక్ష మూఢభావుఁడురోగుం । డనుగతరోగుఁడనకయుం । గనపతిఁ బాటింపవలయుఁగామధ్వంసీ ॥ అను । ఆ ౫ । పు ౮౮.

౩౯౧. చ ॥ పతికినసుంగులైనతగుబంధులమిత్రులభోజనా దిస । త్కృతములనాదరించుచునకృత్రిమభక్తివిశేషసంతతో ।

ద్ధితమతివైచరింపుముతదీయహితేతరవృత్తులైనవా । రతివభవ
త్పుహ్పృజ్జనములైననుగైకొనకుండుమేర్పడక్ ॥ ఆర । ఆ ౫ ।
పు ౧౦౭.

౩౯౨. గీ ॥ పనులయెడమూరువలుకకయనవధానుఁ । డైన
పతిఁదలఁపించిధర్మార్థకలిత । కృతులునడపుచుసవతిగల్గినసుబో
రి । తంబులేకొక్కతైయున్కితగవుసతికి॥ అను।ఆ ౫। పు ౮౭.

౩౯౩. క॥ కావుననిత్యముసమ్య । గ్భావముప్రేమంబువె
అపుభక్తియుఁబ్రియముం । గావింపుముప్రియునెడనీ। భావమె
ఱిఁగియతఁడుదానపైఁబడిమరుగుక్ ॥ ఆర । ఆ ౫ । పు ౧౦౭.

౩౯౪. గీ ॥ భర్తచేతనియోగింపఁబడకసతికి । నేదియును
జేయఁగాఁదగదెద్దియైన । భర్తచేతనియోగింపఁబడినదానిఁ
జేయకునికిదోషంబనిచెప్పెమనువు ॥ ఆది । ఆ ౫। పు ౬౦.

౩౯౫. క ॥ పురుషులచేధర్మస్థితి। బరిగ్రహింపంగఁబడినభా
ర్యలకునిరం । తరమునిజపురుషభక్తియుఁ । బరపురుషవిసర్జనం
బుఁబరిచితమయ్యెక్ ॥ ఆది । ఆ ౫ । పు ౬౦.

౩౯౬. గీ ॥ ఎట్టిసాధ్వులకునుబుట్టినయుండ్లను । బెద్దకా
లమునికితద్దతగదు । పతులకడనఁయునికిసతులకుధర్మువు । సతుల
కేడుగడయుఁబతులచూవె ॥ ఆది । ఆ ౪ । పు ౪౪.

౩౯౭. గీ ॥ పురుషుకంటెమున్నుపరలోకమేగిన । సతియ
నోఁచినదియుసతులలోనఁ । బురుషహీనయయునఁబరమపతివ్ర
త । యయ్యుజగముచేతఁబ్రయ్యుఁబడదె ॥ ఆది। ఆ ౬। పు ౮౪.

౩౯౮. గీ ॥ బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు వా
ర్ధకంబునఁ దనయుఁడు వామనయన । నరసి నడుపఁగా నెందును
నంగనలకు । వలసినట్టులు చేయఁగా వచ్చునెట్లు ॥ అను । ఆ ౨ ।
పు ౨౦.

౩౯౯. చ ॥ అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁ జేసి
యెంతయున్ । వలతురు నాథులం టమగువాకడు బేలతనంబు దా
నమున్ । గలిగిన ప్రేమయున్ బోలియుఁగాని యొకంటను సిద్ధిఁ
బొందదు । ప్పొలఁతులతోడి యున్కి యహిపొత్తుగఁ జూచు విభుం
డెఱింగినన్ ॥ ఆర । ఆ ౫ । పు ౧౦౬.

౪౦౦. చ ॥ మగువ యొనర్చు వశ్యవిధి మందులు మాయలు
నెందు చందమై । మగనికిఁ దెచ్చు రోగములు మానకమూకజడా
దిభావముల్ । మొగి నెనరించు దురితముల్లన చేసిన చేతలైతు
దిన్ । జగమున నెక్కి నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్ ॥
ఆర । ఆ ౫ । పు ౧౦౬.

౪౦౧. క ॥ కావునఁ బతులకు నెప్పుడుఁ । గావింపఁగఁదగ
దు కపటకర్మంబులు ద । ద్భావమెఱిఁగి వశవర్తిని । యై వనిత చరిం
చనది యయగు నెల్లవియున్ ॥ ఆర । ఆ ౫ । పు ౧౦౬.

౪౦౨. క ॥ గతిపతియచు వ్వైభార్యకు । నతని గడచినట్టి స
త్పరాయణము కృపా । యుతకలదే కావునఁదా । నతనికి భక్తియ
గుటచ్చు నఖిలశుభంబుల్ ॥ అను । ఆ ౫ । పు ౭౭.

౪౦౩. గీ ॥ పురుషునందుదోషపుంజంబుగలిగిన । నెఱిఁగి యదిసహించునేనిభార్య । పురుషునందభీష్టభోగంబుదేహాంత । రంబునందుధర్మరతియుఁబడయు ॥ ఆర । ఆ ౨ । పు ౩౩.

౪౦౪. గీ ॥ అనపహార్యంబుతేజోమయంబుసర్వ । గుణము లకునలంకారంబుగురుతరంబు । భామలకుఁబతిభక్తియపరమమైన । భూషణంబిట్టినెపెఱభూషణములు ॥ ఆర। ఆ ౨। పు ౩౨.

## ౧౨ - కులధర్మము.

౪౦౫. క ॥ తనకులధర్మమువిడువక। మనుటపగమధర్మమం ద్రుపమాన్యులుచిత్తం । బునఁగృపగలుగుటముఖ్యపు । పని సైర ణవలయునఖిలభావములందుఁ ॥ అర । ఆ ౫ । పు ౯౨.

౪౦౬. క ॥ ఒప్పెడునదియైననుగడు । నొప్పనియదియైనని జకులోచితపథముఁ । దప్పఁదగదంద్రుధార్మికుల । లప్పనినిజభా గ్యవిహితమనియుండఁదగుఁ ॥ ఆర । ఆ ౫ । పు ౯౩.

౪౦౭. గీ ॥ ఒప్పకున్ననునాత్మకులోక్తకర్మ।మూర్ధ్వగతిఁజే ర్చుఁబరకర్మమొప్పనేని। నార్యజనములుకిల్బిషమంద్రుదానిఁ । గానసడుపుమునిజవంశకర్మమధిప ॥ శాంతి । ఆ ౧। పు ౧౬.

౪౦౮. క ॥ కులరూపగుణద్రవ్యం। బులువిక్రమవంతునందు భావిదితమ్ములై । నిలుచునవిక్రమునకునవి । గలిగియుఁలేనిక్రియ నప్రకాశంబులగుఁ ॥ సభా । ఆ ౧ । పు ౭.

౪౦౯. క ॥ ధనమునువిద్యయువంశం । బునుదుర్మదులకుమ
దంబుఁబొనరించునుస । జ్జనులైనవారికడఁకువ । యునువినయ
మునివియె తెచ్చునుర్వీనాథా ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

౪౧౦. క ॥ కులనాశముసేసినఁద । త్కులధర్మమడంగున
ష్టకులధర్ములకుం । గలుగునుదుస్సంకరమ । క్కులఘ్ను లేగుదు
రునరకకూపంబులకుఁ ॥ భీష్మ । ఆ ౧ । పు ౧౨.

౪౧౧. గీ ॥ ధాతనిన్ను నేమిధర్మంబునడుపుట । కైసృజిం
చెదానినాచరించి । యుండునీకునీవయొడయండవైధాతృనోది
తప్రవర్తనుఁడవుగాఁగ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౧.



## ౧౩ - ధర్మగుణము.

౪౧౨. గీ ॥ వేదవిహితంబులును శాస్త్రవిహితములును ।
శిష్టచరితంబులునుననఁజెప్పనొప్పి । ధర్మములుమూఁడువిధముల
దనరుచుండుఁ । గడగియివ్వి యుసద్గతికారణములు ॥ ఆర ।
ఆ ౫ । పు ౯౨.

౪౧౩. చ ॥ అరయఁగధర్మతంత్రములయందునిరర్థములేదొ
కండు । నెవ్వరిమదియందుఁబ్రాలెఁడగవారలుదానినప్పూనియా
చరిం । తురదియవారికిష్టఫలదోహనకార్యమొనర్చునెల్లెడం ।
బురుషులఁజూడమేతమకుబోలినధర్మములన్నెలుంగఁగఁ ॥ శాంతి ।
ఆ ౬ । పు ౧౩౯.

౪౧౪. క॥ ధీరమతియుక్తిఁ జేసివి। చారింపఁగనిక్కువంబు సర్వజనస్య। స్వర్గారోహణసోపానం। బారఁగధర్మంబుచూవెయం బుజనేత్రా ॥ ఆర। ఆ ౧। పు ౧౪.

౪౧౫. క॥ ఉత్తమపథంబుధర్మ। యుత్తముధర్మంబుమృతు లకధిపసహాయం। బెత్తైఁగునధర్మక్రియ। చిత్తంబునఁ జేర్ప్వవల యుజీవించుతఱిన్ ॥ అను। ఆ ౪। పు ౬౬.

౪౧౬. క॥ అంతంతకుసత్కర్మము। లెంతయుఁ బెనుపొం దజీవుఁ డెక్కుడుచాయం। జింతాకలుషముపాయఁగ। సంతోషామృతమునానిసంశుద్ధుఁడగున్ ॥ శాంతి। ఆ ౫। పు ౧౦౫.

౪౧౭. గీ॥ ఉత్సవంబుమీఁదనుత్సవమందుచు। సుఖము మీఁదసుఖముచొప్పడంగ। బుణ్యపదముమీఁదఁబుణ్యపదం బున। కరుగునరుఁడుసుకృతియైననధిప ॥ శాంతి।ఆ ౪।పు ౭౨.

౪౧౮. గీ॥ మేలురెండులోకంబులమేలుతెచ్చు। గీడుచే సినఁదప్పదుకీడెయగును। గానఁబుణ్యవర్తనమునకానుకూల్య। శీలమవ్వదైవమదిఫలసిద్ధిఁ జేయు ॥ అను। ఆ ౧। పు ౬.

౪౧౯. క॥ ఈలోకమయ్యగుగొందఱ। కాలోకముగొంద ఱకునిహంబునుబరమున్। మేలగుఁగొందఱకధిపా। యేలోకము లేదువినవెయిలగొందఱకున్ ॥ ఆర। ఆ ౪। పు ౭౬.

౪౨౦. చ॥ ధనములుసాలగల్గిసతతంబునునింద్రియవాంఛ సల్పుచున్। మనమునవెన్నడున్సుకృతమార్గముపొంతనుబో

కలోభమో । హానిరతబుద్ధులైతిరుగునట్టిజనుల్వరలోకసౌఖ్య
ముల్ । గనుటకు నేరరిప్పటిసుఖంబులువేలయితోఁచువారికిన్ ॥
ఆర । ఆ ౪ । పు ౭౬.

౪౨౧. మ ॥ ఉపవాసవ్రతసంతతాధ్యయనతీర్థోపాసనా
దిక్రియై । కపరత్వంబునఁ జేసినైయెహికనుదుఃఖప్రాయమైపోవఁ
గా । విపులానందముఁబొందఁగల్గుఁదుదినావిఖ్యాతభోగైకలో
లుపబుద్ధింజిరపుణ్యశీలురకునాలోకంబునన్ భూవరా ॥ ఆర ।
ఆ ౪ । పు ౭౬.

౪౨౨. ఉ ॥ ధర్మమపల్కుచుందగిలిధర్మపథంబునఁ జేసియ
ర్థముల్ । ధర్మియుఁగాంచిధర్మవిధిఁ బెండిలియై ప్రజలన్ సృజిం
చిస । త్కర్మములంబ్రశస్తములుగాఁగ్రతువుల్ వొనరించుసజ్జను
ల్। ధర్మజయుందునందునుముదంబునఁగాంతురభీష్టసౌఖ్యముల్ ॥
ఆర । ఆ ౪ । పు ౭౬.

౪౨౩. గీ ॥ సత్యమునుశమంబుశౌచంబులేకనా। స్తిక్యము
నునిషిద్ధసేవనంబు । గలిగితిరుగుదుష్టకష్టజనశ్రేణి । పోలియు
నుభయలోకములకుఁగాక ॥ ఆర । ఆ ౪ । పు ౭౭.

౪౨౪. గీ ॥ వనితలీపాపములుచేసివానివాని । పత్నులై
జనియింతురుపాపభీతిఁ । దెరువుదప్పకనడిచిననరులుసౌఖ్య ।
మందుదురురెండులోకంబులందునానఘ ॥ అను । ఆ ౪।పు ౬౭.

౪౨౫. క ॥ వినుమాంసశోణితవివ । ర్ధనమగునైహికము
నందుఁదత్పరులుపరం । బనియొకటికలిమిదలఁపరు । గొనరుబు
ధులమాటనాస్తికులువినయనిధీ ॥ శాంతి । ఆ ౬।పు ౧౨౪.

౪౨౬. క ॥ ఐననుగాథనిరూపణ । మానసుఁడై యా
ర్యజనులమహితవచనముల్ । వినులసూనుచుధర్మము । లైనవి
సేయంగఁదప్పకగుఁదత్ఫలముల్ ॥ శాంతి । ఆ ౪। పు ౭౨.

౪౨౭. గీ॥ పుణ్యపాపానుగుణభంగిఁబుట్టిసౌఖ్య। దుఃఖమ
యసంసరణమునఁదోడరినరుఁడు । వినుముకేవలధర్మవర్తనసు
ఖైక । భాజనముసెందుధర్మైకపరతమేలు ॥ అను।ఆ ౪।పు ౬౬.

౪౨౮. క ॥ అమరఁగదాక్షిణ్యముధ । ర్మమునకుఁగుదురం
బుఁగీర్తిమహిమనెలవుదా । నముసత్యముసురపురిమా।ర్గము
శీలముసంశ్రయముసుఖంబులకెల్లన్ ॥ ఆర।ఆ ౭ । పు ౧౬౧.

౪౨౯. క ॥ ధర్మంబుఁబరిజ్ఞానము। నిర్మలమతినభ్యసించినన్నృ
పయనిశంబున్ । ధార్మికసంగతిగలిగినఁ। బేర్మియుభయలోకము
లనభిస్తుత్యమగున్ ॥ శాంతి । ఆ ౬। పు ౧౧౭.

౪౩౦. గీ ॥ అంతకుండుజనులకానస్సుఁడై యుండ । నిమిష
మాత్రమేనినిశ్చయింపఁ । దగనిజీవనంబుదద్దనుస్థిరముగాఁ। జేసి
కార్యమెడయుఁజేయదగునె ॥ ఆర । ఆ ౧ । పు ౧౫.

౪౩౧. గీ ॥ జరయు-మరణంబుమర్త్యునిజన్మమాది । గాఁగ
వెనువెంటఁదగలునంగఁబువేచి । యెల్లిచేసెదననకమేలిపుడుసే
యు । ననఘయోర్చునెమృత్యువుజనులపనులు ॥ శాంతి ।
ఆ ౬ । పు ౧౨౪.

౪౩౨. గీ ॥ మానువలతన్నుఁబొందుపుటగానకిష్ట । వృత్తి
విహరించుచుండెడువిధమకాదె। యెల్లిచేసెదనకమేలిపుడచేయు।

మనఘుయోర్పు నెమ్మృత్యుపుమనుజుపనులు ॥ శాంతి । ఆ ౫ పు ౧౦౩.

౪౩౩. క ॥ ఆపదయయినను ధర్మువ । ప్రాపుగరక్షింపవల యుంబరమార్గముధ। ర్మోపాయముధార్మికులకు । నాపదజన్మాం తరముననను గతమగుటన్ ॥ ఆది । ఆ ౬ । పు ౮౨.

౪౩౪. గీ ॥ పడయరానియాయువొడలికిఁగలిగినఁ । బాప కృతులదానిఁబతటఁగలుప । నగు నెపుణ్యవిధిసమాచరణముల నై । సేయవలయుగాక చెలువుమిగుల॥ శాంతి।ఆ ౫।పు ౧౦౮.

౪౩౫. క ॥ అనఘామర్త్యులజీవన । మనిత్యమనియెఱిఁగి సుఖమునప్పుడుదుఃఖం । బునపుడుధర్మంబేమర । కునికియె జ్ఞాతికైననురుపూహింపన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౮.

౪౩౬. క ॥ జాతుఁడుమృతుఁడగుటధ్రువము। భూతోల్లా సములనిత్యములువినుసద్యః । పాతియగుశరీరంబున । నైతొరఁ గు నెధర్మపథమునార్యుండధిపా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౪౩౭. క ॥ భూతములింద్రియగుణసం । ఘాతమునత్వా దిగుణనికాయముగాయం । బైతోఁచుచెఱిఁగిననుధ । ర్మేతర కృత్యములుసేఁయనేనరుఁడనఘా ॥ శాంతి।ఆ ౫।పు ౧౦౯.

౪౩౮. క ॥ జననజరామరణగ్రా । హానివిడకాలాబ్ధిమగ్న మనిజగము నెఱిం । గినవాఁడుధర్మవర్తన । మునసుండుసుజింత దక్షభూపవరేణ్యా ॥ శాంతి । ఆ ౧ । పు ౧౩.

౪౩౯. క ॥ ఎఱుకఁగలవారిచరితలు । గఱచుచుసజ్జనులగ్రో
ష్ఠిఁగదలకధర్మం । బెఱుఁగుచునెటేఁగినదానిని । మఱువకనుష్ఠిం
చునదిసమంజసబుద్ధిన్ ॥ ఆది । ఆ ౩ । పు ౩౯.

౪౪౦. చ ॥ తనతనధర్మమున్నడపిదానననంతసమంచితాం
తభా । వనిగతినుండువారిఁగనివారలుచెప్పెడుధర్మవృత్తిని। చ్చె
నయుగనూఁదిసత్పథముఁజెందుటకెక్కుడుముపొత్తినూలివు । ర్వ్యా
నకైనగాకుబంధకుఁడవుందనకజ్ఞుడుదానయమ్మెయిన్ ॥ శాంతి ।
ఆ ౬ । పు ౧౨౪.

౪౪౧. గీ ॥ పాపకర్మంబులెల్లనుబాయఁబెట్టి । పుణ్యకృత్యం
బులందునుబురుషుఁడొపి । నట్లుశుద్ధమనస్కుఁడైయాచరించు।
వాఁడుసజ్జనసంగతివలయునెపుడు ॥ శాంతి। ఆ ౫। పు ౧౦౭.

౪౪౨. గీ ॥ పాపమించుకదోడరెడుపనులనెట్టి । ఫలము
గలిగినవలదల్పఫలవిభాయి । యైనపుణ్యామిశ్రితకార్యమాచరిం
చు । నదిశివంబగుదాననిహామ్ముఁబరము॥ శాంతి।ఆ ౫।పు ౧౦౮.

౪౪౩. క ॥ ధార్మికులుసలుపునుత్తమ । కర్మముఁజెడనాడు
నాస్తికజనమువినుమా । దుర్మతులతెఱఁగుగనుఁగొని । ధర్మము
నెడఁబ్రీతివదలఁదగదుబుధునకున్ ॥ అర । ఆ ౫। పు ౯౨.

౪౪౪. క ॥ పులుగులలోఁబూత్యండక । ములుసారముల్తై
నధాన్యములలోనసుబో । ల్లులుఁబోలెనుజూవెమనుష్యులలో
ధర్మరహితాత్ములుర్వీనాథా ॥ శాంతి। ఆ ౪ । పు ౭౨.

౪౪౫. క ॥ పాపంబులుకర్జములని । యేపునఁజేయంగనవి
యనుమింపఁగుధర్మ । వ్యాపారంబులుగార్యము । లైపరిణతిఁబొం
దెనేసినట్లులచెల్లున్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౪౪౬. సీ ॥ సత్యహితాలాపచతురతయర్థంబుసంతతసుజ
నపూజనమువలయు । వినుక్రోధసంరంభవిద్వేషములుఁజేసిమ
తిగలంగినసుధర్మంబుదప్ప । కుండంగనడచుటత్యుత్తమసగతియప్రి
యములయందునుప్రియములందు । దైన్యహర్షంబులఁబగులక
యున్నట్టికళ్యాణవర్తనకాంక్షలెస్స ॥ గీ ॥ యెగ్గుసేసినవారికి
హితముసేత । యార్యజనములుగీర్తింతురన్యదోష । కారిదనపా
పమునఁదానకాలిపోవు । వేఱవానికిఁగీడుగావింపనేల ॥ ఆర ।
ఆ ౫ । పు ౯౨.

౪౪౭. క ॥ శరణంబనివచ్చినభీ । కరశత్రునినైనఁబ్రీతిఁగా
వఁగవలయున్ । గరుణావరులతెఱంగిది । యిరవుగసరిగానుదీని
కేధర్మంబుల్ ॥ ఆర । ఆ ౫ । పు ౧౧౩.

౪౪౮. గీ ॥ కావరయ్యయనినఁగరముదుర్బలుఁడైన । జెనసి
చూపినంతచేయుననిన । నూరకుండునయ్యయుత్తమపూరుషుఁడు ।
దీనజనులయున్నతెఱఁగుచూచి ॥ ఆర । ఆ ౫ । పు ౧౧౩.

౪౪౯. క ॥ కృతమెఱుఁగుటపుణ్యముస । న్మతిఁదానికిసమము
చేతమధ్యముమఱితత । త్కృతమునకగ్గలముగస । త్కృతిసే
యుటయుత్తమంబుకృతబుద్ధులకున్ ॥ ఆది । ఆ ౬ । పు ౮౩.

౪౫౦. క ॥ మనమునవైరముదలఁపమి। యనుసద్ధర్మాత్ముఁ డగుటయునుగుణములుచే। కొనిదోషంబులువిడుచుట। యును నుత్తముఁడైనపురుషునుత్తమగుణముల్ ॥ సభా। ఆ ౨। పు ౩౧.

౪౫౧. క ॥ ఒరులేమేనియొనర్చిన। నరవరయప్రియముదనమనంబునకగుఁడా। నొరులకునవిసేయకునికి। పరాయణము పరమధర్మపదములకెల్లన్ ॥ శాంతి। ఆ ౫। పు ౯౭.

౪౫౨. క ॥ వోరఁగొనిపుణ్యముఁబాపము। నరుఁడర్థింజేయుచుండనడుమనొకంటు। న్వేరవెడలితప్పిననుద। త్పరిణతిఫలమొందునంద్రుధర్మవిధిజ్ఞుల్ ॥ ఉద్యో। ఆ ౩। పు ౪౭.

౪౫౩. క ॥ అనలంబించుకయైనఁబ। వనుచేవెలుఁగొందుహూఁడిక్కివర్ధనముంబొం। దునుసత్కర్మాచరణం। బునదైవంబానుకూల్యమునఁగురుముఖ్యా ॥ అను। ఆ ౧। పు ౬.

౪౫౪. క ॥ వినుకుసుమంబులవాసిం। చిననెప్పనికంపువిడిచిచెందునుసౌర। భ్యనిరూఢింబిలలట్టుల। యనఘాసుకృతములజీవుఁడకలంకుఁడగున్ ॥ శాంతి। ఆ ౫। పు ౧౦౫.

౪౫౫. చ ॥ జనులకుగీడురోయకయజస్రముధర్మరతింజరించిన। జ్జనగురుపూజనంబులునుసత్యహితోక్తులుదీనపోషణం। బునునతిథిప్రియత్వమునుభూరిదయార్ద్రతయుంగలట్టివా। రని — మిషలోకగాములనియాత్మనెఱుంగుముమేనకాత్మజా ॥ అను। ఆ ౫। పు ౬౪.

౪౫౬. క ॥ సుకృతములనరుఁడునాకము। నకుఁజనునవిగొం
చెమైననరుఁడయగునువా । నికిదివికేగిడిగినయత । నికిమానుష
వైభవములునెరయంగల్గుః ॥ అను । ఆ ౫ । పు ౮౦.

౪౫౭. క ॥ ధర్మార్థకామగోచర । కర్మములకుసాత్వికాదిక
ప్రకరవికా । రోర్ములుహేతువులగుని । ష్కర్మతకేతద్విభూతికా.
రణముసుఁడీ ॥ అశ్వ । ఆ ౨ । పు ౧౯.

౪౫౮. గీ ॥ సకలపుణ్యకర్మచయమునునొకదెస । వినుము
పాడిదప్పకునికియొక్క। వలనుదీనిశ్రుతులుతెలిపెడునెడఁబాడి।
కలిమియందపెద్దగానుపించుఁ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౧.

౪౫౯. గీ ॥ పాడిగలిగిననిహలోకఫలములెల్లఁ। జేరుటయ
కాదుకీర్తియుఁజెందుఁబురుషు । ధరణిఁబరఁగుఁబొగడ్తయెందాక
నంత । కాలమునుబుణ్యలోకంబుగల్గునండ్రు ॥ ఉద్యో ।
ఆ ౨ । పు ౨౧.

౪౬౦. చ ॥ చిరముగధర్మముల్ప్రడుపఁజిత్తముచేఁబుఁబ్రస
న్నచిత్తుఁడై। పరువడినింద్రియార్థములభంగులురిత్తలుగానెఱిం
గిచే । చ్చెరనవియంతవట్టునివసించితపోదముసత్యశీలతం। బరిణతి
నొందిపొందుఁబిదపంబరమార్థపదప్రభావముః॥అర।ఆ౫।పు౯౪.

## ౧౪ - దానవిధి.

౪౬౧. గీ ॥ వినుముదానంబుఁదపమునువృద్ధసేవ । నమున
హింసయునియతకృత్యములుసర్వ । జనులకీమహాగుణములుమన
మునందు । దృఢముగానిల్పినడుపుముధీరవర్య ॥ అను । ఆ ౫।
పు ౯౫.

౪౬౨. గీ ॥ ఇందుఁ జేసినపుణ్యంబులందుఁగుడుచు। మీఁది
జన్మంబునకునదిమేలు సేయుఁ। గానఁదనశక్తితోఁగూడ దానధర్మ।
చిరపరోపకారంబులు సేయవలయు ॥ ఆర । ఆ ౬ । పు ౧౨౧.

౪౬౩. శా ॥ అన్యాయార్జితమైనవిత్తమునఁ జేయంబూను
దానంబుమా । ర్గన్యాయంబదిదానఁ జేసిఫలపాకంబేమియుఁ గా
లేదాయు । క్తన్యాయార్జితమించుకంతయయినంగాలంబుదేశం
బున । స్నాన్యంబైతగఁ బాత్రయోగమున సౌమ్యంబై ఫలించుం దు
దిన్ ॥ ఆర । ఆ ౬ । పు ౧౯౧.

౪౬౪. క ॥ తనకుఁదనయులకుసతులకు । జననీజనకులకుబం
ధుజనులకుఁగీడౌం । దని తెరువుననఁగీర్తిగొనం । జనుఁగాకందఱు
ను జెడుయశంబేమిటికిన్ ॥ ఆర । ఆ ౭ । పు ౧౫౪.

౪౬౫. క ॥ ధనమించుకేనిధర్మంబునఁ బడచినయట్టిదైనభూ
వరపాత్రం । బుననిడిననదిమహాఫల । జనకంబగునంద్రు వేదసం
వేదిజనుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౮.

౪౬౬. గీ ॥ ధర్మలబ్ధమైనధనముపాత్రికయేని । బహులఫల
మునిచ్చుఁ బాపవృత్తి । బార్జితంబుకోటియైననిష్ఫలమంద్రు ।
దానశాస్త్రవిదులుమానవేంద్ర ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౮.

౪౬౭. క ॥ పరుమత్వములేకంతః । కరణంబునశుద్ధిజాలఁగలి
గి ప్రియముపాం । పిరిస్రావఁ జేతదానము । పగమోత్కృష్టం
బుపద్మపత్రసిభాక్షీ ॥ అను । ఆ ౫ । పు ౮౪.

౪౧౮. క ॥ తమతమసారములకుఁదగఁ । గమలాక్షీ చేయు
దానకల్పనలవిశే । షములొక్కరూపయగుఁద । త్ప్రమాణ
రూపణముచేసిపలికెదఁదెలియన్ ॥ అను । ఆ ౫ । పు ౧౭౪.

౪౧౯. క ॥ వినుమొకకుంచెడుధాన్యము । తనకాయతిగల్గు
నతఁడుదానినొసఁగినన్ । ధనకోటిగల్గువాఁడ । ద్ధనమొసఁగిన
నొక్కరూపతత్తత్ఫలముల్ ॥ అను । ఆ ౫ । పు ౧౭౪.

౪౨౦. క ॥ నిజదారపరులుసంతత । యజనరతులుఁగామరో
షహాంతలునగుస । ద్ద్విజులనరసిధనమిచ్చుట । త్రిజగత్పూజ్య
మగునంద్రుధీరవిచారా ॥ అను । ఆ ౨ । పు ౩౪.

౪౨౧. క ॥ దారిద్ర్యముచేఁగుందుచు । నేరినినడుగంగఁబో
వకెంతయుఁగృశతం । గూరినవిప్రునకుర్వర । వారనిదయఁనీగిఫ
లమువాఙ్గోచరమే ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౪౨౨. క ॥ అపుగతేఁయుండిననాలిం । గొడుకులరక్షింపలేక
కుతెలపడుచునె । ప్పుడుఁబేదతనముగలనరు । నెడరుడుపఁగవ
లయునదిమహితగుణమునఘా ॥ అను । ఆ ౨ । పు ౩౪.

౪౨౩. క ॥ అర్థియైనదీనుఁడైతను । శరణంబనివేఁడినంబ్ర
సన్నాత్మతన । ప్పురుషునికోరికఁదీర్చినఁ । బురుషోత్తముఁడందు
రతనిఁబురుషవరేణ్యా ॥ అను । ఆ ౨ । పు ౩౪.

౪౨౪. క ॥ మౌనమునదృఢజ్ఞానము । దానంబునభ్యుదయ
ముధర్మనిరతయూ । శానిర్వహణంబునర । కాసీకాహారణసౌ
ఖ్యముగునంద్రుబుధుల్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౪౧.

౪౭౫. చ॥ ధనమది యేల భోగమును దానము లేదగు నేని శత్రు
మ|ర్దన మొనరింపఁ డేని బలదర్పము లేల సధర్మవృత్తికిం|గొనకొనఁడే
నివిద్య మునికుంజర యేల జితేంద్రియుండుగా | దనఁజను నేని నా
స్త్రవిధ మారయ నాగ్రహ మేల చెప్పుమా॥ శాంతి।ఆ ౬।పు ౧౨౪.

౪౭౬. చ॥ అడిగిన నిచ్చుకంటె ననునయాచకుఁ గాఁగ నెఱింగి యి
చ్చుటె | క్కుడు ఫల మిచ్చు దానవిధికోవిద వేఁడుట చావు వేఁడఁ
గాఁ|బడుట దిపెద్దచావు తగు ప్రార్థనపూర్ణము చేయునాతఁడా|య
డిగినవానిఁ దన్ను నుదయారతిఁ గావఁగఁజాలువాఁడగున్॥ అను।
ఆ ౨। పు ౩౪.

౪౭౭. క ॥ ఇచ్చునది ధనము పాత్రున | కచ్చుగ నెరువేఁ
డకుండునది యభిముఖులై | వచ్చిన యాశార్థుల వృథ | పుచ్చక
చేయునది సర్వభూతప్రీతిన్ ॥ ఆది । ఆ ౩ । పు ౩౯.

౪౭౮. క ॥ చెలులుం జుట్టలు సంబం । ధులు ఋత్విజులును బు
రోహితులుఁ దగు పాత్రం । బులు హింసాక్రోధేర్ష్యా । దులు లేని
జనంబులైన దురితవిదూరా ॥ అను । ఆ ౨ । పు ౨౬.

౪౭౯. క ॥ శిలచే ప్రమాను గాఁగొని । జలనిధిఁ గడవంగఁ
గోరుచాడ్పగుఁ బాత్రం । బులుగాని యెడల దానం । బులఁ బా
పముని స్తరింప బుద్ధిఁ దలఁచినన్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౮.

౪౮౦. క ॥ కావున వినుపాత్రముమే । లైవిహితాచరణసౌ
మ్యమగు దానముధా । త్రీవరపాత్రము దాతలఁ । దావెలయుం
భువనత్రితయరంజకతన్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౯.

౪౮౧. గీ॥ షండునకుబిడ్డనిచ్చినచంద మొందు।బూదిలో నేయివేల్చినపోల్కి యౌటి। కడవలో నీళ్లుపట్టినకరణియగున। పాత్రజనులకుఁబెట్టుటపౌరవేంద్రా॥ శాంతి। ఆ ౧।పు ౧౯.

౪౮౨. గీ॥ పునుకఁగుక్కతిత్తిఁబోసినపాలునీ। ళ్లధికనింద్య మైనయట్లుఁదుష్టు। మైయపాత్రవిషయమగునీగివ్యర్థమౌను।నిచ్చు చోటఁబాత్రమెఱుఁగవలయు॥ శాంతి। ఆ ౧। పు ౧౮.

౪౮౩. సీ॥ పాడియునాడియుఁబ్రదుకువారలఁబరిహాసకుదు ర్జనునంగహీను। మత్తునిమ్రుచ్చునున్మత్తునపుంసకుఁజెనఁటినూ టలఁదేల్చుమనుజాఁగులము। చాలమివేదంబుచదువమినిజవృత్తి హానిదుర్వృత్తిగలట్టివాని। దానపాత్రంబులుగానియ్యకొనరు పెద్దలుదీనులుసువిపద్బాధితులును॥ గీ॥ నీగికర్తలుదయపేర్మిని చ్చుచోట। నైననవగుణమెక్కుడై కానఁబడిన। నిందితాత్ముల కిచ్చుటనిష్ఫలంబు। పాత్రనిశ్చయమిట్టిదిపౌరవేంద్ర॥ శాంతి। ఆ ౧। పు ౧౮.

౪౮౪. గీ॥ పాడిదప్పకుండఁబడసినయర్థము। పాత్రముల కుఁనీగిపాత్రములకు। బెట్టకునికియనఁగ నెట్టన రెండువి।ధములఁగీ డుదొడరుధరణినాథా॥ఉద్యో। ఆ ౨। పు ౨౦.

౪౮౫. గీ॥ అడవిగోపులకైకాల్చుటధ్వరమునఁ। బశువుఁ జంపుటదానముపాత్రభూతుఁ। డగువెఱుంగకయిచ్చుటతగని బంటుఁ। బ్రోవకుండుటగీడులుగావువత్స॥ శాంతి।ఆ ౧।పు ౧౬.

౪౮౬. క॥ దానవిధియరయనసమీ। చీనంబగు నేనఁగీడు సేయుంగుదుధా। శ్రీనాథమఱియుబాత్రం। బైననుగొన్న తనికి చ్చునతనికినెట్లుఁ॥ శాంతి। ఆ ౧। పు ౧౯.

# ౧౫ - అన్నదానము.

---

౪౮౭. క॥ దానార్హవస్తువులలో । మానితమన్నంబయన్న మయములయసువుల్ । మేనుదదీయబలంబును । గానబుధులుదానిఁదద్దగైకొండ్రునుదిక్ ॥ అను । ఆ ౪ । పు ౭౦.

౪౮౮. క ॥ తనకుఁగలయట్టియన్నము । ననసురపితృపూజనములునరుననకునడుపం । జనునతిథితర్పణముదా । ననతగనొనరించువాఁడునరవరముఖ్యా ॥ అను। ఆ ౨। పు ౩౭.

౪౮౯. గీ ॥ దివసమువంధ్యంబుగాకుండఁదివిరియన్న । పానదానంబులోదవినభంగిఁజేసి । మఱిభుజించుటఁబోలెడుమహితధర్మ । కార్యమొండొకఁడెందునుగలదెయరయ॥అను।ఆ ౪।పు ౬౭.

౪౯౦. గీ ॥ అజుఁడుకల్పాదియందన్నమమృతమనియె।నన్న హానిబలాధికునైనదుర్బ । లాత్మఁగాఁజేయుఁగావుననన్నభుక్తి । సకలధాతువృద్ధికినయిజనముగోరు ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౪౯౧. క ॥ కులమునువిద్యయువృత్తము । నలఘుమతీయన్న మిడుటకైయడుగంగా ।వలవదువిప్రునినాదర। మలరంగానిడుటలెస్సయడిగినమాత్రక్ ॥ అను । ఆ ౨। పు ౩౫.

౪౯౨. సీ ॥ ప్రాణంబులకునుధారకమన్నమింటిజనంబులకు డిగిర్షైననుసభక్తి। నతిథికిఁబెట్టుటయధికపుణ్యముశ్రాంతువృద్ధుఁ దాపసుబాలువికలువనితఁ । గడపఁగాదాకలిగదిరియర్థించిన గృహమేధికవమతికినుకదగదు । కాలంబుతోఁగుక్కమాలఁడు

తుదిఁగాఁగనాఁకొనివచ్చినననుగుణముగ ॥ గీ ॥ నాచరింపవ
లయునాహారకల్పన । మునులుదేవపితృసముత్కారముః । నన్న
దానవిధులనాదరంబుగఁబ్రియ । మొందఁజేతఁబోలవొందువి
ధులు ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౪౯౩. క ॥ మునులునుదివిజులునన్నము । వినుతింతురులో
కతంత్రవిధిగ్రతువులుఁడ । క్కనుగలసర్వమునన్నం । బునవడ
చుంగానన్నమువిశిష్టమిలక్ ॥ అను । ఆ ౧ । పు ౩౫.

౪౯౪. గీ ॥ అన్నదానసదృశమగుదానమెందునెన్నఁడును
లేదుగావుననువిధేయ । మన్నదానమధికయత్నపూతంబుగాఁ ।
బూనిదానిచేతపుణ్యతమము ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౪౯౫. క ॥ వినుదానంబులఁబాపము । లనఘాచెడుదాన
ములకునన్నిటికినిస । జ్జనసేవ్యయన్నదానము । మునులధికంబం
డ్రుపాపములఁబాపునెడక్ ॥ అను । ఆ ౪ । పు ౬౭.

౪౯౬. గీ ॥ అన్నమిడినమణిమయావాసశయ్యాసనము
లునమృతభోజనంబుహృద్య । మాల్యలేపనములుమహనీయమ
హిళానుభవముఁజిరతనొందుదివమునందు ॥ అను । ఆ ౨ । పు ౩౫.

## ౧౬ - జలదానము

౪౯౭. క ॥ పానీయదానముత్తమ । దానంబనియఖిలధర్మత
త్త్వపృథపరి । జ్ఞానాసూనుండగుమను । మానవపతిచెప్పె
నృపసమాజవరేణ్యా ॥ అను । ఆ ౨ । పు ౩౬.

౪౯౭. సీ ॥ దేవతిర్యఙ్నరస్థావరాశ్రయముతటాకంబువిను
మట్లుగాకయందు। గోకులంబులునీరుగొనిదానకర్తకులమునెల్లఁ
బుణ్యలోకమునకనుచు । నీలోకమునశ్రీయునెక్కుడుకీర్తియున
తనికిఁజేయువర్షాగమమున । సీతునవేసవిఁజెరువులోనీరున్న న
గ్నిహోత్రాదిమయజ్ఞఫలముఁ॥ గీ ॥ పేయఫలములోలినాయ
నకగుఁగట్టఁ । దగినతరువులిడినసుగతిగలుగు । నిహసుఖంబుఁ
బొందువిహగాదిబహుభూత । వాసనౌఖ్యమతఁడుచేసెఁగాన ॥
అను । ఆ ౩ । పు ౫౫.

౪౯౯. గీ ॥ ఆకలేకయెవ్వానిజలాశయమున । మండువే
సవియందునుమనుజకోటి। యవభృథస్నానపానంబులాచరించు।
నతఁడువొందఁడువిషమదుర్గాదిగతులు॥ అను । ఆ ౨।పు ౩౬.

౫౦౦. క ॥ అనఘాయెవ్వఁడుగావిం । చినసలిలాశయము
నందుఁజెలఁగుచుగోవు । ల్గొనునీరాతనివంశం । బునకనికావిం
చునూర్ధ్వభువనప్రాప్తిన్ ॥ అను । ఆ ౨ । పు ౩౬.

౫౦౧. క ॥ కావునఁజెరువులునూతులు । బావులుఁగొలఁకు
లనునెపుడుఁబౌరవవర్యా । కావింపవలయునవిగడుఁ । బావన
ములుపుణ్యలోకభాగ్యతనిచ్చున్ ॥ అను । ఆ ౨ । పు ౩౬.



## ౧౭ - భూదానము.

౫౦౨. క ॥ వసుదాయనిన్దైనవసుధ । నొసఁగినతనీఁదన్న తన్నయొసఁగెననుచుసం । తసపడుభూతములన్నియు। నసమానముభూమిఁదానమమరాధీశా ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౫౦౩. గీ ॥ పూర్వదత్తయైనభూమినెవ్వఁడువుచ్చి। కొనియెనతఁడుతనదుకులమువారి । నిరువదొక్కతరమునరకవాసులఁజేయు । దానుమున్న గాఁగధర్మనిరత॥ అను।ఆ ౨।పు ౩౫.

౫౦౪. గీ ॥ భూమిరత్నగర్భపురుహూతయటుగానఁ। గలుగుభూమిదానకర్తయైన । వానికశ్వహస్తివనితాదిసర్వర । త్నములునిచ్చునట్టియమితఫలము ॥ అను। ఆ ౨। పు ౩౫.

౫౦౫. గీ ॥ భూమినిఖిలమగువిభూతివిశేషజ్ఞా । తంబుగలుగుఁగానఁదత్ప్రదానమెల్లవస్తువులునునిచ్చినయట్లగు। దానఁబోనిపాపతమములేదు ॥ అను । ఆ ౫ । పు ౮౩.

౫౦౬. క ॥ ఆజిప్రాప్తమృతులుగురు । పూజకులునుమఱియునెట్టిపుణ్యాత్మకులుం । రాజోత్తమభూదాన। ప్రాజిష్ణునిఁబోలరంద్రుపరమమునీంద్రుల్ ॥ అను । ఆ ౨ । పు ౩౫.

౫౦౭. క ॥ కనకమురజతమువస్త్రంబును । ధాన్యమువివిధరత్నములునిచ్చినయ । వ్వినుతఫలంబులనెల్లను । గనునుత్తమభూమిదానకరనరేంద్రా ॥ అను । ఆ ౨ । పు ౩౪

౫౦౯. క ॥ దానములన్నిటికిని । భూదానంబెక్కుడుసమ
స్తధాన్యములుఁబ్రభూ । తానేకవస్త్రఘనర । త్నానూనత్వ
మునుభూమినవుటకతముననా ॥ అను । ఆ ౨ । పు ౩౮.



# ౧౮ - గోదానము.

౫౧౯. గీ ॥ పుణ్యదినమునందుభూసురానుజ్ఞతో । నుపవ
సించిగోవులున్న మందకు । రిగిపరమనియతినయ్యహోరాత్రము ।
గ్గోష్ఠమునవసించినిష్ఠతోడ ॥ అను । ఆ ౩ । పు ౪౦.

౫౧౦. గీ ॥ సంగవాభిధానసత్కాలమునఁదన । యిచ్చు
గోవుఁజేరనెలమిఁబిలిచి । యజుఁడుకరుణఁజెప్పినట్టియవ్వాక్య
ర । త్నముఁబఠించునదియుదాత్తచరిత ॥ అను । ఆ ౩ । పు ౪౦.

౫౧౧. గీ ॥ తల్లిగోవువృషముదండ్రిగర్భప్రదే । శంబుదివ
ముధరణిసంప్రతిష్ఠ । యనిపఠించియోగ్యుఁడగువిప్రునర్చించి
పలుకవలయునీగికలిమిదెలియ ॥ అను । ఆ ౩ । పు ౪౦।

౫౧౨. క ॥ సారములగుగోవులు । ఘోరసకలకల్మషము
లఁద్రుంచునుసౌమ్య । ద్వారూఢంబులుశాశ్వత । సారోదా
రపథమిచ్చిసౌఖ్యముఁజేర్చుఁ ॥ అను । ఆ ౩ । పు ౪౦.

౫౧౩. క ॥ అనిపలికిగోవులిచ్చితి । ననుచునుదకధారఁబ్రీ
తినవిప్రుకరం । బునఁబోయవలయునర్ఘ్యంబ । నిచెప్పుదుజ్జ్వలం
బులాదిమునీంద్రుల్ ॥ అను । ఆ ౩ । పు ౪౦.

౫౧౪. క ॥ వినువిప్రుఁడువ్రతశీలుం । డనఘుఁడుదాంతుఁ డుశాంతుఁడక్రోధనుఁడి । వ్వినుతప్రదానవిధికిని । జననాథవరే ణ్యయెఱుఁగుసత్పాత్రంబుల్ ॥ అను । ఆ 3। పు ౪౦.

౫౧౫. క ॥ తేపకడనీరుద్రావక । మేపుగొనకమున్న గోవు మిక్కిలిభక్తిన్ । భూపాలయిచ్చునదిది । వ్యాపారసుఖంబుఁబ డయనాత్మదలఁచిననా ॥ అను । ఆ 3 । పు ౪౧.

౫౧౬. క ॥ మొదవులలోనెల్లఁగపిల । మొదవువరిష్ఠంబు రాజముఖ్యనియతిమై । నదివిప్రునకిచ్చుటరయఁ। దుదిదానంబు లకునరకదురితాటవులన్ ॥ అను । ఆ 3। పు ౪౧.

౫౧౭. క ॥ వినుగోవులనుబ్రభాతం । బునఁదలఁచుటతద్గుణ ములువొగడుటభక్తిం । గనుఁగొనుటయధికపుణ్యము। లనియె ఱిగించునుజనములకాగమఫణితుల్ ॥ అను। ఆ 3।పు ౪౧.

౫౧౮. క ॥ గోవులుసూర్యునియుజ్జ్వల । గోవులయట్లగు టఁజేసిగోదానపరుల్ । భూవినుతాసూర్యసదృశు । లై వెలుఁగు దురిట్లచెప్పునాగమఫణితుల్ ॥ అను । ఆ ౨ । పు 3౯.

౫౧౯. క ॥ గోవులపాలమృతంబని । దేవేంద్రుఁడుచెప్పెఁ గానధీరత్వనిధీ । గోవునొసఁగనమృతముస । ద్భావంబుననిచ్చి నట్టిఫలమొనగూడున్ ॥ అను । ఆ ౨ । పు 3౬.

౫౨౦. గీ ॥ అనఘగోవులుప్రాణంబులనిసమస్త । మునులు సెప్పుదురట్లుగావునఁదలంపఁ । బ్రాణదానవిధానసంప్రాప్తమైన। ఫలముగోదానకర్తకుఁగలుగుఁజూవె ॥ అను । ఆ ౨ । పు 3౭.

౫౨౧. గీ॥ గొడ్డుబడుగుఁదెవులుగొంటిఁగ్రేపెడలిన । దాని నెచ్చ టేనినూనమైన । యట్టిదానినొకటనాయాసపడియున్న । దానినీరుగోప్రదానవిదులు ॥ అను । ఆ ౨ । పు ౩౭.

౫౨౨. క॥ క్రూరునకునాస్తికునకుదు । రారంభునకిచ్చినం బరమదుఃఖమునం । గూడునుగోవదిదాతక్ । నారకిఁజేయును బరీక్షణముగఁజూపవలయున్ ॥ అను । ఆ ౨ । పు ౩౭.

---

# ౧౯ - కన్యాదానము.

---

౫౨౩. క॥ అతివాకన్నియనిచ్చినఁ । బితృపతిముదమం దుసురలుఁబ్రీతులగుదురం । చితగతికర్తకుదొరఁకొను । నతితేజశ్శ్రీయశస్కమగునభ్యుదయమ్ ॥ అను । ఆ ౫ । పు ౮౩.

౫౨౪. క॥ కులమునుశీలమువిద్యయుఁ । గలవానింబిలిచి ప్రీతిఁగన్నియనీఁగా । వలయు నుదకప్రధారాకలితంబుగబ్రాం హ్మకర్మగతియిదియధిపా ॥ అను । ఆ ౨ । పు ౨౯.

౫౨౫. గీ॥ రూపగుణశీలములననురూపుఁడైన । వరునకీక కన్నియఁదనవలసినట్లు । తగనివానికినిచ్చుటధర్మచేవ। తాతనూభవబ్రంహహత్యాసమంబు ॥ అను । ఆ ౨ । పు ౨౨.

---

## ౨౦ - విద్యాదానము.

౫౨౬. గీ ॥ రాజముఖ్యతగుసరస్వతిశిష్యున। కోసఁగభూ
మిదానమూర్జితముగఁజేసినట్టిఫలముసిద్ధించు ధేనువు । నిచ్చుట
యునుభూమినిచ్చినట్లు ॥ అను । ఆ ౨ । పు ౩౭.

౫౨౭. గీ ॥ విద్యయిచ్చుటసత్పాత్రవిషయమైన। నవ్యయా
నందపదముఁజేయంగఁజాలుఁ। దగఁగదక్షిణయిచ్చి పేదలకువిద్య।
యీనియోగించుటయుఁదత్సమానకృతియ॥అను।ఆ ౫।పు ౮౩.

## ౨౧ - ఇతరదానములు.

౫౨౮. క ॥ అలఘుతరసకలకామ్యం । బులనిచ్చినయట్టి
మహితపుణ్యంబై తా । వెలుఁగుఁగనకమిచ్చుటయని । పలికెఁ
ధర్మజ్ఞుఁడత్రిపరహితచరితా ॥ అను । ఆ ౨ । పు ౩౬.

౫౨౯. గీ ॥ కనకమాయుఃప్రదంబుపావనముభావ । శుద్ధి
నొనరించుదాతకుసువ్రతమున। వేడ్కతోదానినిచ్చుటవేరపోఁగ
డ। నేలయనియెహరిశ్చంద్రుఁడిద్ధతేజ ॥ అను । ఆ ౨।పు ౩౬.

౫౩౦. గీ ॥ ఛత్రమిచ్చి కాంచుఁబుత్రులఁబురుషుండు । సక
లకామ్యదానసమముశకట । మిచ్చుటనఘచెప్పులిచ్చినఁగంట
కు। లైనరిపులఁద్రొక్కియతఁడుదిరుగు॥అను।ఆ ౨।పు ౩౬.

౫౩౧. చ ॥ తెవులు గొన్న వారికవి దీఱుటకౌషధ మిచ్చి దుర్గతుల్ । దవులు జనాలి ప్రోవును పథంబుగఁ జైద్ధిక కోటిఁ దన్వ్వ బాం । ధవరహితత్వదీనశవదాహము దుఃఖితులైనవారిఁ దే । ర్చ వెరపునోర్పు గల్గియునుబ్రస్తుతి కెక్కిన మేటి ధర్మముల్ ॥ అను । ఆ ౫ । పు ౧౪.

౫౩౨. క ॥ తిలలు పితృభోజ్యములుగా । జలజభవుఁడు చేసెఁ బితృనిచయ మలరఁగ డుం। దిలలిచ్చినశుచులగుదురు। తొలఁగుం బర్వసురతాదిదోషము లెల్లన్ ॥ అను । ఆ ౨ । పు ౩౬.

౫౩౩. క ॥ దానప్రవణయు పాన। ద్దానంబును నాతపత్రదానము సుర । సన్మాననభాజనములగుట। నానాబుధజనుల చేవినంబడు నెపుడున్ ॥ అను । ఆ ౩ । పు ౫౧.

౫౩౪ క ॥ యాగాదికర్మములకుప । యోగింపంబడుటఁ జేసియు త్తమము ఘృతం । బాగురు వస్తువు నిచ్చుట । యాగముల కునగ్నికిం బ్రియంబై యుండున్ ॥ అను । ఆ ౨ । పు ౩౬.

౫౩౫. గీ ॥ అర్థి కోరిన వస్తువు లర్థితోడ । నీగి యెల్లదానములకు నెక్కుడరయ । నఖిలభూతమ్ములకు నభయంబు నిచ్చు । టంతకం టెను మేలందు రార్యజనులు ॥ అను । ఆ ౨ । పు ౩౪.

౫౩౬. గీ ॥ కుడువ నకు ముందరొక్కని కొపునకుస । మం చితగ్రాసముష్టి నిత్యంబు నేదు । గాలమిచ్చి ననతఁడెల్లకామ్యములను। బ్రాంహణులకర్థి నొసఁగిన ఫలము వడయు॥అను।ఆ ౨।పు ౩౭



# ౨౨ - ధూపదీపములు.

౫౩౭. గ ॥ తగినయట్టిధూపముదేవతలకునిచ్చి । పరమపుష్టియునాయువుంబడయుఁగర్త । యక్షగంధర్వపన్నగరాక్షసులును । ధూపమునమెచ్చికోర్కులిత్తురుకుమార ॥ అను । ఆ ౪ । పు ౫౭.

౫౩౮. గీ ॥ దైవతార్చలపుమడాకినీభూతర । క్షోముఖంబులైనకుత్సితంపు । జాతులెల్లదీపసన్నిధినడఁగున । ట్లిటుమదీపదానమధికఫలము ॥ అను । ఆ ౪ । పు ౫౭.

౫౩౯. క ॥ ఒరులిచ్చినదీపంబప । హరించితత్పాతకమున నంధుండగుభూ । వరసభగుడిపైలోపల । గిరిదీపంబిడివిభూతికింబాత్రమగున్ ॥ అను । ఆ ౪ । పు ౫౭.

౫౪౦. గీ ॥ ఆలనేయిముఖ్యముమహిషాదిమేష । జనితఘృతమునుతైలంబుమనుజనాథ । మధ్యమములగుమేదోస్థిమాంసరసము । లరయనింద్యముల్దీపసమర్పణమున ॥ అను । ఆ ౪ । పు ౫౭.

౫౪౧. క ॥ జ్యోతిస్సాలోక్యకులో । ద్యోతనమహితప్రకాశయోగంబులుపు । త్రాతెచ్చుదీపదానము । దాతకొసఁగునమరపూజితశుచిత్వంబున్ ॥ అను । ఆ ౪ । పు ౫౭.



# ౨౩ - పుష్పములు.

౫౪౨. సీ॥ ఓమఘవంబమృతమచ్యుత్తమవస్తుసంతతిలోనం
బుష్పవంతములుమేలు। పుష్పముల్గొనిసురపూజలొనర్చినమా
నవులకుమంచిమనసుగలుగు। నట్లుగావునసుమనోభిధానము
పుష్పములకయ్యెఁదక్క ద్రవ్యపూజలిచ్చు। నరులకోర్కులుసుమ
నస్కతఁదీర్చుటనమరులుసుమనస్కులనఁగఁజనరి॥ గీ॥ కెంపు
రూపుదెలుపుగలిగియుకంటక। భూరుహాదులందుఁబుట్టినట్టి।
పుష్పములఁబ్రియంబుఁబొందినకైకొంద్రు। నిర్జరులుపూజనమ్ము
లఁగురువరేణ్య॥ అను। ఆ ౪। పు ౫౬.

౫౪౩. క॥ నలినంబులుజాజులుసుం। దులసీదళములుఁబ్ర
భూతతోమముగీర్వా। ణులకుంజేయునుయత్నా। దులకుజలో
ద్భవముఁదెల్లఁదుష్టిమొనర్చున్॥ అను। ఆ ౪। పు ౫౬.

౫౪౪. క॥ దేవతలర్హకుసుమపూ। జావిధిఁబ్రియమందు
యపుడజనులకుఁదగనం। భావించివారికోర్కులు। గావింతు
రుసఫలములుగఁగౌరవనాథా॥ అను। ఆ ౪। పు ౫౬.

౫౪౫. క॥ అరుణంబులుసకంటక। తరుభవములుగటుక
గంధమనములునైన। స్తురశాస్త్రవాభిచారిక। కరణమునవధ
ర్వమాంత్రికతగుసుమంబుల్॥ అను। ఆ ౪। పు ౫౪.

౫౪౬. క॥ పారావతములుశుకములు। శారికలునుబుష్ప
లతలుజనవరపసిండిక। దారవమున్నైనపుట్టులు। నారయగృహ
మంగళంబులాదర్శంబుల్॥ అను। ఆ ౪। పు ౬౧.

౫౪౭. క ॥ వినుదేవాలయములఁ జిత్ర । వనములఁ బుష్కరిణు సుమములువలదువివాహం । బునకును శాంతికపౌష్టిక । పనిఁ తా జనరంజనాదివర్తనములకున్ ॥ అను । ఆ ౪ । పు ౫౭.

## ౭౪ - వనప్రతిష్ఠ.

౫౪౮. గీ ॥ ఛాయనతిథివర్గంబుఁ బుష్పములనురగ । ణంబుఁ బండులఁ బిత్రునివహంబుఁ బ్రమద । మందఁ జేయు వృక్షంబు లెల్లఁ గుటవృక్షరోపణక్రియమేటిధర్మపుకనూార॥అను।ఆ ౩।పు ౫౫.

## ౭౫ - ఉపవాసము.

౫౪౯. క ॥ నరవరయర్థంబులును౦ । బరిహారము లేక యును శుభస్థితిఁ జేయన్ । దొరకొనియుండుటగనియం । గిరనుపవాసముం బ్రకీర్తించెదగన్ ॥ అను । ఆ ౪ । పు ౬౩.

౫౫౦. గీ ॥ మాతకును వేదమునకుధర్మంబునకును । బరము లగుగురుశాస్త్రలాభములు లేవు । తపము లేదుపవాసవ్రతంబు కంటె । నధికమైనదియం ద్రుమమహాత్ములనఘ॥అను।ఆ ౪।పు ౬౭.

౫౫౧. క ॥ కావునను పవాసవ్రత । సేవనము తీరరమునను చిత్తంబునకుం । బావనమైహికమహిమయు । దేవసిలయు సుఖముని చ్చుధీరవిచారా ॥ అను । ఆ ౪ । పు ౬౭.

## ౨౬ - తీర్థసేవ.

౫౫౨. సీ॥ కడఁగిబుద్ధీంద్రియకర్మేంద్రియంబులయందుసంత తచిత్తులైనవారు । ధృతినహంకారప్రతిగ్రహాపేక్షలయందునివృత్తాత్ములైనవారు । నల్పభోజనులునవారంభకులును నైయత్యంత సంతోషులైనవారు । సత్యవ్రతులుశుభాచారులక్రోధనులనఁగ ధర్మాన్వితులైనవారు ॥ గీ ॥ నఖిలతీర్థశతములాడినఫలములు । నఖిలయజ్ఞవిధులనైనఫలముఁ । బడఁయుదురువిహీనభాగ్యదుఃఖితులకుఁ । బరమతీర్థసేవపడయనగునే ॥ ఆర । ఆ ౨। పు ౩౭.

౫౫౩. క ॥ క్రతుఫలములువడయఁగదు । గ్గతులకుదారఁ గొనదుతీర్థగమనంబునఁద । త్క్రతుఫలములందుదురుదు । గ్గతులునిదిమునులమతముకౌరవవృషభా ॥ ఆర। ఆ ౨। పు ౩౭.

౫౫౪. క ॥ వెలిశుచియైమఱితీర్థం । బులుసొచ్చుటమేలునియమములుదీర్చితగ । న్వెలలినయెడదేవార్చన । ములువిప్రార్చలునవశ్యమునుగృత్యంబుల్ ॥ అను । ఆ ౫ । పు ౮౩.

౫౫౫. క ॥ వినుతీర్థసేవకామం। బును గ్రోధముమదములోభముం జేరనినె । మ్మనముగలిగినడుపవలయు । ననఘాఫలసిద్ధిదానఁగుఁబురుషునకున్ ॥ అను । ఆ ౨ । పు ౨౩.

౫౫౬. క ॥ చేరువతీర్థముకంటెను । దూరపుతీర్థంబుమేలుతోయజవదనా। శారీరాదూసముదత్కారణమనువేదవాక్యగతియట్లుండెన్ ॥ అను । ఆ ౫ । ౯౩.

౫౫౮. గీ ॥ నాతితీర్థసేవనంబునునియమవి । శేషమగుటదా
నిఁజెప్పవలఁయు । సకలనదులుతీర్థసంజ్ఞలుగలవబ్ధి । కనుగున
ట్టివిచ్చునధికఫలము ॥ అను । ఆ ౫ । పు ౮౩.

౫౫౯. గీ ॥ వానియందునుమునివరమాననీయ । దేశము
లునబ్ధిసంయోగదేశములును । దెలియుమనోన్యసంగమదేశ
ములును । బరమతీర్థంబులగుఁబద్మపత్రనయన ॥ అను ।
ఆ ౫ । పు ౮౩.

౫౬౦. క ॥ వనధిమహాతీర్థంబం । దునుసంయమివరులచే
తఁబ్రోల్లిప్తియమునం । గొనియాడఁబడినచోటులు । వినుముత్త
మతీర్థములువివేకాభరణా ॥ అను । ఆ ౫ । పు ౮౩.

౫౬౦. క ॥ వినుగంగంగయను । కీర్తనములతోనొండుసీ
టఁబగమునిఁగినయ । జనులుదురితములఁదొరఁగుదు । రనియూ
ర్యులుసెప్పవింమసంచితచరితా ॥ అను । ఆ ౨ । పు ౨౮.

౫౬౧. గీ॥అరయదుర్గమములునతివిషమంబులు। నైనతీర్థము
లుధరాధినాథ । యధికభక్తియుక్తినాత్మఁదలంచినఁ । జాలునరు
లకల్మషములువాయు ॥ అను । ఆ ౨ । పు ౨౩.

౫౬౨. క ॥ దమమునుదమమునహింసయు । శమమునుతీర్థ
ములుదానశౌచాతిశయం । బమలగుణకలుగురిత్తజ । లములం
దోఁగినశుచిత్వలాభముగలదే ॥ అను । ఆ ౮ । ౬౬.

౫౬౩. క ॥ దొరఁకొననివానిఁగోరక । దొరఁకొనినందును మమత్వదుష్టస్పృహయుతకా । బొరయకవిగతస్పృహులగు। పురుషులెరుఁగుము లేలతీర్థములువారలకుకా ॥ అను ॥ ఆ ౭ । పు ౭౭.

౫౬౪. గీ ॥ ఆత్మధర్మనిరతులైనపుణ్యాత్ములు । దుర్లభులు సమస్తదురితములును। శాంతిఁబొందువారిసంసర్గమునఁదీర్థ। భూతమతులువారుభూతలమున ॥ ఆర । ఆ ౭ । పు ౧౫౧.

## ౨౭ - శీలము.

౫౬౫. సీ ॥ దానంబుసత్యంబుదపముయజ్ఞమునార్జవముగా మలోభాదివర్జనంబు । గురుజనశుశ్రూషమక్రోధరాహిత్యంబుదమమునంతోషమధ్యయననిరతి । డాంబికత్వములేమిధైర్యంబుఁబొరయుపిఁయనసూయయనహంక్రియాభియుక్తి । తలఁపంగనాద్యమైతనరుధర్మమునెప్పుగొనియాటనాస్తికగోష్ఠిఁజనమి ॥ గీ ॥ శీలసంరక్షతీర్థసంసేవశౌచ। మఖిలభూతంబులందుదయార్ద్రుఁడగుట । మితహితోక్తులుసంశ్రితమిత్రగుప్తి । యిన్నియునుశిష్టచరితంబులిద్ధచరిత ॥ ఆర । ఆ ౫ । పు ౬౨.

౫౬౬. క ॥ క్రమమునశిష్టాచార। క్రమమెఱుఁగఁగధర్మమునకుఁగడుపాటంబై । విమలంబగుచిత్తమున । త్యమునునహింసయునుదనకుఁడాపలములగుకా ॥ ఆర । ఆ ౫ । పు ౬౨.

౫౬౭. సీ ॥ ఇరుప్రొద్దుగుడుచున నడనడఁగుడువకయుం డునాతండుసదోపవాసి । ఋతుకాలమునసాత్మసతియందురతిస

ల్పభవ్యశీలుఁడు సదాబ్రహ్మచారి। దేవపిత్రతిథిపూజావిధులం
దిడిమఱిననంజుపురుషుఁడమాంసభోజి। తనయట్లుపజ్జ్కవారునుభు
జింపభుజించునంచితాత్ముఁడువిఘసాశనుండు॥ గీ ॥ భృత్యవర్గం
బుగుడిచినపిదపఁగుడుచు। నాతఁడమృతాశిదివసంబునందునిదు
ర। నొనిపుణ్యుఁడస్వప్నుఁడీపాలములగుమ। హాధికవ్రతము
లుజేహబాధకములు॥ శాంతి। ఆ ౪। పు ౭౪.

౫౬౭. చ ॥ పగలును రేయిఁగుడ్చిజలపానములోనుగఁగు
డ్చునవ్వతు। ష్టిగనొనరించిమర్త్యుఁడొకటిన్వదుమన్నరిమొఢ్ఢ
నంటకే। మిగతినిబాపముంబొరయమిందలకొల్పుచుహాబాహ
కార్యముం। దగుమెయిఁజేయుచున్నవినుతంగెటిజున్నగుసూర్ధ్వ
లోకముల్ ॥ అను। ఆ ౪। పు ౬౩.

౫౬౮. క ॥ వినుశిష్టచరితగైకొని। యనపాయతనడువన
డువనంతఃకరణం। బునఁబొదలునట్టిసమ్మద। మనఘాదుర్లభము
నూవెయన్యపథముల౯ ॥ ఆర। ఆ ౪। పు ౯౨.

౫౭౦. గీ ॥ సత్కులంబునఁబుట్టుటసకలవేద। ములుఁబురా
ణంబులునుశాస్త్రములునుజదువు। టయునుసద్గతిజేయఁబ్రౌఢ
ములుగావు। శీలసామ్రగిలేనిదుశ్చేష్టితునకు॥ అను। ఆ ౨। పు ౨౧.

౫౭౧. క ॥ పరహితముసిగ్గుపాటుం। బొరయకయుండం
గనెదిరిబోధించుటయు౯। నరసముదయంబుఁగడెడు। చరిత
ముశీలమునకంగసంపదవత్సా ॥ శాంతి। ఆ ౩। పు ౫౩.

౫౭౨. క ॥ బలసిమనోవాక్కాయం । బులదోషాభావము ఖిలభూతములయెడం । గలిమివినుశీలమదిమే । లొలయించు నుదానసుల్లమున్నుముపుత్రా ॥ శాంతి । ఆ ౩ । పు ౫౩.

౫౭౩. మ ॥ అనయంబుఁ శమవంతుఁడై వినుత । శిష్టాచార మార్గంబులఁ । జనుపుణ్యాత్ముఁడుదుర్గతుల్గడచి ప్రజ్ఞాహార్మ్యస్థ సంరూఢుఁడై । కనుచుండుఁ బటుమోహపంకజలమగ్నంబైనలో కంబుపెం । కనధోభాగమునందుడిందికడుదుఃఖంబొందగానవ్వ చుఁ ॥ ఆర । ఆ ౫ । పు ౯౨.

---

# ౨౭ - శాంతి.

౫౭౪. క ॥ వైరాగ్యంబుప్రశాంతికిఁ । గారణముప్రశాంతిముక్తిగనుమోక్షానం । దారాముజరామృత్యువు । లేరూపునఁ జేరనేరవిష్ణుచరిత్రా ॥ అను । ఆ ౪ । పు ౮౪.

౫౭౫. క ॥ వినుతెవ్వులుడుపఁగభేషజ । మునకుందలఁకొనిన చందమునమదిసత్యం । బునుశౌచముశమమునుదమ । మునునెలకొలుపంగవలయుమోహచ్యుతికిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౫౭౬. క ॥ విధివశమునవచ్చినకీ । డథములుగానియ్యాడి వెడఁగులైవిపులభవాం । బుధిమునుఁగుదురుమునుంగరు । సథ్యులగునుత్తములుప్రశాంతిఁజులవనఁ ॥ అను । ఆ ౧ । పు ౧.

౫౭౭. క ॥ ఏవిధమునదుర్దశకును । భూవర ధైర్యంబుమం
దుభూరిస్మృతిమెయిం । జేవగలుగుదృఢనిశ్చయ । భావమునె
వ్వగలతోడఁబడదేభంగిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౬.

౫౭౮. క ॥ అవమానమునకుఁదృష్టిం । డపునమృతముద్రా
వినట్లయంచితసన్మా । నవిధికినుద్వేగముఁబొం । దువిషంబును
బోలెశమరతుఁడుమునినాథా ॥ శాంతి । ఆ ౫ । పు ౭౯.

౫౭౯. క ॥ ధనములుబంధులుభోగము । లనియెడునస్థిర
ములెల్లనాత్మకెరవుచే । సినశాంతియులవడునుమన । మునశాం
తిశ్రీసమృద్ధిమోక్షమునిచ్చున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౩.

## ౨౯ - క్షమ.

౫౮౦. క॥క్షమయునుదమమునుసత్యము।నమేయమహిమా
స్పదంబులనవిందునుధ।ర్మములందెల్లనునభిమ। ర్ణములవిహ్వాప్రగ్రిం
ధిభేదనప్రౌఢంబుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౫౮౧. క ॥ క్షమయునుసత్యంబునుశౌచ । మునుసుధర్మ
ములుబ్రహ్మచర్యంబన్య । త్తమధర్మమువానికిఁజి । త్తమునలవ
ఋషంగవలఁయుధైర్యముపేర్మిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౫౮౨. క ॥ క్షమగలవానికిఁబృథ్వి । సమునకునిత్యంబువిజ
యసంసిద్ధియగున్ ।క్షమియయినవానిభుజవి।క్రమముకడున్వేల
యుసర్వకార్యక్షమమై ॥ అర । ఆ ౧ । పు ౧౩.

౫౮౩. క ॥ క్షమియించువారిఁగనిచా । లమివెట్టుదుష్టులైన నుందలంపననూన । క్షమయకడు మెఱయుతోడవు । క్షమరూపముగోరువారు చాల్తురుదానిన్ ॥ ఉద్యో । ఆ ౨ । పు ౨౦.

---

# ౩౦ - దమము.

౫౮౪. క ॥ దమమునఁగర్మేంద్రియముల । శమియింపఁగఁ జేఁతయదినిసర్గగుణంబై । రమియించునెపురుషునిచి । త్తము దానతండు సర్వధర్మకరుఁడగున్ ॥ శాంతి । ఆ ౫। పు ౧౧౦.

౫౮౫. గీ ॥ సర్వవర్ణాశ్రమములకుశమముదమము । గలిగియునికివిశిష్టప్రకారమగుట । బ్రాహ్మణునకువిశేషించిరాజవర్య । దమసమాహితవృత్తి పెద్దయునువలయు ॥ శాంతి । ఆ ४। పు ౭४.

౫౮౬. సీ ॥ శౌచమక్రోధంబుసంతోషమార్జవమనసూయవిగతదైన్యప్రవృత్తియప్రమాదంబుదురభిమానరాహిత్యమతివాదవర్జనమఖిలభూత । దయగురుపూజనిందాస్తుతిప్రవణతాత్యాగంబపైశునత్వంబుసాధు । జనసంగమంబమృషాభిభాషణమునిస్పృహతయహింసనుశీలభావ ॥ గీ ॥ మింద్రియగ్రామజయమివియెల్లదమము । నాకృతులువీనిఁగలపుణ్యుఁడభయుఁడైపిహ । కములవలననునాముష్మికములవలన । శాంతిమంగళనిధిబోధసౌఖ్యమూర్తి ॥ శాంతి । ఆ ४। పు ౭४.

౫౮౭. క ॥ శీలంబుమైత్రికరుణయ । లోలుపభావమునితితి
క్షలోనగుమునిలో । కాలంబనమగుసద్గుణ । జాలంబుదమంబు
రూపసంపదయధిపా ॥ శాంతి । ఆ ౩ । పు ౬౪.

౫౮౮. క ॥ దమముంగడచినసద్ధ । ర్మములేదనివిందునాశ్ర
మములన్నిటికిన్ । దమవంతుఁడుకామముఁగ్రో । ధములోభ
ముమత్సరంబుదర్పముగెల్చున్ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౪.

౫౮౯. గీ ॥ దమమునిశ్రేయసముఁబుణ్యతమముధర్మ । సా
వమదివెలిగాధర్మసంచయంబు । సిద్ధిఁబొందునదమముతోఁబుద్ధి
పొందు । గనినఁబొందనియున్నతుల్ గలవెయధిప ॥ శాంతి ।
ఆ ౩ । పు ౬౪.

౫౯౦. క ॥ తమతమకలవడువిజ్ఞా । నము తెరువుననాదరిం
చినానాగతులన్ । సుమతులుధర్మముదెలిపిరి । దమముపరాయ
ణముధీరతమయిన్నిటికిన్ ॥ శాంతి । ఆ ౩ । పు ౬౪.

౫౯౧. క ॥ గుహాయందునియతిననియెడు । మహనీయ
బ్రంహపదమునుహితదమతోన్ । పహితుండగువానికిస । న్ని
హితంబనిచెప్పుదురుమనీషిజనంబుల్ ॥ శాంతి।ఆ ౩। పు ౬౪.

## ౩౧ - అహింస.

౫౯౨. క ॥ జననీజనకారాధన । మునగురుభక్తినిసువృత్త
మునశాంతినిధాం । తినిసత్యముననహింసను । వినుకాంతుడు
మోక్షపదము వేట్వెలిజనుల్ ॥ శాంతి। ఆ ౬ । పు ౧౩౯.

౫౯౩. గీ ॥ దంతియడుగులోనఁదక్కినజంతుచ । యంబున డుగులెల్లనడఁగియుండు । నట్లధర్మకోటులన్ని యులోనగు । నిష్ఠ గుణయహింసకింతనిజము ॥ అను । ఆ ౪ । పు ౬౭.

౫౯౪. గీ ॥ జంతుపదములెల్లదంతిపదంబులో । నడఁగు క్రియనహింసయందుసకల । ధర్మములునడంగుఁగర్మసంత్యాగికి । నైనభూతదయసమర్థగుణము ॥ శాంతి । ఆ ౫ । పు ౯౩.

౫౯౫. క ॥ విమలాత్మయహింసఁయుదా । నమసత్యముఁ గ్రోధవర్జనంబునువినుము । త్తమధర్మరాశియిదిధ । ర్మమునకుఁ బరసీమదీనిమరుపునుమదికిఁ ॥ అను । ఆ ౫ । పు ౯౪.

౫౯౬. గీ ॥ దానమునుదపంబుధర్మంబుయజ్ఞంబు । శౌచ మంత్రతంత్రసత్యములును । బుధులహింసరూపములుగాఁగఁజె ప్పుట । యెల్లకల్మిసూక్ష్మహింసకలిమి ॥ అను । ఆ ౪ । పు ౬౮.

౫౯౭. గీ ॥ శమముదమములేమిజనులకుహింసనెు । నర్చుఁ గానధరణినాథవినుమ । హింసశమదమములుహృదయంబునకు నెప్పు । దలవడంగఁజేతఁయంద్రుమునులు ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౫౯౮. గీ॥ సర్వభూతదయయుసత్యవాక్యమునకు । నుత్తమం బుధర్మవాండెఱుంగ । నెురులనొప్పికోడకుపతాపమొనరించు । నదియకడునధర్మమనిరిమునులు ॥ ఆది । ఆ ౪ । పు ౪౦.

౫౯౯. క ॥ వినపశుహింసాకృతయా । గనిరూఢునిధర్మప రునిగావేదంబు । లొక్కనియాజ్ఞెడుసముచితహిం । సనమరయ నహింసగానజగతీనాథా ॥ శాంతి । ఆ ౧ । పు ౭.

౬౦౦. గీ ॥ విధివశంబునమృతిఁబొందువివిధజంతు। నిచయ మందనహంకారనిష్ఠుఁడైన । పురుషుఁగల్మషమేమియుఁబొందనేర । చెట్టులంజేనివినుమఁడియేర్పరింతు ॥ అను।ఆ ౫।పు ౭౭.

౬౦౧. సీ ॥ దివియలోఁబశుపుర్వ్యాదివియమొత్తినవారిఁబాపంబువొందునేయోపిదున్న । నాగంటిమొనఁజచ్చునానావిధప్రాణులన్నరుఁబొందునే యఘమువారు । తమపనులేస్రియవిధాతృవశమునఁనాయువుదెగినట్టిజంతువులుసచ్చు । నేముచంపితిమనీయించుకేనియునహంకారంబువారికిఁగలుగదట్లు ॥ గీ ॥ గానఁజూవెవారిఁగల్మషమొందదు । పుణ్యపాపములకుబుద్ధిమూల। మనిశివుండుమఱియునునహింసస్రాలున । య్యధికధర్మమైనవిధమువినుము ॥ అను । ఆ ౫ । పు ౭౭.

౬౦౨. క ॥ శ్రుతివిహితహింసఖంసా । గతిఁదలఁపఁగరాదునునినికాయంబిదిదు। ష్కృతతతిఁబాపెడుపరమను । కృతతామనికొనియాడుఁగానగీర్వాణను ॥ అను । ఆ ౫।పు ౭౮.

౬౦౩. సీ ॥ సకలధర్మములలోసర్వభూతాహింసమేటియహింసాసమేతుఁడైన । వానికినుత్తమజ్ఞానోదయంబగునదిమోక్షమొనరించునఘులార। కోరికమెయిగర్మకారియయ్యెడువాఁడువొందుగతాగతంబులఫలాభి । లాషంబులేకనిర్దోషతమేలాచరించినముక్తిసిద్ధించువినుఁడు ॥ గీ ॥ విషయపురుషుండుసత్యంబువిషయమెట్లు । భోక్తృభోజ్యత్వసంబంధమునఁబొసంగి ।యుండియును । బద్మపత్రపయోలవంబు । కరణినతఁడుతత్సంగంబుఁబొరయకుండు ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౨.

౬౦౪. క ॥ సమదర్శిత్వమెయఖిలభూ । తములనుదనయట్ల కాఁగఁదలఁచునెవ్వం । డమలన్యాయపరుండగు । సమరుల తనివందనీయుఁడం(డు)నరేంద్రా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౮.

# ౩౨ - సత్యము.

౬౦౫. క ॥ క్షమయునహింసయుసత్యము । సమతయునిం ద్రియజయంబుశమముఁబరిశౌ । చముసుదపోలక్షణములు క్రమముననిన్నియునుసూర్ధ్వగతికారణముల్ ॥ అర । ఆ ౬ పు ౧౨౧.

౬౦౬. క ॥ సత్యక్షమాదమంబులు। నిత్యపదంబునకునెక్కు నిచ్చెనలవిసం । గత్యనుగతములుసత్త్వాం। గత్యముగాఁబునసుము ఖ్యకార్యముసుండీ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౬౦౭. క ॥ సమతయుదమముఁదితిక్షయు । సమత్సరతయు హ్రీయుధృతియుననసూయార్య । త్వములునహింసాదాన ।క్ష మాత్యజనసూనృతములుసత్యముమూర్తుల్ ॥ శాంతి । ఆ ౩। పు ౬౪.

౬౦౮. క ॥ సత్యమతపముసుయజ్ఞము।సత్యమనేదంబుదాం తిశాంతులునగుటన్ । సత్యముదొలఁగిననిర్మల । నిత్యానుష్ఠాన ములునునిష్ఫలములగున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౫.

౬౦౯. క ॥ సత్యమధర్మముదపమును । సత్యము ప్రజలను సృజించుసత్యమలోక । స్థిత్యాదానముఁజేయును । సత్యంబన్నృత్యంబుచేతసంపిహితమగుక్ ॥ శాంతి । ఆ ౪। పు ౭౩.

౬౧౦. క ॥ సత్యంబునహింసయునను। సత్యుత్తమధర్మయుగళమందునహింసక్ । సత్యముగాచుటధర్మము। సత్యమునసహింసగావఁజనునంద్రుబుధుల్ ॥ కర్ణ । ఆ ౩ । పు ౪౫.

౬౧౧. సీ॥ సత్యంబువలుకుటసర్వధర్మములకుమిక్కిలియన్నృతంబుమేటిపాత । కముతద్విశేషంబుగలదుచెప్పెదనొరునర్థంబులెప్పుడునపహరింప । జూచుపాతకులతోనూన్నృతంబాడుటపాపముల్ బొంకులువలికియట్టి । వారిహింసించుటవరధర్మమొకఁడిదియేలభూతములకుహితముసేయు ॥ గీ ॥ బొంకులెల్లనుధర్మముల్ భూతబాధ । కములునిక్కములగుపాతకములువినుము । భూతములదుష్టశిష్టత్వములువివేక । సూక్ష్మతావేద్యములువానిఁజూడవలయు ॥ శాంతి । ఆ ౩ । పు ౪౯.

౬౧౨. ఉ ॥ భూతహితంబుగాఁబలుకుబొంకునుసత్యఫలంబునిచ్చుఁద । దూ్భతభయాస్పదంబగుప్రభూతపుసత్యముబొంకునట్లప్రా । ణాతురుఁడైనచోఁబరిణయంబులయందునుబల్కుబొంకున । త్యాతిశయంబయంద్రుమహాత్మకయిట్టివిధర్మసూక్ష్మముల్ ॥ ఆర । ఆ ౫ । పు ౯౩.

౬౧౩. గీ ॥ వినుమహింసధర్మవితతికెల్లనుమేటి । యదియుసత్యయుక్తమైనవెలయు । ననఘశిష్టచరితలందుసత్యముకడు। నధికమనిశ్రుతులనరసిబుధులు ॥ ఆర । ఆ ౫ । పు ౯౨.

౬౧౪. చ॥ నుతజలపూరితంబులగునూతులునూఱిటికంటె
సూనృత। వ్రతయొకబావిమేలుమఱిబావులునూఱిటికంటెనొక్క
స। త్క్రతువదిమేలుతత్క్రతుశతంబునకంటెసుతుండుమేలుత।
త్సుతశతకంబుకంటెనొకసూనృత వాక్యముమేలుచూడఁగన్ ॥
ఆది। ఆ ౪। పు ౪౫.

౬౧౫. గీ॥ సర్వతీర్థాభిగమనంబుసర్వవేద। సమధిగమము
సత్యంబుతోసరియుఁగావు। ఎఱుఁగుమెల్లధర్మంబులకెందుపెద్ద।
యండ్రుసత్యంబుధర్మజ్ఞులైనమునులు॥ ఆది।ఆ ౪। పు ౪౯.

౬౧౬. చ॥ కుదురుసమస్తధర్మములకున్నిసత్యముయోగ
మోక్షస। త్పదములుసత్యకార్యములుపాపమసత్యముకన్న
నెండులే। దుదలఁపనశ్వమేధములుదొమ్మిదినూఱులువెండినూ
ఱున్నై। యొదవిననీడుగావుభరతోత్తమసత్యముతోడనారయన్॥
శాంతి। ఆ ౩। పు ౬౪.

౬౧౭. గీ॥ వాజిమేధముల్వేయొక్కవలనుపెట్టి। యలఘు
సత్యంబుతక్కటివలనియందు। నిల్పితులఁదూన్పఁగాసత్యనిష్ఠ
లోని।యర్థమునకెత్తువచ్చెనయ్యధ్వరములు॥అను।ఆ ౨।పు ౨౧.

౬౧౮. క॥ వెలయంగనశ్వమేధం। బులువేయునునొక్కస
త్యమునునిరుగడలం। దులనిడితూఁపఁగసత్యము। వలననుము
లుసూపుగౌరవంబునపేర్మిన్ ॥ ఆది। ఆ ౪। పు ౪౯.

౬౧౯. క॥ దివికింజనినను నెవ్వని। వివిధగుణములఖిలజ
నులువినుతింతురువాఁ। డవనీశ్వరసత్పురుషుం। డవుననికయి
కొండ్రుబుద్ధినార్యజనులిలన్ ॥ శాంతి। ఆ ౧। పు ౧౧.

౬౨౦. క॥ తనులోకము గొనియాడఁగ । విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడుమేలొనరించుఁ గీడొకించుక । యును దనదెసఁ దోఁపనీక యుడుగుచు వచ్చున్ ॥ ఉద్యో। ఆ ౨। పు ౨౦.

౬౨౧. క॥ సత్త్వాకృతులగు గుణములు । నిత్యానుష్ఠిత సమగ్ర నిర్మలయోగ । స్థిత్యభిముఖునకు సులభము । లత్యంత సుఖప్రదంబుల వికార్యంబుల్ ॥ శాంతి। ఆ ౩। పు ౬౮.

౬౨౨. క॥ అమృతము మృత్యువు ననస । త్యము మోహము గా నెఱుఁగు మహాత్మకయ సత్యమున నమృత్యువు గెల్చెద । సమ సుఖదుఃఖుండనగుచు శాంతిపరుఁడనై ॥ శాంతి। ఆ ౪। పు ౭౦.

౬౨౩. చ॥ అనఘుఁడు సాత్త్వికుండగు మహాత్ముఁడు బోధనిరూఢిఁ దత్త్వముల్ । గనుఁగొని లోకవృత్తములు గావని రోసి సమస్త సంగభం। గనిరతుఁడై తొలంగు మమకార వికార మహంక్రియాచ్యుతిన్ । బనుపడి సంయమప్రకటభావన నుత్తమ శాంతి గైకొనున్ ॥ ఆర। ఆ ౫। పు ౯౫.

## ౩౩ - స్వర్గము.

౬౨౪. క॥ ఈలోకమునకు మీఁదై । చాలఁగ వెలుఁగొందుచుండు స్వర్గలోకమునా । నాలంకారయుతము దివ్యాలోకము దేవయానమది మునినాథా ॥ ఆర। ఆ ౬। పు ౧౨౨.

౬౨౪. క ॥ ఇదికర్మభూమిభోగా । స్పదమాలోకంబుధర్మ
పరులకుసులభం । బదిసత్యశౌచసౌజ । న్యదయాదులుతేనివా
రి క్రప్రాప్యమగుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౬౨౫. గీ ॥ ఇందుఁజేసినపుణ్యంబునందుఁగుడుచుఁ । గాని
మర్త్యనకందుండికడఁగిపుణ్య । మాచరింపంగలేదుపుణ్యావసా
న। మగుడునవనికత్రోతురుమగుడనతని॥ ఆర। ఆ ౬।పు ౧౨౨.

౬౨౬. క ॥ ఈలోకముదుఃఖబహుళ । మాలోకముభూ
రిసుఖనిరంతరమందే । జాలియునులేకయుందురు। తోతెస్సుగఁ
బొందియుండుదురుజనులనఘా ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౬౨౭. గీ ॥ హస్తిమశకాంతరముగలదరసిచూడ। హాసగృ
హశయనాసనవసనగంధమాల్యతూర్యత్రయారామమానినీజ ।
నాదిసుఖసాధనములకునందునిందు ॥ శాంతి । ఆ ౪। పు ౭౪.

౬౨౯. చ ॥ మనుష్యులుధాతలున్నసమానుగనుండుదు
రందులోభమును । గినుకయుఁదాపముంబగయుఁగిల్బిషముఁ
ఘనదుఃఖవైకృతం । బునుజనియింపవీభువనముద్దెగునప్పుడునా
శమొందద । వ్వినుతపదంబుదానియెడవేడుకసేయుదురింద్రము
ఖ్యులుఁ ॥ ఆర । ఆ ౬ । పు ౧౨౨.

౬౩౦. గీ ॥ అనఘయింద్రలోకమునకంటెమీఁదని । శ్లో
కమగుచుబ్రహ్మలోకమమరు । నదియనన్యదీప్తసదనమైతనదైన
వెలుఁగునను జగంబువెలుఁగఁజేయు ॥ ఆర । ఆ ౬ । పు ౧౨౨.

౬౩౧. చ॥ అమలతపోనివాసులుమహాధ్వరశీలురుసత్యసంధులు । త్తములుజితేంద్రియుల్సములుధ్యానపరు ల్రణశూరులందుహా । క్షమునవసింతురప్సరలుసాధ్యులుదేవమునుల్మరుద్వసుప్రముఖులువేఱువేఱతగుపట్టులనుండుదురందునిమ్ములన్ ॥ ఆర। ఆ ౬ ।పు ౧౨౨.

౬౩౨. సీ॥ పుణ్యంబులును బాపములు రెండుఁ జోకలై యుండుఁ బుణ్యంబుల నొదవు నాక । సుఖము పాపంబులఁ జొప్పడు నరక దుఃఖము విను మున్ను నాకంబు సుఖము । ననుభవించినయట్టియతేఁడు పదంపడి యధికనారకపీడ ననుభవించు । మున్ను నరకదుఃఖమునఁ బడ్డవాఁడనంతరము నాకమునఁ దాఁ బొరయుసౌఖ్య ॥ గీ ॥ మల్పపుణ్యుఁడు తొలి తొలియమరతాను । ఖంబుగైకొని మఱియు దుఃఖముల నొందు । భూరిపుణ్యుఁడు మును మును ఘోరనిరయ । యాతనల నొంది వెండి సౌఖ్యముల నొందు ॥ స్వర్గా । ఆ ౧ । పు ౨౧.

## ౩౪ - సూర్యప్రభావము.

౬౩౩. సీ ॥ ఆశ్చర్యముల కెల్లనాస్పదమాదిత్యుఁడాతని వలన నన భూతజాల । మఖిలంబు జరియించు నది యచ్చెరువు గా దెయ్యది దేవుననంశువులందుఁ బ్రీతి । నమరులు వాలఖిల్యాదిమునీంద్రులు సిద్ధులు శాఖలఁ జెంది యుండు । విహగకులంబులవిధమున వసియింతు రంతకంటెను నెక్కుడద్భుతంబు ॥ గీ॥ గలదె యమ్మహాత్ము వలన నవా

యుపు । వెడలియతనినడిమివిపులరశ్మిఁ । బొందివృష్టిగురియు
నెందునునట్టిచో । ద్యములుగలవైభానుశాగ్రగణ్య ॥ శాంతి।
ఆ ౬ । పు ౧౮౧.

౬౩౪. క ॥ రవిసృజియించునువర్షము । రవియమగుడఁగిర
ణాతతులరసమంతయుఁడాఁ । డివుచునువిస్మయకారక । మవనీ
సురవర్యదానికధికముగలదే ॥ శాంతి । ఆ ౬ । పు ౧౮౧.

౬౩౫. క ॥ ఇనువేఁడిమిశోషించిన । జనములయందాత్మని
ష్ఠశాశ్వతికత్వం । బునవెలుఁగుచుండుదానికి। ననఘామిగులం
గఁజిత్రమైనదిగలదే ॥ శాంతి । ఆ ౬ । పు ౧౮౧.

౬౩౬. గీ ॥ సూర్యువలననబీజంబుధార్యమాణ । మగుఁజ
రాచరధారిణియైనధరణి । చేతనంతకుమిగులఁజర్చింపనక్క । జం
బులెందునుగలవెనిష్ఠానిరూఢ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౮౧.

౬౩౭. క ॥ పరముండునిరంజనుఁడ । క్షరుఁడజరుండద్వ
యుండుశాశ్వతుఁడగున । ప్పురుషుఁడురవియందవెలుఁగు। నరు
దంతటికంటెఁగలదెయగ్రిమవర్ణా ॥ శాంతి । ఆ ౬। పు ౧౮౧.

౬౩౮. లయగ్రాహి॥ వారిరుహమిత్రునమరోరగమునిద్యు
చరచారణగణప్రణుత చారుగుణుఁలోకా । ధారునఖిలశ్రుతిశే
ఖరుహరిశంకరసరోరుహభవప్రతిముదారుణతమిస్రా । ధారణ
మరీచిపరిపూరితదిగంతరునిభూరికరుణానిరతుసూరుఁద్రిజగద్ర ।
క్షారుణసహస్రకరుఁగోరిభజియింపుముమనోరథఫలంబులగుభూ
రమణసీకుఁ ॥ ఆర । ఆ ౧ । పు ౩.

# ౪. నివృత్తిప్రకరణము.

## ౧- విరక్తి.

౧. సీ ॥ వినుమోహబీజసంజనితంబుగామ ద్రుమంబుప్రమాదజలంబుదనరుఁ । బరిషేచనంబుగఁబెరుగునజ్ఞానస్థిరాపాదకలితమైయందనూయ । పత్రసంపదయతిచిత్రతరంబుమానస్కంధదృఢతనున్నతివహించు । శోకశాఖంబుననేకచింతోపశాఖంబుఁబురాకృతకర్మసార॥ గీ॥ ఘనముతృష్ణాలతాపరిగతమునగుచుఁ। బొలుచుఁదత్ఫలములకులుబ్ధులుగడంగి । ప్రాఁకిపడుదురువిడుపుశస్త్రిముగనదివి। ఖండితముచేసిబుధుఁడుదుఃఖములఁదొరఁగు ॥శాంతి। ఆ ౫ । పు ౯౫.

౨. క ॥ మాయారహితుఁడహంకా । రాయత్తతఁజూవెపుట్టువనుచెఱఁబడినా । నాయాసంబులఁబడునా । జ్ఞాయుతుఁడైమాత్ముఁడింతచర్చింపుమదిక్ ॥ అను । ఆ ౫ । పు ౨౧.

౩. క ॥ భూతంబుఁలబచరించుచు । భూతాత్ముఁడువానిఁబనవిభూతినడంచున్ । భూతాహారణంబునిజ । ద్యోతనముదదీయవృత్తిదుర్దశపుత్రా ॥ శాంతి । ఆ ౫ । పు ౯౪.

౪. చ ॥ తలఁపఁగనాయువింతియకదాయనిసౌఖ్యముదుఃఖముంబొరిం । గలుగవెకాలవృత్తిననికర్మములిట్లనివేదబోధనం ।

బులుబహుభంగులిట్టివనిబుద్ధికిసత్త్వరజస్తమోగుణం । బులకుఁ
బ్రవర్తనంబులివిపొమ్మనికాంచుటచాలమేలగుఁ ॥ శాంతి।ఆ ౫।
పు ౧౧౨.

౫. క ॥ శారీరమానసమహా । దారుణదుఃఖములఁ జేసితఱి
గిశరీరుల్ । క్రూరతబాధలఁబొందుదు। రారెంటిని జెఱుచుతురా
ర్యులమలినబుద్ధిఁ ॥ అర । ఆ ౧ । పు ౨.

౬. క ॥ శారీరమానసములగు । నీరెండువిధములుదన్ను
నేపకయుండం । గోరికొనినియమములఁ బ్రతి । కారములొనరిం
పఁగాసుఖంబొందునరుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౩.

౭. క ॥ బలయుజరావ్యాధిప్రభ్రు । తులు శారీరములుగాథ
తోషకశోకా । దులుమానసములుదుఃఖం । బులు రెండువిధము
లనిట్లుపురుషులనలఁచుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౩.

౮. ఉ ॥ మేఖునసంతసిల్లునెడమేకొనిమాపదపొందునాప
దం । దూలఁగఁబూనిసౌఖ్యములుదోఁచుఁగృత్యంబులుదప్పవె
మ్మియుఁ । బోల్లఁగనింతయుంగనిప్రబుద్ధమనస్కులు ఖేదమోద
ని । ష్కాలితధైర్యసాగరులుగానసుఖంతురుసర్వకాలముఁ ॥
అర । ఆ ౫। పు ౧౦౯.

౯. క ॥ వినువిధికృత్యములూరక । కనుఁగొనుచుమసిద్ధ
సిద్ధికల్పితసుఖదుః । ఖనిరూఢిఁబొందకుండఁగ । మనముదొలం
గించువెరవుమహనీయమగుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౧౦. క॥ వినుదుఃఖంబులదిగఁద్రో । చినపురుషుఁడు సౌఖ్యసక్తచిత్తుఁడుగాఁగా । దిన్నివైరాగ్యముఁ జెందిన । ననుపమమగు పరమపదమున న్మెయిఁ జేర్చుఁగా ॥ శాంతి । ఆ ౪ । పు ౭౩.

౧౧. క॥ కోరికలకుఁ జోరకయసం । గారూఢతగలిగియెల్లయందును సమతం । గూరినచిత్తంబులుగల । సాక్షాత్మకులీపదంబుఁ జనుటకు శక్తుల్ ॥ అశ్వ । ఆ౨ । పు ౨౪.

౧౨. క॥ మానుషముదుర్లభముసో । పానంబగునదివిముక్తిపథముగనుటకుఁ । దానిగనితొంటిచందము । శానీకసముద్యమమునఁ బ్రాఁకఁగవలదే ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౧౩. క॥ సురువున నెనరించినపం । జరంబులోనున్న పులుఁగుచాడ్పున మేనం । బురుషవరజీవముండుట । పరికింపక యేమరంగ బాడియె నీకుఁ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౧౪. క॥ కామాదిత్రృష్ణుఁ డైనరుఁ । డేమరియుండంగ గోరియనెత్తెడు పులియు । ద్దామతమృత్యువు గొనిచను । నామూఢుని యట్లగా కుమతులవివేకా॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౧౫. గీ॥ ఎన్ని కొనుచుండఁ జనుచుండు నేడులివ్వి । థమున నాయువు దోఁప్తోడఁదరుగు జీవ । హానిపాటిల్లఁగాఁ బుత్రయనవధాన । నిద్రమోహితుఁడై యున్కి నీకుఁదగునే॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౧౬. క॥ ఇంతకుమునుఁ జూచితినతఁ । డెంతయు నెప్పుఁగొనియుండె నిదిగడు చిత్రం । బెంత వెసఁ జచ్చెనని తనుచింతంపఁడు జనుఁడు మూఢచిత్తత్వమునన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౧౭౭.

౧౭. గీ ॥ తనకుఁ దానకలఁడు జననంబునప్పుడు । మరణమును ననుసుగతినరకములను । దల్లిదండ్రిడిదక్కనెల్లబంధులుశరీ । రంబుననుగమించిరక్ష్మరుదురు ॥ అను । ఆ ౪ । పు ౬౬.

౧౮. గీ ॥ తానుదెగునేనిబాంధవదారపుత్ర । మిత్రులనునజ్జనంబునేమిటికివిగత । చిత్తుఁడైగుహఁసొచ్చి నిశ్చింతబుద్ధిఁ । దడవికానంగవలవదేతన్నుఁ దాన ॥ శాంతి । ఆ ౬ । పు ౧౭౪.

౧౯. గీ ॥ అస్మశానగమనులంతియచుట్టంబు । లగ్నిఁ గలపిమరులునఖిలమైన । జ్ఞాతిజనమదీనిఁ జర్చింపకందఱు । యందుమమతఁ బెనుచునజ్ఞుఁ డనఘ ॥ శాంతి । ఆ ౬ । పు౧౭౪.

౨౦. గీ ॥ యౌవనంబునురూపంబుజీవితంబు । ద్రవ్యసంచయములునిత్యములుగావె । వీనిహానికివగపవివేకమగుటఁ । బండితులువగఁగూరరుపౌరవేంద్రా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౭.

౨౧. క ॥ దారాపేక్షంగష్ట । ప్రారంభముఁబూనియిహమునందుఁ బరమున । న్వారనిసంక్లేశంబులఁ । గూరునరుఁడుధానిఁ జేరఁగొనకొండ్రెబుధుల్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౭౪.

౨౨. క ॥ మిత్రులుభార్యలుభ్రాతలుఁ । బుత్రులునిజకార్యపరులుబోధముసుమ్మా । త్మత్రాణమునకుమూలము । ధాత్రీపతివర్యయెవ్విధంబునఁ జూడన్ ॥ శాంతి । ఆ౫ । పు ౧౧౦.

౨౩. గీ ॥ వరదఁ గొట్టముల్లూడినవడుపుబంధు । సంగమంబువిహాసినచాడ్పుతద్వి । యోగమింతసూచినవానికుమ్మలికము । వారయనేరదుదానవవరతనూజ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౨౪. క॥ కదియుంగాష్ఠముకాష్ఠము । నదిలో మఱిగొంతసే
పునకుంబోయునునే । స్తుదినట్లుగఁదలంపఁగవల । వచెపితృపుత్త్రా
దిబంధువర్గమునధిపా ॥ శాంతి । ఆ ౪ । పు ౬౯.

౨౫. క॥ క్షయవృద్ధులఁజంద్రుఁడున । భ్రియులోనుగఁబొం
దుచుండఁదెలియఁడుబంధు । క్షయమునఁగవగచునజ్ఞుం । డయ
మహిఁతాదీనినెఱుఁగుటమలఁతఁదెచ్చ్చ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౨.

౨౬. క॥ వినుదారపుత్త్రమిత్త్రులు । చనిరిక్కోడుకమున్నుచ
నినజన్మంబులనీ । కునువారువారలకునీ । వునుమఱుపుట్టువునఁగో
రయపుట గల్గెనొకో ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౨౭. గీ॥ మాతృపితృదారపుత్త్రకభ్రాతృశతస । హస్రకం
బులుసంసృతిననుభవింపఁ । బడియెనందులోనెవ్వరికడఁలుపాఁడు
నరుఁడనిత్యతయూహించుటరయనుఱువు॥ శాంతి । ఆ ౧ । పు ౧౨.

౨౮. క॥ అనిమిత్తముభూతంబుల । జననంబవిరూపునెడు
టసంపన్నములై । యునికివిషాదముమోదం । బునుజేయఁగలేవ
నిత్యములుగనెఱిఁగినక ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౨౯. గీ॥ వగతుమన్న నెవ్వారికివగవఁజనదు । చిత్తమున
నేమిటికిసంతసింపరాదు । కానగతమునందుననాగతమునందు । వ
గవరాప్యులుసంతోషవంతులగుచు ॥ ఆర । ఆ ౫ । పు ౯౭.

౩౦. క॥ వగచినఁబోయినకార్యము । మగుడునెవగవంగలో
కమాన్యుండగునే । వగపుణ్యగతికిమూలమె । వగపెల్లవిధముల
నుడుగవలయునరేంద్రా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨.

౩౧. క ॥ వగపునఁ దేజోహీనుం । డగునాత్మహితక్రియలకు నశక్తుం డగున । వ్వగపుడఁ జిగిఁ యుద్యోగము । దగఁ జేయఁగ గలుగునంచితములగు శుభముల్ ॥ అర । ఆ ౫ । పు ౯౬.

౩౨. ఉ ॥ శ్రావ్యనవ్యగల్వీడువుగైకొనుమాత్మకులార్హకర్షసం । సేవనతత్పరత్వమువిశిష్టజనంబులసంగతిన్ భవ । ద్భావముకల్మషంబు దెగఁ బాచిశుచిత్వముఁ బొందులోకసం । భావితవృత్తిన య్యెడునృపాలకనాపలుకూఁదుపాడిగన్ ॥ శాంతి । ఆ ౧। పు ౧౨.

౩౩. క ॥ దివమును రాత్రియు నుంబోరిఁ। బ్రవర్తనముఁ బొందుచుంపుపగిదినిసుఖసం । భవదుఃఖజననములుజం । తువులకు నుంగలవు వలదు దురటిల్లంగన్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౧.

౩౪. గీ ॥ పొదలుఁ దరుగుట కైపొడవెడుగుఁ బడుట । కైకడుం జేరుఁ బాయుటకై జనించుఁ । బోలియుటఁకున్నై సుఖంబును బొందుదుఃఖ । ముందుటకునైపదార్థములఖిలములును ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౧.

౩౫. క ॥ పెరుగుటప్రస్గ్గఁ గఁ జవులం । బొరయుటయరుచంబుగాఁగఁ బుట్టుటసావం । బెరయుటపాయఁ బదార్థ । త్కారములన్నైజమదియొత్తుదప్పింపనగున్ ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨.

౩౬. సీ ॥ ఒకయింటనుండి వేఱొకయింటికరిగినవిధమును వస్త్రంబువిడిచియొండు । వస్త్రంబుగట్టినపడువును నైయుండు నుడలుదొఱంగియొండొక్కయొడలు । గైకొంటన్నృపవినుకడ

వతుసారైపైనమరమ్ము త్తికయిడునపుడువిరియు। టయువెగపారఁ
బట్టఁగరాకచెమటయువానియెత్తైడునెవడయ్యుటయును ॥గీ॥నె
త్తురమొకచోటడించిననెడలుటయును । నెండియవియుటయునునా
వమిడినఁబగిలి । పోవుటయువాడుజనులచేఁబొలియుటయును ।
గలుగుగతిమేనికెట్లునుగలుగుఁజేటు ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨

౩౭. క ॥ తనయొడలెరవనినినుమను । జనకునుబంధుతతిసత
మెశ్శోకించినవ । చ్చునెచచ్చినజంతువునె । మ్మనమధికమునె
చ్చుగాకమహితవిచారా ॥ శాంతి । ఆ౧ । పు ౧౨.

౩౮. గీ ॥ అరయవచ్చినఁదనమేనునెరవతనకు । నెండుఁరూ
పులుదక్కకయునికియరుదె। యనుతలంపుధ్రువంబుగనలవరించి।
బుధజనంబులుశోకంబుఁబొరయరధిపా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨.

౩౯. క ॥ భూతములనిత్యములునీ । వీతెరువెప్పుడునువిడు
మహీనధృతిమెయిం । జేతోగతినలవఱుపుము । భూతానిత్య
త్వమదియపుచ్చునువగలన్ ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౪.

౪౦. క ॥ ఆరయఁగదళీగర్భా । సారముసంసారమిట్టిచంద
మెఱిఁగినం । జేరవుజననమరణములు । గారించునుదీనిభంగిగా
నకయున్నన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౪౧. గీ ॥ అడవిఁజొచ్చియంతకంతకునవులకు । నతికుతూ
హలముననరిగియరిగి । చూచుచుండునట్లుచూవెసంసారకా ।
ననమునందుఁదిరుగుజనులనడువు ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౪౨. క॥ నలసారముసంసారము । ఖలదుఃఖావహాముభయ
నికేతనమతిచం । చలముపరాధీనంబిం । దులజీవనమేలనమ్ముదురు
తత్వజ్ఞుల్ ॥ ఆది । ఆ ౬ । పు ౮౩.

౪౩. క॥ మఱిఁదలపఁగసంసారం । బతిచంచలమొందమూ
వులట్టులసంప । త్ర్పతతులతిక్షణికంబులు । గతకాలముమేలువ
చ్చుకాలముకంటెన్ ॥ ఆది । ఆ ౫ । పు ౬౫.

౪౪. క॥ ఇవియెల్లనశాశ్వతములు । భవమరణాకలితము
లునుబటుసంసారో । ద్భవదుఃఖయుక్తములుసుఖ । లవయుత
ములువీనియందువాల్యంబేలా ॥ అను । ఆ ౩ । పు ౫౪.

౪౫. గీ॥ అస్థిరేంద్రియసలిలమయంబుగాను । రోషదా
రుణగ్రాహప్రదూషితంబు । నైనసంసారసాగరమతులధైర్య ।
పోతపాత్రికనిస్తరింపుముకుమారా ॥ శాంతి। ఆ ౬ । పు ౧౨౪.

౪౬. క॥ వినుసంసృతిమృత్యువు । పట్టనఘానిస్సంగవృత్తి
యమరగృహముని । ట్టనిట్లుగుటంగనుఁగొని । తునుముముసం
సారరజ్జుదురితవిదూరా ॥ శాంతి । అ ౪ । పు । ౭౦.

౪౭. క॥ ప్రియవస్తువెడలుటయున । ప్రియంబువాటిల్లుట
యుఁబరిజ్ఞానవిని । శ్చయహీనులైనయల్పా । శయులకుదుఃఖం
బుఁజేయుజగతీనాథా ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨.

౪౮. చ॥ గజతురగాదిసంపదలుగాంతలతోడివిహారలీలలుం
బ్రజకసురాగమొందఁబరిపాలనసేయుక్రమంబుఁబోరుల । న్విజ

యముఁబొంది పేర్చు టయువిస్ఫురితాభరణానులేపవ । స్త్రీజని
తవైభవంబుగలరాజులుఁబోయిరిగాకనిల్చిరే ॥ ఉద్యో । ఆ ౨।
పు ౨౨.

౪౯. క ॥ ప్రియములునప్రియములునుహృ । దయమునఁ
జిక్కువడఁజేయఁదత్త్వదనేక । క్రియలకుఁజొచ్చునరుఁడుమేన్ ।
వ్రయమగుటెఱుఁగండుచెడుజరావ్యాధులచేన్ ॥ శాంతి। ఆ౪।
పు ౮౩.

౫౦. క ॥ ప్రియములువాయుటయునున । ప్రియములువెస
బొందుటయును బెల్లుగనగుఁద । క్రియలందుమూఢమతికిహృ।
దయతాపమువాయదెపుడుదరికొనియుండున్ ॥ఆ౪। ఆ ౫। పు ౯౭.

౫౧. క ॥ వినుఁడీసుఖమునుదుఃఖము । ననిత్యములుగాన
వానిమాగనుకాలం । బునముదమునుశోకముపొంగ । కొనమి
యుఱువునూవెశాంతిఁగోరుజనులకున్ ॥ శాంతి। ఆ౧। పు ౧౧

౫౨. క ॥ బ్రదుకుచెడుటపొగడఁబడుటదూఱొందుటయూ
గిపేఁదుకొనుటయిట్లుమఱియుఁ। గలుగుసౌఖ్యదుఃఖములువచ్చు
నెడనెడ । వానికింతయేలవగవనధిప ॥ ఉద్యో ।ఆ౨। పు ౨౨.

౫౩. క ॥ వినుపర్యాయంబునసుఖ । మునుదుఃఖముఁజెందు
జనులఁబురుషుఁడుధైర్యం । బునగర్వంబువిషాదం। బునడంగింపఁ
దగునంద్రుబుధులదివినవే ॥ శాంతి । ఆ ౪ । పు ౮౬.

౫౪. క॥ కడుకొనికడుదుఃఖములగు । నెడనుచితమెయా
త్మనిందయెయ్యెడలమనం । బడలకనేకాకృతినె । ప్పుడునుండుట
చూవెపురుషుపురుషార్థమిలన్ ॥ ఆర । ఆ ౪ । పు ౭౩.

౫౫. క॥ ఈలోకమునిస్సారం । బాలోకింపంగనధిపయత్నో
లయనితా । లోలతఁబొందనిపురుషుం । డేలానెవ్వగలఁజేరని
చ్చ్యమనంబున్ ॥ (స్త్రీ) । ఆ ౧ । పు ౨.

౫౬. క॥ నేర్పరిపెక్కువిధంబుల । నార్పఁగబొమ్మలుగడం
గియాడెడుచందం । బేర్పడఁగాన్పుముకాలసమర్పితకార్యకరు
లైనమానవులదెసన్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౬.

౫౭. క॥ నరవరసరసాన్నంబులుఁ । బరిమళసద్వస్తువులును
బరమశయనవి । స్తరములుఁగాలాధీనత । నరుఁబొందుంబా
యువానినమ్మమియయుఁజున్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౨.

౫౮. క॥ కాలమడఁగించుజనుఁగ । ల్లోలినిగిరిద్రెంచుకరణి
లోభక్రోధా । శీలత్వకామభయములఁ । దేలుజనుఁడుకాల
వృత్తిఁదెలిఁగునెఱుఁగునే ॥ శాంతి । ఆ ౮ । పు ౮౭.

౫౯. క॥ కమలంబులుదోగలువికా । సముఁబొందుటలతలు
దరులుసకుసుమఫలభా । వముఁబొందుటపక్షులునుమృగములు
నుపదకలములగుటకాలకలితముల్ ॥ శాంతి । ఆ ౧ । పు ౧౦.

౬౦. సీ॥ మేలుగీడునునరుఁబొందుఁగాలముననే । వశ్యము
నుడానిఁగోరినవచ్చుటయును । వినుముద్రోచినఁబోవుటయును

సురేంద్ర । కలదెయేరికిఁగావునవలదుచింత ॥ శాంతి । ఆ ౪ । పు ౫౬.

౬౧. గీ॥ రాత్రితెగుదలదినమేలరాకయుండు । దినముతెగుదలరాత్రియేతేరకున్నె । పరఁగసుఖదుఃఖములుకాలపర్యయమున । నెందుమనుజులఁబొందకయేలయుడుగు ॥ ఆర । ఆ౫ । పు ౧౦౯.

౬౨. క॥ బలమునుబుద్ధియుఁజేవయు । నలఘుమతియుల్లసిల్లునగుకాలమునం । బొలియుంగాలవిపర్యయ । కలనంబునబుధులకుబ్బుఁగలకయుఁగలవే ॥ మా । ఆ ౧ । పు ౧౩.

౬౩. క॥ కళలుంగాష్ఠలులోనుగఁ । గలచిదురలఁగూర్చికొనుచుఁగాలంబుజనం । బులవడ్డికిచ్చునాతని । వలెనలవడఁబొదివితనకువశ్యులఁజేయున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౫౭.

౬౪. క॥ లోకముకాలముచేసి । ట్లాకులపడుచునికిగాంచి యధికధృతనిధ । శ్రీకాంతలానిరూఢిం । గైకొనిత్రోవంగవలదెకాలవికృతులన్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౬౫. క॥ ఈలోకంబులనెల్లం । గాలముపక్వములుసేయఁగానెవ్వాఁడ । క్కాలముపక్వముఁజేయం । జాలునతండమృతునజరుసత్యుఁగనుటకున్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౬౬. క॥ కాలమునేమనవచ్చును । గాలముగాలంబపోలుఁగాకొంటికినీ । లీలలుగలనేలెస్సగ । నాలోకించితిదిహింతమునభిమతమునగున్ ॥ మహా । ఆ ౧ । పు ౧.

౬౭. ఉ॥ కాలవిపర్యయంబునసుఖంబును దుఃఖమువచ్చు
చుండునె । కాలమునేరికిన్ ధ్రువముగాదుసుఖంబునుదుఃఖ
మున్ మహీ । పాలబుధుండుదద్ద్వివిధభంగులెఱింగిప్రమోదఖే
దసం । శీలుఁడుగాఁడురెంటనుబ్రసిద్ధపథంబుననప్రమత్తుఁడై ॥
అర । ఆ ౫ । పు ౧౨౧.

౬౮. గీ॥ కాలకబళనైకశీలుఁడైమృత్యువు । గెలిచిశాశ్వత
మునచలముశివము । నచ్యుతమునానామయమునమృతమునవ్య
యంబునగుపదంబునందునిలుచు ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౦.

౬౯. క॥ అర్థమయనర్థమూలం । బర్థమమాయావిమోహ
నావహమునరుం । డర్థార్జనదుఃఖమునన । పార్థీకృతజన్ముఁడగుట
పరమార్థమిలన్ ॥ అర । ఆ ౧ । పు ౨.

౭౦. గీ॥ ధనముగలిమియులేమియుఁద్రాసునందు । నిలిపి
యెత్తంగములునూపెనిర్ధనత్వ । మెక్కుడైదానిదిక్కుననెట్టుల
న్న । వినుముగుణదోషములభంగివిస్తరింతు ॥ శాంతి । ఆ ౪ ।
పు ౭౦.

౭౧. క॥ ఎచ్చోటనైననధనుఁడు । విచ్చలవిడినుండులేదువె
ఱపించుకయుం । బొచ్చెంపు చందమొల్లఁడు । మెచ్చరెసుర
లైనఁబలుకుమృదువైయుండున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౦.

౭౨. క॥ కోపంబునులోభంబును । నేపారిమనంబుగలఁపనె
ప్పుడుఁజింతా । తాపంబునొందునధనుం । డాపదగాకవిన్వధము
సుఖావహమగునే ॥ శాంతి । ఆ ౪ । పు ౭౦.

౭౩. క॥ ధనముగలవాఁడుమృత్యువ।దనమునయున్నట్లుభయ ముచనచిత్తమునం । దనుకఁగనుల్లలనుడుకును । వినుశిఖిచో రాదిముఖ్యవిషయాపదకున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౦.

౭౪. గీ॥ జలములందుమత్స్యంబులుచదలఁబక్షు । లామిషంబెట్లుభక్షించునట్లుతివిరి । యెల్లవారునుజేరియనేకవిధుల । నను దినంబునుభక్షించురర్థవంతు ॥ ఆర । ఆ ౧ । పు ౨.

౭౫. గీ॥ వినుధనార్జనంబుధనరక్షణంబుధ । నవ్యయంబుధన వినాశనముఁబ్రబ । గాఢదుఃఖదములుగావునదుఃఖభా । జనము ధనముగాల్పుమనఁగవలయు ॥ అను । ఆ ౫ । పు ౧౫.

౭౬. గీ॥ కలిమిఁయును లేమియునువినుకాలవశగ । తము లుబోధవిహీనులదర్పదైన్య । కలితసుఖదుఃఖములఁబెట్టుగాకయర్థ । ములయనిత్యతయెఱిఁగినఁగలదెవికృతి॥ శాంతి । ఆ ౫। పు ౧౦౪.

౭౭. గీ॥ కలిమిలేములనఁగఁగలవొకరెండవి । యత్నగౌరవమునయత్నతయును । గలుగవచ్చుననుటగాదదినూబేలు । దనముథినుము తెలియననిమిషేంద్ర॥శాంతి । ఆ ౪ । పు ౧౪.

౭౮. క॥ తేరకయుండఁగఁజేరుం । దేరంగాఁబోలియువిధి యధీనంబులుగా । కారయవిత్తంబులుపురు । షాకంభాయత్త ములెమహాబుద్ధినిధీ ॥ శాంతి । ఆ ౪ । పు ౧౪.

౭౯. క॥ సారవుసిరిచేటునరుఁడు। కోరకయేవచ్చునట్లకోరక యుండన్ । శ్రీరాకగలుగుదైవము । కారుణ్యముగలిగెనేనిగా ఢవివేకా ॥ శాంతి । ఆ ౩ । పు ౪౮.

౮౦. క ॥ జననీజనకులునుసుహృ । జ్జనులునుదెగునపుడు
కావఁజనమిఁదెలియదే । ధనములువారలకంటెన్ । మనుజే
శ్వరవగపువానిమగుడించునెకో ॥ శాంతి । ఆ ౩ । పు ౪౮.

౮౧. క ॥ లోకముచందముగనుఁగొని । యీకొనఁగనగు
ధనాదులెల్లనుగాల । వ్యాకులతఁబొందఁగలయవి । గాకుండ
మియెఱిఁగివిడుపుకడుఁజదురెండున్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౦.

౮౨. గీ ॥ అర్థవంతుఁడై భోగంబులనుభవించు । చున్నయ
ప్పుడయిదియిట్టులుండనేర । దస్థిరమతానులోనుగాననియెఱుం
గు । నతఁడువగఁబొందఁడేదియైననధిప॥ శాంతి॥ఆ ౩। పు ౪౮.

౮౩. క ॥ శత్రుజనులఁజెరుచుటయును । మిత్రులఁబ్రదికించు
టయునుమిన్నకయూప । త్పాత్రతసంపదయనఁగవి । ధాత్రిఁ
డుచెందించుఁజూవెతరితోఁబురుషున్ ॥ శాంతి। ఆ ౪।పు ౭౮.

౮౪. క ॥ వెరవునులావునుగలిగిన । పురుషులులేరెట్లులో
కముననెవ్వరికిన్ । సిరిశాశ్వతంబెయనివగఁ । బొరయఁడుధీ
రుండుకలిమిపోకకునధిపా ॥ శాంతి । ఆ ౩ । పు ౪౮.

౮౫. క ॥ మనమునకుసుఖముగోరెడు। జనులకునర్థక్రియా
విశారదభంగుల్ । పొనుపడవిడిచిభరములే । కునికియయూ
హించిచూడనురువెబ్బంగిన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౬౬. క ॥ ధనవత్త్వముదుఃఖకరం । బనితనితత్క్లాంతువిడు
చునతనికిధనతా । జనితాత్మాధీనత్వం । బనుపమసౌఖ్యంబుసే
యునక్షీణముగన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౬౭. క॥ సిరివిడుచుచుబురుషునివిను।పురుషుఁడుసిరివోలఁగను
నిదియపూర్వమెఫలముా । లరతుఁడ్తైవాజ్ఞియతిం। బొరసేఁయు
నికియట్టిచోటఁబురుషునకమరున్ ॥శాంతి । ఆ ౩ । పు ౪౬.

౬౮. గీ ॥ సకలభూతంబులకును శాసకుఁడుగలఁడు । గాడె
యొక్కరుఁడాతనికల్పనమునఁ । బ్రాప్తమైనదినీళ్లులుపల్లమునకు।
వచ్చుక్రియఁదానవచ్చుగీర్వాణముఖ్య॥ శాంతి।ఆ ౪।పు ౬౭.

౬౯. క ॥ నరనాథసుఖముదుఃఖము । పరువడిమైఁబొరయు
గాకఁబన్నుగనరునిం । బొరయునెయందొక్కటియవి । పొరసి
నవలదూఁదమోదమునుఖేదంబున్ ॥ శాంతి । అ ౪। పు ౭౫.

౭౦. క ॥ శోకభయస్థానంబుల। నేకముగలిగినవివేకహీనుఁ
డుమదిలో । నాకులతఁబొందునట్లువి । వేకముగలవాఁడుబుద్ధి
వికలుండగునే ॥ ఆర । ఆ ౧ । పు ౨.

౭౧. క ॥ కానియటులుండినెఱేఁబడు । నైనతెఱఁగుదోఁచి
మాయమగునిబ్భంగి । న్మానసమునకుబ్బువగఁయు । దేనోపుం
బనులుబుధుఁడుదేలఁడు రెంటన్ ॥ శాంతి । ఆ ౩ । పు౪౬.

౭౨. గీ ॥ ఏనుగర్తననుటయెఱుఁగపెఁదాగర్త । యేనినెల్ల
ఫలములెడలకుండ । నఖిలకర్మములునునాచరించుచున్న ।
వాఁడెకానఁగర్తగాఁడుదాను ॥ శాంతి । ఆ ౪ । పు ౭౪.

౯౩. సీ॥ కావ్యఫలములయెడదానకర్తనుట। కడునెఱుం
గమిసువ్వొత్తాగర్తయేని। తగిలితనదైనకార్యజాతంబునెల్ల। జెడ
కఫలియించునట్లుగాఁజేయరాదె॥ అర। ఆ ౫। పు ౯౩.

౯౪. క॥ ధైర్యంబునవీర్యంబున। శౌర్యంబునఁబ్రజ్ఞఁబడయఁ
జాలునెనరుఁడే। కార్యమునుబ్రాప్యమైనను। నార్యుండదియె
ఱుఁగుఁగాననడలఁడుశక్రా॥ శాంతి। ఆ ౪। పు ౭౬.

౯౫. క॥ ఎలమియువాడుటయునుదన। వలచినయెట్టివె
యెఱుంగవావిధిచరితం। బులుబలవంతములగుటయు। వలదె
వివేకంబుపెద్దవారికినింద్రా॥ శాంతి। ఆ ౪। పు ౭౫.

౯౬. క॥ ఇదినాకయ్యెంగాఁగల। యదియేయనుగాథని
శ్చయంబెవ్వనికె। మ్మదిఁగలుగునుబ్బువగసం। పదయాపదగలు
గదట్టిభవ్యునకింద్రా॥ శాంతి। ఆ ౪। పు ౭౬.

౯౭. క॥ భీరుఁడుశూరుఁడుజడుఁడువి। శారదుఁడబలా
త్మకుండుసబలుండనలే। చేరినయినమృత్యువుదు। ర్వారంబైయ
పహరించువైదికవర్యా॥ శాంతి। ఆ ౪। పు ౭౦.

౯౮. క॥ మొదలవిధినియతియానున। ట్టిదయందురుపెద్దలది
ఘటింపకపోదె। మదిఁజూచిచెప్పిననుద। ప్పదుమేరువుదిరిగినే
నిఁబాంచాలసుతా॥ ఉద్యో। ఆ ౩। పు ౪౧.

౯౯. క॥ గతమునకునువగవకయా। గతమునకునునోరు
దెరచికడుఁగోరకది। నతఁబొందకదైవంబే। గతిఁబంచినదానఁ
బోదుగాకనవలయున్॥ శాంతి। ఆ ౩। పు ౪౮.

౧౦౦. క ॥ హర్షంబునుమానంబున । మర్షమునపరాధమును సమదభావమును । త్కర్షాపకర్షచింతల । నార్షసమాచారము నునిరస్తగుణంబుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౬౯.

౧౦౧. సీ ॥ అనియతంబులైనయాహారవిహారణ । శయనము లవిధాత్మసంప్రయుక్త । భంగిఁబరఁగునంతరంగనిర్వ్యాపార । ర్తన ముకలిమియజగరవ్రతంబు ॥ శాంతి । ఆ ౪ । పు ౭౨.

౧౦౨. గీ ॥ చలనమేదిపుట్టుఁజావునుంబిరువెట్టి । యామిసా ర్థిజనులనపహసించు । నెలమితోడలేమికలిమివాటింపనీ । రమ ణానునికియజగరవ్రతంబు ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౦౩. క ॥ సకసాన్నముబిణ్యాకము । సరిగాభుజియింతుమృ దులశయ్యాతలముఁ । ధరణియుశయనరుచికినా । కరయంగా నొక్కరూపయసురప్రవరా ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౦౪. గీ ॥ నారచీరయేనిఁజారుచీనాంబరం । బైనఁగట్టుకొని నయపుడుమహ్మృదయ । మొప్పదొప్పననకయుండురూపాదుల । నలమికొనవుచక్షురాదికములు ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౦౫. క ॥ మేలర్థింపనుగీడున । జాలింబడితొలఁగఁద్రోవ సరిదూష్ణీభా । చాలంబిమనస్కుఁడనై । యాలంబుగఁజేసినడు తునయ్యిరుదెఱఁగుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౭౧.

౧౦౬. క ॥ శాకకణమూలఫలపి । ణ్యాకాదులభైక్ష్యమై నయన్నంబునని । శ్లోకతనాఁకలిపుచ్చుచు । లోకాలోకంబు ననచలుఁడుగావలయుఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౬౨.

౧౦౭. క ॥ దాంతుఁడుప్రజ్ఞావంతుఁడు । శాంతుఁడునగు
వానిమానసంబాయాస । శ్రాంతముగాదమ్మెయిని । శ్చింతుఁడ
నైయుండుదునువిశిష్టవిచారా ॥ శాంతి । ఆ ౮ । పు ౨౫.

౧౦౮. గీ ॥ భావములునిజస్వభావంబునవతోఁచు । నడఁ
గునట్లుగానవస్థిరతకు । నెలవులనియెఱుంగనేర్చినభావంబు। లం
దుఁదగులునెట్లుడెందమనఘ ॥ శాంతి । ఆ ౮ । పు ౨౮.

౧౦౯. చ॥ బలమునునెప్పుబుద్ధియునుప్రౌఢతయుంగలవా
రులేనివా । రలనకయొక్కభంగిఁదరిరాకయచూచివారించుచుం
డువి । చ్చలవిడిఁగాలుఁడట్లగుటసారమతింగనియున్న వాఁడను,
ష్మలికమునుబ్బునాదుమదిమందునకైనను లేదువాసవా ॥ శాంతి।
ఆ ౮ । పు ౨౯.

౧౧౦. క ॥ కావునభూతానిత్యత । భావించుటయెపుడుఁ
గలిగిబంధచ్ఛేద । ప్రావీణ్యముసంపరితో । షావహమునుగన్న
వాఁడనమరప్రవరా ॥ శాంతి । ఆ ౮ । పు ౨౯.

౧౧౧. క ॥ వినుఁడవ్యక్తాంతంబగు । పనియెల్లనవిద్యనెల
యుబంధమమమతం । బనఁబడినమృత్యువమృతం । బనఁజనున
దినిర్మమత్వమారఁగలిగిన్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౧౧౨. క ॥ ప్రజయేనకాననన్నుం । బ్రజనుగతికిఁబుచ్చిన
నిభరంపడికోరం । బ్రజవిడిచెదనాయందది। యజేయమునునవ్య
యంబునగుపదమిచ్చున్ ॥ శాంతి । ఆ ౯ । పు ౧౦౮.

౧౧౩. క ॥ వినుపశుయజ్ఞముహింసన। మనంతఫలదంబుగా
దహంకృతిసహితం । బనఘాజ్ఞానసమయం । బనుయాగంబి
చ్చునవ్యయానందంబున్ ॥ శాంతి । ఆ ౮ । పు ౭౦.

౧౧౪. క ॥ మనసును వాక్కును గక్షం । బనుపడు నెవ్వనికి శ్రుతితపస్త్యాగములా । తని చేతిలోని వగునని ॥ మునిజనముల చేతవినెదము నిరంతరముగ్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౧౧౫. క ॥ పాణియుపస్థయునుదరను । వాణియనఁగమూయరానివాకిళ్లవిగీ । ప్రాణులకువీనిబుధుఁడుపు । రాణపురుషవశ్యకైతిరంబుగమూయుగ్ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౦.

౧౧౬. క ॥ గతహర్షభయక్రోధుఁడు । ధృతిమంతుఁడునప్రమత్తధీమహితుఁడుసం । శ్రితధర్ముఁడుదాంతుఁడునగు । నతఁడవసాదంబునొందఁడతులవివేకా ॥ శాంతి । ఆ ౫। పు ౯౧.

౧౧౭. క ॥ చుట్టముపగయును భేదం । బెట్టిజనులవలనఁదగులదెల్లప్పుడు నే । పట్టున నెద్దానను మదిఁ । బుట్టదుసంతోషమా నిబుద్ధాత్మునకుగ్ ॥ శాంతి । ఆ ౫ । పు ౮౯.

౧౧౮. సీ ॥ ప్రియమునప్రియంబుఁ బెల్లగుసౌఖ్యము । ఖములుభూతభావికార్యములును । నెవ్వనికిసమంబులివిసర్వధనియనఁ । బరఁగుఁజువ్వెయట్టిభవ్యుఁడనఘ ॥ అర । ఆ ౭। పు ౧౬౧.

౧౧౯. క॥ సంగముబంధమఖిలని। స్సంగతమోక్షంబుబహువిచారములేలా । పింగజటాజూటకలిత। గంగాబాలేందుమహితగౌరీసహితా ॥ అను । ఆ ౪ । పు ౬౫.

# ౨ - జ్ఞానము.

౧౨౦. సీ॥ పంచభూతంబులఁబరఁగింపఁగుదియుంపఁజాలుద
ఉతవానినేల్పుప్రభుతఁ । దనరుమనంబురథ్యములసారథియొట్టుల
ట్లింద్రియంబులనాఁగనడప । నదియవలంతిభూతాత్మకంబునుబు
ద్ధిసన్నాహమునుమనస్సారథికము । నింద్రియాశ్వమ్మునైనయీ
ద్యైరథఁబుననభిమతగతినంతరాత్ముఁడేందు ॥ గీ॥ నెలమివర్తించు
నిట్లగుకౌశలంగుబుధుఁడు । ఘోరసంసారమోహవాగురకులో
ను । గాకనిర్గుణపదమునఁగ్రాలికనుని । రామయమునవ్యయం
బునునగుపదంబు ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౧౨౧. వ॥ అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహం
కారవిటపంబును మహాభూతోపశాఖంబును నింద్రియకోటరం
బును సంతత శాడ్వలంబును శుభాశుభ ఫలంబునై సంసారవృ
క్షంబొప్పుచుండు ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౨.

౧౨౨. క ॥ జ్ఞానాసినదినఱికియభి । మానాహంకారదూర
మతియగుపురుషుం । డానందముప్రస్ఫుటముగఁ । గానంగానే
ర్చువిగతకల్మషులారా ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౨.

౧౨౩. క ॥ వినుగుణములుమాయకునెడ । లనియేఱిఁగి
తమోరజస్సులడఁచినసత్వం । బుననిలిచిసద్వివేకం । బుననది
యుంద్రోచివిమలబోధాత్ముఁడగుఁ ॥ శాం।ఆ ౪।పు ౭౪.

౧౨౪. క ॥ వేదాంతవిదుఁడుదుర్లభుఁ । డాదరముప్రవృత్తి
లక్షణాన్వితమగుధ । ర్మోదయమండెకలుగునది । లేదరయనివృ
త్తిసాఖ్యలీనత్వమునఁ ॥ శాంతి । ఆ ౪ । పు ౬౧.

౧౨౫. క ॥ తోలుదిగవిడిచినాగము । లీలఁబోలుచుమా ఢ్యుఁగర్మలేపముఁదనలోఁ । గీలుకొననీకవెలుఁగుని । రాలంబన బోధఘనుఁడురాజవరేణ్యా ॥ శాంతి । ఆ ౪ । పు ౧౨౪.

౧౨౬. క ॥ పాపక్షయమునబోధం। బాపాదింపంగమెఱుఁ గుటద్దముకరణిం । జూపునకువచ్చుఁదనుఁడా । నాపురుషుఁడు గాంచుపనికినైతన్మయతన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౨౭.

౧౨౭. క ॥ స్థావరములజంగమములl నావిభుఁడువసించు నతనియందునవి నిస । ద్భావాసతనుండునుదl ద్భావనమెఱుఁగు టదద్వైక్యపదముంజేర్చున్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౧౨౮. చ॥ వినయమువిద్యయుంగలుగువిప్రునియందునుగోl వునందునె । ప్పునెఱియుహస్తియందునొకపోకకుఁబోవనికుక్క యందుదాl నినడిచితెచ్చివండితినునీచపుమాలనియందుఁదుల్యద ర్శనులుతదంతరాత్మునినిరంజనునింగనునట్టిపండితుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౧౨౯. క ॥ విమలజ్ఞానముఁదపమును । దమమునుద్యాగం బుశౌర్యతప్రచురానం । దమునకుమూలములంద్రుని । జము గాఁగైకొండ్రవియప్రసన్నవివేకుల్ ॥ శాంతి।ఆ ౧। పు ౮.

౧౩౦. క॥ జ్ఞానముకేవలకృపనlజ్ఞానికినుపదేశవిధిఁబ్రకాశ ముఁజేయంగానడిసకలధరిత్రీ । దానంబునకంటెనధికతరఫలద మగున్॥శాంతి । ఆ ౪ । పు ౮౦.

౧౩౧. క ॥ గురుఁడెవ్వఁడైననగునిl వ్వెరవుపదేశించువాఁ డవేల్పుగశ్రద్ధా । పరమతిగావలయుజనన । మరణంబులుశ్రద్ధ లేనిమనుజుంజెందున్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౧.

౧౩౨. క ॥ అలయకయేండ్లుగపంబె । క్కులుజీవించుటనె
రగలుగుటయుందగువృ । ద్ధులలక్షణమేజ్ఞానము । గలఁడేనిఁ
బాలుఁడైనఁగడువృద్ధుమహిన్ ॥ ఆర । ఆ ౩ । పు ౫౯.

౧౩౩. క ॥ జ్ఞానంబువడయుటకువా । జ్ఞానసములుసునియ
తములుగావింతురుస । న్మానితశాంతికొఱకువి । జ్ఞానంబుననా
త్మనియతిసల్పుదురుబుధుల్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౧.

౧౩౪. క ॥ మనసునువాక్కునుగాయం । బునియంత్రితము
లుగఁజేసిపొందుదురుధనం । బునకైబ్రముచ్చులుదానిం । గనుఁగొ
నఁగావలదెమోక్షకాంక్షికివత్సా ॥ శాంతి । ఆ ౪ । పు ౮౨.

౧౩౫. క ॥ వినుమజ్ఞానంబునఁగ । ర్మనిరూఢతగలుగుదాన
మలగవుజననం । బునుమరణమునన్యజ్ఞా । ననిత్యుఁడగువాఁ
డుమోక్షణముఁజుల్కఁగనున్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౧.

౧౩౬. క॥ జ్ఞానాజ్ఞానంబులకుం । దానయుపాశ్రయముబుద్ధి
తత్త్వాహంకా । రానూనలక్షణాద్యం । బైనయెఱుకదానిజీవుఁ
డనిచెప్పశ్రుతుల్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౧౩౭. క ॥ జ్ఞానంబునాశ్రయించిన । వానికినేపనులఁగీడు
వాటిల్లదుప్ర । జ్ఞానకహితుండుగానూ । ధీనతమెయిఁగర్మసమి
తిత్రిప్పులఁజిక్కఁడు ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౧.

౧౩౮. గీ ॥ జ్ఞానముననకానిజన్మజరామృత్యు । వులజయించు
నట్టియలఘుమోక్ష । పదముగల్గనేరదదిగారణముగను । జ్ఞాన
మెల్లభంగిసాధ్యతమము ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౧.

౧౩౯. గీ ॥ జ్ఞానపూర్వమైనసన్న్యాసకలనంబు । పరమగతి నొనర్చు భవ్యులార । ద్వంద్వరహితుఁడగునతనిజరామృత్యుని। స్తరణకరణమైనధర్మమొందు ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౧.

౧౪౦. క ॥ మానవులకుఁదలఁపఁగన । జ్ఞానమునట్టిపగతే దసంగతకృత్యా । ధీనుండైరూపుచెడును । దానంగావునసుదా త్తధర్మవిధిజ్ఞా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౧౪౧. క ॥ వినుమువ్మృణాళంబుననం। టినరోంపిజలంబులం గడిగినను బెడవా । సినక్రియవిమలజ్ఞానం । బునసంసారంబుపా యుఁబురుషునరేంద్రా ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౧౪౨. క ॥ జ్ఞానంబుదృష్టినరునకుఁ। గాననయనహీనునడు పుకనణియగునుబ్ర । జ్ఞానవిహీనునినడవడి।దీని నెఱుఁగవలయుఁ నెఱుకదెచ్చుకొనంగన్ ॥ శాంతి । ఆ ౪ । పు ౮౧.

౧౪౩. గీ ॥ నిత్యతృప్తిశౌచనిరతితాల్మిసమత్వ । మారగలి గిచిత్సుఖానుభవము।ప్రచురమగుటయజగర్జవ్రతమదివిను। యజ్ఞ దుర్లభంబుప్రాజ్ఞభూమి ॥ శాంతి । ఆ ౪ । పు ౭౨.

౧౪౪. క ॥ ప్రజ్ఞయప్రతిష్ఠలాభము । ప్రజ్ఞయనాకంబనం గఁబ్రజ్ఞయచువ్వే । ప్రజ్ఞయకైవల్యమ్మును। ప్రజ్ఞాసాధ్యములు గానిపనులుంగలవే ॥ శాంతి । ఆ ౪ । పు ౭౨.

౧౪౫. క॥ ప్రాజ్ఞుఁడురమించునెక్కడ। ప్రాజ్ఞుఁడుపెక్కం డ్రఁబ్రీతిఁబరఁగఁగఁజేయుం । బ్రాజ్ఞుఁడుబలవంతుండగుఁ । బ్రా జ్ఞుఁడుకలహంబుదొట్టిపడకతొలంగున్ ॥ శాంతి।ఆ ౫।పు ౧౧౧

౧౪౬. గీ ॥ వినుముప్రజ్ఞాధిరూఢుఁడై వనటదక్కి । సంసృతి
క్లేశపరులభూస్థలిజరించు । వారినచలంబుపైనున్న వాఁడుచూచు ।
నట్లుచూచుటసువ్యోనేర్పమలహృదయ ॥ శాంతి । ఆ ౧ । పు ౭.

౧౪౭. క ॥ సుతనీవుసుప్రసన్నా । త్మతఁబొందినగాగ్రగతుఁ
డుమహీవారలఁబూ । చు తెఱఁగుననీభూత । ప్రతతింగనుఁగొను
చునుండుపరితృప్తుఁడవై ॥ శాంతి । ఆ ౫ । పు ౯౫.

౧౪౮. గీ ॥ వాఙ్మనఃకాయములుశౌచవంతములుగఁ । జేసి
కొనియనహంకారశీలశాంత । బుద్ధియైనిరపేక్షతఁబొందియఖిల ।
భూతదయగల్గిమెలఁగంగబోధమొందు ॥ శాంతి । ఆ ౮ । పు ౮౨.

౧౪౯. క ॥ వినురేఖామాత్రపుఁజం । ద్రునియట్టులజీవుఁడ
తనిదుష్కృతముఁబో । లినయజ్ఞానమునపగమ । మునబోధానంద
సాంద్రపూర్ణతఁబొలుచున్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౩.

౧౫౦. క ॥ ఈతెరువునవేదవిదుఁడు । వీతామ్యాయుండు
ధర్మవేదియుఁబాపా । స్పృతుఁడుసరియైకడతుర । నాతురతజరా
మరణమహాంభోరాశిన్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౧.

౧౫౧. క ॥ తమమురజస్సుదొరఁగిస । త్త్వమునపరమియిం
చియగుణతత్త్వముగనిస । త్త్వమునుదిగవిడుచువైరాగ్యమహి
తుఁడగుమునివరుండకల్మషులారా ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౧౫౨. క ॥ ఆతెఱఁగఘములఁబాపును । బాతకములువాయ
మొగులువాసినసంప్ర । ద్యోతితుఁడగునమృతాంశుని । భాతివె
లుఁగునాత్మమోక్షపథమడిసుండీ ॥ శాంతి । ఆ ౫ । పు ౧౧౦.

౧౫౩. క ॥ జ్ఞానముసవిశేషస్థితి । దానికినాశంబులేదుదా నిఁదెలియుట। న్జ్ఞానాహంకృతిమమతలు। మానిననిర్మలుఁడుమో క్షమార్గముఁగాంచున్ ॥ అశ్వ। ఆ ౨।పు ౨౧.

౧౫౪. క ॥ జ్ఞానమయింధనముగవి।జ్ఞానాగ్నింబ్రబలఁజేయ జరయుమరణము । న్నానావిధదుఃఖంబులు । లేనియమృతమ క్షరంబులైపైనతోఁచున్ ॥ శాంతి । ఆ ౪।పు౬౨.

---

## ౩ - తపము.

౧౫౫. క ॥ ఇయ్యఖిలముసృజియింపఁగ । నెయ్యదిప్రభు వమ్మహామహితభూతముపొం। దయ్యెడిశుభంబుతపమునఁ।జయ్య నసిద్ధించునదియసంశయమనఘా॥ శాంతి । ఆ ౫ । పు ౯౨.

౧౫౬. క ॥ అవ్యక్తాదికసకలము । నవ్యయుఁడగుపురుషుఁ డాశ్రయంబుగఁబరఁగున్ । సువ్యక్తంబుగనదిగను । భవ్యులువ డయుదురుమోహబంధవిముక్తిన్ ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౧౫౭. క ॥ వినుఁడక్కసుటక్షమూలం । బనఘంబగుతపమ యగుటనతినిష్ఠఁదపో । ధనసమ్యగ్విధసముపా। ర్జనమునవశ్యం బువలయునన్నతులారా ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

౧౫౮. క ॥ తపమనగసకలవిషయ । వ్యాపేతమగునట్టిబుద్ధి వైభవముసుమీ । తపమునసుస్థిరుఁడగుమో । గపరునకుంగ లవెయొండుకర్తవ్యంబుల్ ॥ అర । ఆ ౫ । పు ౯౪.

౧౫౯. క ॥ శివకరముదపముమేధా । ధవసకలజనంబులకును దానికిమూలం । బవిరళశమదమసంపద । లపుటనివిమనంబుతో డనలవడవలయుఙ్ ॥ శాంతి । ఆ ౫ । పు ౯౦.

౧౬౦. గీ ॥ అధ్వరంబుకంటెనధికంబుతపము। దపంబునాఁ గమేనిప్రసన్నఁదనమునిపురఁజేఁతగాదహింసయుసత్య। వాక్యంబు దమముదయయుఁగానియర్థయ ॥ శాంతి । ఆ ౨ । పు ౪౧.

౧౬౧. క ॥ సత్యంబుబ్రంహాచర్యము । నిత్యశుచిత్వమౌనమతులనియమముదయశు । ధ్ధత్యాగంబుఁదపస్సం । పత్త్యాకృతు లంద్రుబుధులుపౌరవముఖ్యా ॥ అను । ఆ ౩ । పు ౫౯౦.

౧౬౨. క ॥ క్షమలేనితపసితపమును। బ్రమత్తసంపదయు ధర్మబాహ్యప్రభుతా । జ్యముభిన్నకుంభములతో। యమూలట్టుల యధ్రువంబులగునవియెల్లన్ ॥ ఆది । ఆ౨ । పు ౨౨.

౧౬౩. క ॥ అనఘూతపోవనంబున । జననంబునుమరణదశ యుసంప్రాప్తముల । య్యేనయేనివాఁడుముక్తుఁడె । మనంబుబహుకామవికృతిమగ్నంబైనన్ ॥ శాంతి । ఆ ౬ । పు ౧౨౪.

౧౬౪. గీ ॥ అనఘసుఖదుఃఖములువచ్చినపుడుముదవి । షాదములులేకసంప్రాప్తసముపభోగ। రతుఁడునప్రాప్తవాంఛాని రాసకుండు । నగుటసారతపోరూపమంద్రుబుధులు ॥ శాంతి । ఆ ౫ । పు ౧౦౯.

౧౬౫. క ॥ మమతాహంకృతిరహితత । పమునఁబ్రజాపతి సమీపభవ్యపదమునం । యమిపొందునిందుసందే । హమొకింతయులేదునిర్మలాత్మకులారా ॥ అశ్వ । ఆ ౨ । పు ౨౩.

